# వర్ణాశ్రమధర్మ పరిణామము



# ఉపోద్ఘాతము

:o:-

సంస్కృతము, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ మొదలగు భాషలలో కొంతప్రవేశముగలిగి, ప్రపంచములోని వివిధ మానవసంఘముల పూర్వచరిత్రను వానిసాంఘికపరిణామావస్థలను బాగుగా తెలిసికొన్న పండితులు, హైందవసాంఘికపరిణామశాస్త్రమును వ్రాయతగినవారు. నాకిప్పటికి లభించినంత వరకు, అట్టి శాస్త్రమునకై కొద్దిపరికరములను, మతధర్మశాస్త్రములనుండి క్రోడీకరించి యీచిన్నగ్రంథములో సూచించితిని. ఇట్టిశాస్త్రమును సత్యాన్వేషణమే ప్రధానముగా నెంచి, విమర్శజ్ఞానముతో వ్రాయుదలచుకొన్నవా రేమతములోగాని, యేమానవునిలోగాని, సంపూర్ణమైన సత్యమును, జ్ఞానమును కలవని విశ్వసింపకూడదు. ఆ మానవ సంఘములలోని ప్రస్తుతాచార యోగ్యతాయోగ్యతలను గురించిగాని, నూతనాచారములను చొప్పించుటలో సాధ్యతాసాధ్యతలనుగురించిగాని, యీ శాస్త్రకారునికెట్టిసంబంధముండకూడదు. సృష్ట్యుత్పత్తికి ఒక కారణముండవలెను గనుకను, దానికిని మనకు నేదియో యొకవిధమగు సంబంధముండవలెను గనుకను, దేవుడు, జీవుడు స్వర్గనరకములు, మోక్షము, పునర్జన్మ మొదలగు నాధ్యాత్మిక విషయములను, ఆయావ్యక్తుల నమ్మకములకు వదలివేయు వలసినదనియు, ప్రపంచములోని వివిధమతములు మా[illegible]

ములు ఆచారములు మొదలగునవి పరస్పరవిరోధములతో నిండినపుడు, వీనిలో నేవియు దైవదత్తములని భావించకూడ దనియు, నీశాస్త్రికారుడు, నిష్పక్షపాతముగ వ్రాయ దలచుచో, నెంచకతప్పదు. ఇట్టి మనస్స్వాతంత్ర్యముకల వారే, యిట్టిసాంఘికపరిణామశాస్త్రమును నిర్భయముగను, నిష్పాక్షికముగను వ్రాయుటకర్హులు. వారు ఆస్తికులు కానిండు, నాస్తికులు కానిండు. ప్రత్యక్షప్రమాణములమీద నాధారపడు భౌతికశాస్త్రములుతప్ప, అనుమానమే ప్రమాణముగాగల యితరశాస్త్రిచర్చలో దూరముగనుంచవలసినదే. ముఖ్యముగా మనహిందువులు తమసాంఘికాచారముల నన్నిటిని, ఊహాప్రపంచముమీద నాధారపడినకొన్ని మత సూత్రములతో సంబంధపరచి, వానిని సృష్ట్యాదినుండియు, భగవంతుడే యేర్పరచెననియు, అవి యనుల్లంఘనీయము లనియు, యెన్నటికిని మార్చకూడనివనియు, సర్వసాధారణ ముగనమ్ముచున్నారు. ఈవిచ్చిన్నమనకములకు, మనపూర్వాచార పరాయణులు, వర్ణాశ్రమధర్మవాదులు, సనాతనధర్మపరులు, దోహదమొసంగి వానిని నిలబెట్టజూచుచున్నారు సంఘ ములో నెట్టిమార్పులైనను చొప్పించకూడదనియు వానిని కాలప్రవాహముననే కలియుగములో వదలిచేయవలసి నదేగాని మనము సాధ్యమైనంతవరకు పూర్వాచారములనే పట్టుకొని వ్రేలాడుచు నరకమునుతప్పుకొనుటకు ప్రయత్నించ వలెననియు వీరివాదము. ఈమనోదౌర్బల్యము సంఘాభివృద్ధికి

భంగకరమనియు,తోడిమానవసంఘములవలెనే మనహిందూ సంఘముకూడ, ఇదివరకెట్టిపరిణామమును పొందినదో, ముందెట్లుపొందక తప్పదోచూపించుటకుమాత్రమేమనపూర్వ శ్రుతిపురాణేతిహాసములనుండి కొన్ని ప్రమాణములనిందుదహరించితిని. నాకంటె విద్యాధికులు, తమవిమర్శనజ్ఞానముతో, హైందవసాంఘికపరిణామశాస్త్రమును వ్రాయుటకీ చిన్నపొత్తమేమాత్రమైనను తోడ్పడినయెడల, నేను కృతార్థుడనని యెంచెదను.

మన హిందువులలోని సాంఘికాచారములు పూర్వము నుండి నేటివరకు నెట్లుపరిణామము చెందినవో తెలిసికొన్న యెడల అవి శాశ్వతమతధర్మములు కావనియు, సంఘాభివృద్ధికి కావలసిన మార్పులు చేసికొనుచున్న యెడల, మన యాధ్యాత్మికాభివృద్ధి కెట్టియడ్డంకులు కలుగవనియు స్పష్టపడును. ప్రపంచములో, బౌద్ధ, మస్లిము, క్రైస్తవ, పారశీకాదిమతముల నవలంబించు వారందరు, గుణకర్మలచేత ననేకతరగతులుగ విభజింపబడినను, సన్మార్గప్రవర్తనులైన యెడల స్వర్గమోక్షములను సంపాదించుకొనగలవారేయని మనసనాతనధర్మశాస్త్రములే వేయినోళ్ళ ఘోషించుచుండగా, మనవారు వర్ణసంకరమగునను భయముచేత, శాఖోపశాఖలుగ విడిపోయి, అన్యోన్యసహకారములేక ద్వేషపూరితులై, దురభిమానులై, మానవసౌభ్రాతృత్వమునకు భంగము కలిగించుచున్నారు. మన పూర్వధర్మశాస్త్రములు సంస్కృతములో వ్రాయబడినవి. అవి దేశభాషలలోని కనువదింపబడక పోవుటచే, జనబాహుళ్యమునకు సుబోధకములగుచుండుట లేదు. కాబట్టి వానిలో మనకు ప్రవేశము శూన్యమై, వినా

ర్శనజ్ఞానముబొత్తిగా అపురూపమైనది. ఈశాస్త్రములను తెలుగులో తర్జుమాచేసిన యెడల, ఎంతవరకు పూర్వపుశ్రౌత స్మార్తకాండ లిప్పటికి నశించెనో, నిలచియున్న మతాచారములుకూడ మనసాంఘికాభివృద్ధికొఱకు, మున్ముందెంతవరకు మార్చుకొనవలసియుండునో తెలిసికొనగలము. అన్ని జాతుల మతములలోనున్న సామాన్యనైతికధర్మములుకూడ పరిణామ జన్యములేగాని, మనమనఃఫలకములమీద దేవుడు వ్రాసినాడని సాంఘికశాస్త్రజ్ఞుడు నమ్మడు. సత్యము అహింసమొదలగు నిత్యధర్మములలోకూడ స్థూలసూక్ష్మభేదములున్నవి. కాబట్టి యీసాంఘిక పరిణామవాదములో, సత్యమే మన ప్రధానధర్మమగుటచే, దానినన్వేషించుటయే మనయందరి విధి. అదియే యెల్లపుడు జయమొందుగాక!

ఈగ్రంథమును వ్రాయుచో నాకు క్రోడీకరణమునకు కావలసిన శ్రుతిస్మృతీతిహాసాదులలోని శ్లోకములను సమన్వయించుటకును, వెదకియిచ్చుటకును, తాత్పర్యమును వివరించుటకును నాకు తోడ్పడిన, కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠ పండితులగు బ్రహ్మశ్రీ వేదుల వెంకటశాస్త్రులు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులు, శ్రీమాన్ గోడవర్తి యతిరాజసంపత్కుమారస్వామిగార్లకును, గ్రంథముద్రణమున శ్రద్ధవహించి చిత్తులుదిద్ది సరిచూచి తోడ్పడిన మ॥ రా॥ శ్రీ కందుకూరి వీరభసవరాజుగారికిని నేను కృతజ్ఞుడను

ఇట్లు

సత్యాన్వేషి

వల్లూరి సూర్యనారాయణరావు.

# వర్ణాశ్రమధర్మపరిణామము.

## చాతుర్వర్ణ్యవ్యవస్థ

ప్రపంచములోనున్న యితర మానవసంఘములలో లేని యీచాతుర్వర్ణ్యవ్యవస్థ మనహిందూ దేశములో మాత్రము కనుపడుట మిక్కిలి విచిత్రమైన సంగతి. దీనియొక్క పుట్టుకయు, పరిణామమును మన పూర్వగ్రంథములనుండి కొంతవరకైనను తెలిసికొన్నగాని దీనినెట్లు మార్చవలయునో అయిదువేల సంవత్సరములనుండి యేదియో నొకవిధముగ ఆచరణలోనుండి, ప్రస్తుతమందు శిలారూపము దాల్చిన యీవర్ణవ్యవస్థ, యెట్లు నశింపబడవలసినదీ, మనమిప్పుడు నిర్ధారణ చేయలేము. కాబట్టి యీవర్ణముల పుట్టుకయు వీనిపరిణామములను గురించి మాత్రమే కొన్ని ప్రమాణముల నుదహరించుచున్నాను.

I ఈవర్ణములను గురించి ఋగ్వేదములోని పదియవ మండలములోని 13 వ ఋక్కులోను, తైత్తిరీయారణ్యక పర్వమందు మూడవప్రశ్నములోను, శుక్లయజుర్వేదమందు 81 మంత్రములోను, అథర్వవేదములోని 19 వ కాండయందును వ్రాయబడియున్నది. దీనినే పురుషసూక్తమని వాడెదరు— ఈ ఋక్కు కొంతకాలమైన తరువాత ఆగ్రంథములలో చేర్చబడినదని కొందరు విమర్శకుల మతము—

బ్రాహ్మణోస్యముఖమాసీద్బాహూ రాజన్యఃకృతః
ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాంగ్ శూద్రోఅజాయత॥

(యజుర్వేదము 31 మంత్రము)

అర్థము—ఈపురుషునకు విద్యాది గుణము ముఖము గ భావింపబడినదాయెను. వీర్యాదిగుణము హస్తములుగ భావింపబడినదాయెను. వ్యాపార ధర్మము గలదో అది యీపురుషునకు ఊరువులుగ భావింపబడినదాయెను. సేవాది గుణము పాదములుగ భావింపబడినదాయెను. ఈశ్వరునికి ముఖాదియవయవములు లేవు గనుక, వానినుండి పుట్టినట్లు చెప్పుటకల్పనగాని మరియొకటి కాదు. ముఖము, అంగము లన్నిటిలో శ్రేష్ఠమైనట్లు పూర్ణవిద్యచేతను, ఉత్తమగుణకర్మ స్వభావముచేతను ఉత్తముడగువాడు బ్రాహ్మణుడు- శరీర మందున్న సత్వరజస్తమోగుణముల పాళ్లను బట్టియు, వాడు చేయుకర్మలనుబట్టియు, యీవర్ణములు పేర్కొనబడినవి గాని వీనిలో యేవర్ణమునకుగాని, నిందయు, న్యూనతయు లేవు. శతపథ బ్రాహ్మణములో కూడ యీ సూత్రమున కిట్టే యర్థము చెప్పబడినది.

II ఆర్యులందరు మొదట బ్రాహ్మణులుగా భావింపబడినట్లు భారతములో వ్రాయబడియున్నది.

(1) అసృజద్బ్రాహ్మణానేవపూర్వంబ్రహ్మాప్రజాపతీన్
ఆత్మతేజోభి నిర్వృత్తాన్ భాస్కరాగ్నిసమప్రభాన్
తతస్సత్యంచ ధర్మంచ తపోబ్రహ్మచ శాశ్వతం
ఆచారంచైవ శౌచంచ స్వర్గాదావిదధేప్రభుః॥

(శాంతిపర్వము అ 188; శ్లో 1-2)

అర్థము — బ్రహ్మ, పూర్వము తన తేజస్సువలన తయారైన సూర్యాగ్నులతో సమమగు కాంతిగల బ్రాహ్మణులేయయిన ప్రజాపతులను సృజించెను. తరువాత సృష్ట్యాదియందు సమర్థుడగు బ్రహ్మ సత్యమును, ధర్మమును, తపస్సును, శాశ్వతమగు వేదమును ఆచారమును, పారిశుద్ధ్యమును యేర్పరచెను.

(2) యథా కృతయుగే పూర్వమేకవర్ణమ భూత్కిల
తథా కలియుగస్యాంతే శూద్రీ భూతాః ప్రజా స్తథా॥
(మత్స్య పురాణము 144-78)

అర్థము— పూర్వము కృతయుగమందు యెట్లు జగత్తు యేకవర్ణము కలదై యుండెనో అట్లు కలియుగము యొక్క చివరను, అట్టి ప్రజలు శూద్రులగుదురు.

ఆర్యావర్తములో బ్రాహ్మణులై యుండిన యార్యులకు, అన్యసంఘమగు దస్యులనువారితో జగడములు సంభవించినపుడు, ఆర్యులందరు బ్రాహ్మణులే యైనట్లు ఋగ్వేదములో కొన్నిచోట్ల చెప్పబడియున్నది.

(3) యో విశ్వస్య జగతః ప్రాణ తస్పతిర్యో బ్రహ్మణే
ప్రథమోగా అవిందత్ ఇంద్రోయోదస్యూర ధరా
అవా తిరన్మరుత్వ న్తం సఖ్యాయమహా వామహే॥
(ఋగ్వేదము మం 1 సూ 101-5)

అర్థము--ఏ యిందుౖడు నడుచుచున్నట్టియు నిద్రించుచున్న ట్టియు ప్రాణిజాతమునకు ప్రభువో, ఏ యిం ద్రుడు బ్రాహ్మణ జాతికొరకు యితర దేవతలకు మొదటి వాడై పరులచేత నపహరింపబడిన గోవులను తిరిగి పొందెనో యే యింద్రుడు, దస్యులను నికృష్టులునుగా చేసి చంపెనో అట్టి యింద్రుని సఖ్యముకొరకు ఆహ్వానము చేయుచున్నాము.

(4) త్వంహి శూరః సనితా చోదయోమను షోరథం

సహావాన్ దస్యుమ వ్రతమోషః పాత్రం నశోచిషా॥

(ఋగ్వేదము మం. 1. సూ. 175-3)

అర్థము—ఓ యింద్రుడా నీవు శౌర్యముగలవాడవు. దాతవు. మనుజుడనైన నా రథమును (మనోరథమును) నడు పుము. బలవంతుడవై శిక్షించుచు కర్మానుష్ఠానము చేయని దస్యుని జ్వాలచే, తన కాధారమైన పాత్రనువలె దహించుము

(5) ససానాత్యా ఉత సూర్యం ససానేంద్రః ససానపురు

భోజ సంగాం హిరణ్యయ ముతభోగం ససాంహత్వీ

దస్యూన్ ప్రార్యం వర్ణ మావత్ ॥

(ఋగ్వేదము మం III సూ 34-9)

అర్థము—ఇంద్రుడు అశ్వములను, సూర్యుని సర్వ జనులచే అనుభవింపబడు గోవును సువర్ణమయమగు ధనమును యిచ్చెను. దస్యులను చంపి ఉత్తమ వర్ణమగు ఆర్యులను రక్షించెను.

III. బ్రాహ్మణ వర్ణమే, సాంఘికబల ప్రయోజనము లకు నాలుగు వర్ణములాయెను.

> బ్రహ్మవా ఇదమగ్ర ఆసీదేక మేవ । తదేకం సన్న వ్యభవత్ । తచ్ఛ్రేయోరూప మత్య సృజత క్షత్రమ్ । సైషాక్షత్రస్య యోనిర్యద్బ్రహ్మ । తస్మాద్యద్య పిరాజా పరమతాం గచ్ఛతి బ్రహ్మైవాన్తత ఉపని శ్రయతిస్వాంయోనిమ్ । సంనైవ వ్యభవత్ । సవిశ మసృజత । సనైవవ్యభవత్ సశౌద్రంవర్ణమసృజత॥
>
> (బృహదారణ్యక 1-4-11)

అర్థము—ఈజగత్తు మొదట ఒకటైన బ్రాహ్మణ జాతియైయుండెను. ఆ బ్రాహ్మణజాతి యొకటిగానుండి వృద్ధి నొందలేదు. ఆ బ్రాహ్మణజాతి శ్రేష్ఠమగు రూపముగల క్షత్రియజాతిని సృజించెను. బ్రాహ్మణజాతి యనునది క్షత్రి యజాతికి యోనిభూతము. ఆహేతువువలన (రాజసూయయా గమందు అభిషిక్తుడగుటవలన) రాజు శ్రేష్ఠతను పొందుచున్నా డు గాని చివరకు తమకు యోనిభూతమగు బ్రాహ్మణజాతిని సమీపించి (యజ్ఞములను చేయించుటకొఱకు) నిశ్శేషతచే నా శ్రయించుచున్నాడు ఆ క్షత్రియజాతియు వృద్ధినొందలేదు. ఆక్షత్రియజాతి వైశ్యజాతిని సృజించెను. అదియు వృద్ధిచెంద లేదు. ఆవైశ్యజాతి శూద్రవర్ణమును సృజించెను.

IV ఆనాలుగు వర్ణములు ఐహికాధ్యాత్మిక విషయము లలో సరిసమానములుగానే భావింపబడినవి.

(1) యజ్ఞనిష్పత్తయే సర్వమేతద్బ్రహ్మాచకారవై । చాతు
ర్వర్ణ్యం మహాభాగ యజ్ఞసాధనముత్తమమ్। యజ్ఞైరా
ప్యాయితా దేవా । వృష్ట్యుత్తరేణతాః ప్రజాః । ఆ
ప్యాయయంతే ధర్మజ్ఞ యజ్ఞాః కళ్యాణహేతవః ।
నిష్పాద్యంతే నరైస్తైస్తు స్వధర్మాభిరతైస్సదా । విశు
ద్ధాచారణో పేతైస్సద్భిస్సన్మార్గ గామిభిః । స్వర్గాప
వర్గేమానుషాత్ప్రాప్ను వంతినరామునే । యథాభి
రుచితం స్థానంతర్యాంతి మనుజాద్విజా । ప్రజాస్తా
బ్రహ్మణాసృష్టా । శ్చాతుర్వర్ణ్యవ్యవస్థితాః । సమ్య
క్ఛ్రద్ధాసమాచార ప్రవణామునిసత్తమా యథేచ్ఛా
వాసనిరతా సర్వబాధావివర్జితాః। శుద్ధాంతః కరణాః
శుద్ధాః సర్వానుష్ఠాన నిర్మలాః । శుద్ధేచతాసాం మ
నసిశుద్ధేంతస్సంస్థితేహరౌ । శుద్ధజ్ఞానం ప్రపశ్యంతి
విష్ణ్వాఖ్యం యేనతత్పదం॥

(విష్ణుపురాణము 1-7-13)

అర్థము—మహాభాగుడవైన మైత్రేయా! యజ్ఞ
సాధనమగు ఉత్తమమైన యీ నాల్గువర్ణములను, బ్రహ్మ
యజ్ఞములను నెరవేర్చుట కొఱకు సృజించెను. దేవతలు
యజ్ఞములచే తృప్తిపొందిన వారై వర్షమును కురిపించుటచే
ప్రజలను తృప్తి నొందించుచున్నారు. యజ్ఞములు మంగళ
ములకు కారణములు. అట్టియజ్ఞములు స్వధర్మ నిరతులై
పవిత్రమగు ఆచరణగల సన్మార్గ గాములగు విద్వాంసులైన

నరులచే నెరవేర్పబడుచున్నవి. మనుష్యత్వము వలన స్వర్గ మోక్షములను పొందుచున్నారు. మనుష్యులు పూర్వము చెప్పిన యిష్టానురోధముగ స్థానమును పొందుదురు. చాతుర్వర్ణ్యవ్యవస్థ గలిగి మంచి శ్రద్ధతో సదాచారమందాసక్తు లగు ప్రజలు బ్రహ్మచే సృజింపబడిరి. స్వేచ్ఛా వాసమం దాసక్తులై సర్వ బాధలచే విడువబడి శుద్ధమైన మనస్సుగల వారై సర్వకర్మానుష్ఠానమునందు నిర్మలులై యే ప్రజలు కలరో, అట్టి ప్రజల నిర్మలమగు మనస్సులందు హరియుండు నపుడు యే జ్ఞానముచే విష్ణుపదవిని పొందుదురో, అట్టి పరిశుద్ధమగు జ్ఞానమును పొందుచున్నారు.

(1) బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా శ్చ కృత లక్షణాః । కృతేయుగే సమభవన్స్వ కర్మనిరతాః ప్రజాః॥ సమాశ్రియం సమాచారం సమజ్ఞానం చ కేవలమ్ । సదాహి సమకర్మాణో వర్ణాధర్మాన వాప్నువన్ ॥ ఏకదేవ సమాయుక్తా ఏకమంత్ర విధి క్రియాః । పృధగ్ధర్మా స్త్వేక వేదా ధర్మమేక మనువ్రతాః॥ చాతురాశ్రమ్య యుక్తేన కర్మణా కాల యోగినా । అకామ ఫలసంయోగా త్ప్రాప్ను వంతి పరాంగతిం॥ ఆత్మయోగ సమాయుక్తో ధర్మోయం కృత లక్షణః॥

(వనపర్వము అ 149 శ్లో 18-28)

అర్థము— కృతయుగమందు బ్రాహ్మణులు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు తమతమ లక్షణములు కలవారై యుండిరి. ప్రజలు తమ కర్మలయందు మిక్కిలి ఆసక్తులై కేవలము సమమగు ఆశ్రయము, సమమగు ఆచారము సమమగు జ్ఞానము కలవారుగ నుండిరి. బ్రాహ్మణాది వర్ణము లెల్లప్పుడు సమమగు కర్మలు కలవారై ధర్మములను పొందిరి. ఒక దేవతను కలవారును ఒకే మంత్రముచే విహితమైన క్రియగలవారును, వేరువిధులు కలవారైనను, ఒకే వేదము కలవారును, ఒకే ధర్మము నాశ్రయించువారునై ఆయా కాలములందు నాలుగాశ్రమములకు సంబంధించిన నిష్కామ కర్మచే పరమగతిని పొందుచుండిరి. కృతయుగ విహితమగు యీ ధర్మము ఆత్మతో సంబంధము కలదై యుండెను.

V ఒక్కవేదమే, దరిమిలాను, అనేక వేదములుగ మార్పుచెందినది.

ఏకవేదస్య చాజ్ఞానాత్ వేదాస్తే బహవః కృతాః
సత్వస్య చేహ విభ్రంశాత్ సత్యే కశ్చిదవస్థితః॥

(వన పర్వము-అ 149 శ్లో 30)

అర్థము—ఈ ద్వాపర యుగమందు యేకముగా నున్న వేదమును తెలిసికొనలేక పోవుటవలన వేదముల నేకములుగా చేయబడినవి. సత్వగుణము నశించుటవలన ఒకానొకడు సత్యమందుండెను.

VI యాగదీక్ష అన్నివర్ణములకు బ్రాహ్మణత్వమొసంగుచుండెను.

(1) అథయద్బ్రాహ్మణ ఇత్యాహ । అనద్ధేవవా అస్యాతః పూరాంజానాంభవతి । ఇదంహ్యాహుః రక్షాంసియోషితమను సచంతే । తదుతరక్షాంస్యేవ రేతఆదధాతీతి । అథాత్యాద్ధాజాయతేయో బ్రహ్మణో యోయజ్ఞాజ్జాయతేతస్మా దపిరాజన్యంవా వైశ్యం వాబ్రాహ్మణ ఇత్యేవబ్రూయాత్॥

(శతాపతబ్రాహ్మణము 3-2-1-40)

అర్థము—ఎవ్వని బ్రాహ్మణుడని చెప్పుచున్నారో, వీనియొక్క పూర్వము కు జన్మము అసత్యము. ఏలయనగా రాక్షసులు స్త్రీలతో సంగమముచేసి వారిరేతస్సును ప్రవేశ పెట్టుదురని చెప్పుదురు. ఎవ్వడు వేదమువలనను, యజ్ఞమువలనను పుట్టుచున్నాడో వాడు సత్యముగా (బ్రాహ్మణుడై) పుట్టుచున్నాడు. అందువలన క్షత్రియుని వైశ్యుని బ్రాహ్మణుడనే చెప్పవలయును. ఎవ్వడు యజ్ఞమువలన పుట్టుచున్నాడో వాడుగదా బ్రాహ్మణుడై పుట్టుచున్నాడు!

(2) సహిదీక్షమాణ ఏవబ్రాహ్మణ తామభ్యుపైతి॥

(ఐతరేయ బ్రాహ్మణము 7-23)

అర్థము—ఆక్షత్రియుడు దీక్షగలవాడగుచునే బ్రాహ్మణత్వమును పొందుచున్నాడు.

VII శూద్రులు సోమపానమున కధికారులై యుండిరి.

శూద్రః పైజవనో నామ సహస్రాణాం శతం దదౌ
ఐంద్రాగ్నేన విధానేన దక్షిణామితి నః శ్రుతమ్.

[శాంతిపర్వము అ 60 శ్లో 39]

అర్థము—పైజవనుడను శూద్రుడు ఐంద్రాగ్న మను యజ్ఞమును చేసి ఒకలక్షగోవులను దక్షిణగా నిచ్చెను.

VIII. వర్ణవిభజనకు, అత్యాశయు, పాపకర్మాచరణములు ముఖ్యకారణములై యుండెను.

(1) తతః కాలాత్మకో యో౽సౌ తస్యాంశః కధితో హరేః।
పపాత యత్యఘం ఘోరమల్ప మల్పాల్ప సారవత్॥
అధర్మబీజ ముద్భూతం తమోలోభ సముద్భవమ్।
ప్రజాసు తాసు మైత్రేయ రాగాదిక మసాధకమ్॥

(విష్ణు పురాణము 1-6 ,14-15)

అర్థము—తరువాత ఆ హరియొక్క యంశయగు కాల మెద్ది చెప్పబడినదో అది ప్రథమమునం దల్పమును క్రమముగా కొద్ది కొద్ది సారముగల పాపమును ఆ ప్రజలయందు పడవేయును. మఱియు అధర్మమునకును, తమస్సునకును లోభమునకును హేతువై గొప్పదగు రాగము మొదలగు జ్ఞాన ప్రతి బంధకమునుగూడ ప్రజలయందు పడవేయును.

(2) తేషాం తు కాలసృష్టో౽సౌ పాపబిందు ర్మహామతే।
చేతస్సు వవృధే చక్రుస్తేన యజ్ఞే న మానసమ్।
వేదాన్వేద్యం తథా దేవాన్యజ్ఞ కర్మాదికం చ యత్।

తత్సర్వం నిందమానాస్తే యజ్ఞవ్యాసేధకారిణః ।
ప్రవృత్తి మార్గ వ్యుచ్ఛిత్తి కారిణో వేదనిందకాః ।
దురాత్మానో దురాచారా బభూవుః కుటిలాశయాః ।
సంసిద్ధాయాంతువార్తాయాంప్రజాస్సృష్ట్వాప్రజాపతిః।
మర్యాదాం స్థాపయామాసయథాస్థానం యథాగుణం
వర్ణానామాశ్రమాణాంచధర్మాన్ ధర్మభృతాంవర ।
లోకాంశ్చ సర్వవర్ణానాం సమ్యగ్ధర్మాను పాలినామ్॥
(విష్ణుపురాణము 1-6 శ్లో 29-33)

అర్థము—బుద్ధిమంతుడవగు మైత్రేయా ! కాలముచే సృజింపబడిన యీ పాపలేశము ఆ మనుజుల మనస్సులందు వృద్ధినొందెను. అందుచే ఆ మనుజుల మనస్సులను యజ్ఞమునందుంచ లేదు. అట్టి మనుజులు వేదములను, వేదముల వలన తెలిసికొనదగిన ధర్మములను, దేవతలను, యజ్ఞాదికర్మములను అన్నిటిని నిందించువారును, యజ్ఞములకు విఘాతమును చేయువారును, ప్రవృత్తి మార్గములను నశింపజేయువారును దుష్ట స్వభావ దురాచారములు గల వారును, కుటిలహృదయము కలవారు నయిరి బ్రహ్మ ప్రజలను సృజించి వీరికి జీవిక సిద్ధించిన పిమ్మట, దేశములను బట్టి గుణముల ననుసరించి ధర్మ వ్యవస్థను చేసెను. ధర్మమాచరించు వారలలో శ్రేష్ఠుడవగు మైత్రేయా ! వర్ణములయొక్కయు, ఆశ్రమముల యొక్కయు ధర్మములను, తమతమ ధర్మములను పాలించు వారు పొందు లోకములను కూడ యేర్పరచెను.

IX. ఆధ్యాత్మిక జీవనము బ్రాహ్మణులను చేసినది ప్రాపంచిక వృత్తులు ఇతర వర్ణములకు కారణము లైనవి.

(1) సర్వేవర్ణా బ్రాహ్మణాబ్రహ్మజాశ్చ సర్వేనిత్యం వ్యాహరం తేచ బ్రహ్మ। తత్వం శాస్త్రం బ్రహ్మ బుద్ధ్యాబ్రవీమి। సర్వం విశ్వంబ్రహ్మ చైతత్సమ_స్తమ్॥
(శాంతిపర్వము అ 318 శ్లో 89)

అర్థము—సర్వ వర్ణములు బ్రహ్మజ్ఞానము కలవియు, బ్రహ్మవలన పుట్టినవియునై యున్నవి. ఎల్లరు నెల్లప్పుడు బహ్మను స్మరించుచున్నారు. నేను బహ్మజ్ఞానము చేతను, తత్వ శాస్త్రమును చెప్పుచున్నాను. సమస్త జగత్తు . నీ కనుపించు సమస్తమును బ్రహ్మరూపము.

(2) నవిశేషోస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదంజగత్।
బ్రాహ్మణాః పూర్వ సృష్టాహి కర్మభి ర్వర్ణ తాంగతాః॥
కామభోగ ప్రియాస్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః।
త్యక్తస్వధర్మారక్తాం గాస్తేద్విజాఃక్షత్రతాంగతాః॥
గోభ్యోవృత్తిం సమాస్థాయపీతాః కృష్యువ జీవినః।
స్వధర్మాన్నాను తిష్ఠంతి తే ద్విజా వైశ్య తాంగతాః॥
హింసానృత ప్రియా లుబ్ధా స్సర్వకర్మోప జీవినః।
కృష్ణాశ్శౌచ పరిభ్రష్టాస్తేద్విజా శ్శూద్ర తాంగతాః॥
(శాంతిపర్వము అ 188 శ్లో 10-13)

అర్థము—వర్ణములకు భేదములేదు. ఈ సర్వజగము బ్రాహ్మణ మయము. పూర్వమందు సృజింపబడిన బ్రాహ్మణులు గదా కర్మలచే వర్ణమును పొందిరి. కర్మ భోగములందు ప్రీతిచెంది క్రూరులై, క్రోధముగలిగి, ప్రియసాహసులై, స్వధర్మములను ఏ బ్రాహ్మణులు విడిచిరో, ఎఱ్ఱని శరీరముగలవారో, అట్టి బ్రాహ్మణులు క్షత్రియులైరి. గోవులవలన వృత్తిని చేయుచు, కృషిచేసి జీవించువారై, పసుపువర్ణము గలిగి, ఏ ద్విజులు స్వధర్మము ననుష్ఠించుట లేదో వారు వైశ్యులైరి. లోభముగలిగి అన్నికర్మములను చేయుచు జీవించుచు, శౌచము లేనివారై, నల్లని దేహముగలిగిన ద్విజులు శూద్రులైరి.

X. వేదములు, ధర్మము, యజ్ఞము సమస్తమయిన ప్రజలకును అనుసరణీయములే.

ఇత్యేతైః కర్మభి ర్వ్యస్తాద్విజా వర్ణాంతరంగతాః।
ధర్మో యజ్ఞక్రియా వైషాంనిత్యం నప్రతిషిధ్యతే।
వర్ణాశ్చత్వార ఏతేహి యేషాం బ్రాహ్మీ సరస్వతీ।
విహితా బ్రాహ్మణాఃపూర్వంలోభాత్త్వజ్ఞానతాంగతాః
బ్రాహ్మణాబ్రహ్మతంత్రస్థా స్తపస్తేషాం ననశ్యతి।
బ్రహ్మధారయతాంనిత్యం వ్రతాని నియమాంస్తథా।
(శాంతిపర్వము అ 188 శ్లో 14-16)

అర్థము—ఈకర్మలచే విభజించబడి ద్విజులు వర్ణభేదమును పొందిరి. ధర్మము, యజ్ఞము నాచరించుట వీరికెప్పు

డును నిషేధింపబడదు. వేనికి వైదికవాణి కలదో యట్టివి యీ నాల్గువర్ణములు. పూర్వము బ్రాహ్మణులే సృజింపబడిరి. వారు లోభమువలన అజ్ఞానమును పొందిరి. బ్రాహ్మణులు బ్రహ్మతంత్రమందు నిష్ఠగలవారు. వేదమును వ్రతములను నియమములను ధరించు ఆ బ్రాహ్మణుల యొక్క తపస్సు నశించదు.

XI. ఆధ్యాత్మిక జీవనము నశించగానే, బ్రాహ్మణులు మ్లేచ్ఛులైరి.

బ్రహ్మచైతత్పురా సృష్టం యేతుజానంతినద్విజాః।
తేషాం బహువిదాస్త్వన్యాస్తత్రతత్రద్విజాతయః॥
పిశాచారాక్షసాః ప్రేతావివిధామ్లేచ్ఛజాతయః।
ప్రణష్టజ్ఞానవిజ్ఞానాః స్వచ్ఛందాహారచేష్టితాః॥

(శాంతిపర్వము అ 188-101-18)

అర్థము — ఏ ద్విజులు పూర్వము సృజింపబడిన వేదమును తెలిసికొనలేదో అట్టివారిలో జ్ఞానవిజ్ఞానములు నశించి స్వేచ్ఛ చేతనగు ఆహారవిహారములు కలిగి, పిశాచములు, రాక్షసులు, ప్రేతలు, పలువిధములగు మ్లేచ్ఛజాతులు, నగు బహువిధములగు ఇతర బ్రాహ్మణులు కలరు.

XII. మొదట వర్ణములు గుణ కర్మ విభాగములను బట్టి నిర్ణయింపబడెను గాని రజోవీర్యముల చేతకాదు.

(1) చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః
తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥

(భగవద్గీత అ॥ 4 శ్లో 13)

అర్థము—బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు వను నాలుగువర్ణములవ్యవస్థను గుణములయొక్కయు,కర్మము లయొక్కయు భేదముల బట్టి నేనే సృజించితిని. నేను దానికి కర్త నగుదును అకర్తను నగుదునని తెలిసికొనుము.

(2) బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ।
శమోదమ స్తప శ్శౌచం క్షాంతిరార్జవ మేవచ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ।
శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్।
దానమీశ్వర భావశ్చక్షాత్రం కర్మస్వభావజమ్ ।
కృషిగోరక్షం వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మశూద్ర స్యాపి స్వభావజమ్॥

(భగవద్గీత అ 18 శ్లో 41-44)

అర్థము— ఓపరంతపా ! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులయొక్క కర్మములు వారియొక్క స్వభావ జన్యమైన గుణములను బట్టి వేర్వేరుగ విభజింపబడినవి శమము దమము తపస్సు, శుచిగ నుండుట, శాంతి సరళత (ఆర్జవము) జ్ఞానము (అధ్యాత్మ జ్ఞానము) విజ్ఞానము (వివిధజ్ఞానము) ఆస్తిక్యబుద్ధియు ననునవి బ్రాహ్మణులయొక్క స్వభావ జన్యములైన కర్మములు. శౌర్యము, తేజస్విత, ధైర్యము, దక్షత, యుద్ధములో వెనుదీయకుండుట, దాతృత్వము, ప్రజలనేలుట యనునవి క్షత్రియులకు స్వభావ జన్యములగు కర్మములు. కృషి,

గోరక్షణము, బేరము ననునవి వైశ్యునియొక్క స్వభావ జన్యములైన కర్మములు. అటులే సేవించుట శూద్రునకు స్వభావ జన్యమగు కర్మము.

పై వాక్యములమీాద బాలగంగాధర తిలకు మహారాజగారు, తమ గీతా రహస్యములో నిట్లు వ్యాఖ్యానము చేసిరి.

,, ఈ పై యుపపత్తి మహాభారతమందును, ధర్మసూత్రములందును, శ్రుతులయందును కూడ గన్పట్టుచున్నది. జగత్తునందలి వివిధ వ్యవహారములును, ప్రకృతియొక్క గుణభేదములచేతనే నడచుచున్నవి. ఎవరేమి చేయవలసినదియు చాతుర్వర్ణ్యవ్యవస్థచే నిశ్చయింపబడిన విషయము. ఇదియు ప్రకృతి సంబంధమైన గుణభేదము యొక్క పరిణామమే యని నిరూపింపబడినది. ఇప్పుడీ కర్మములే ప్రతిమనుజుడును నిష్కామబుద్ధితో పరమేశ్వరార్పణ బుద్ధితో చేయవలయును. లేనిచో జగత్తులో వ్యవహారము నడువదని ప్రతిమనుజుడును ప్రవర్తించెనేని దానిమూలముననే సిద్ధి నొందును. సిద్ధిని సంపాదించుకొనుటకు నితరమగు నేయనుష్ఠానమును చేయనక్కర లేదు ... ఎవడు తనయొక్క మనస్సు శాంతమగుటచే సర్వభూతాంతర్గతమగు నైక్యమును తెలిసికొనెనో వాడు కర్మమునుబట్టిగాని, జాతినిబట్టిగాని, వ్యాపారము చేయువాడైనను, కటికవాడైనను, నిష్కామ బుద్ధిలో వ్యాపారములను చేయునుగాన, స్నానసంధ్యాశీలుడగు బ్రాహ్మణునివలెగాని, శూరుడగు క్షత్రియునివలెగాని, గొప్పవాడనై మోక్షాధికారి యగును.''

(3) స్వాధ్యాయేన జపైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః।
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః॥

(మనుస్మృతి అ-2, శ్లో 28)

అర్థము—సకల విద్యలను చదువుటచేతను, చదివించుట చేతను, బ్రహ్మచర్యము, సత్యభాషణము మొదలగు నియమములను పాలించుటచేతను, అగ్నిహోత్రాది హోమము లు సత్యగ్రహణము అసత్యత్యాగము సత్యవిద్యల దానముల చేతను, వేదస్థములగు కర్మ ఉపాసన, జ్ఞానవిద్యల గ్రహించుటచేతను, పక్షేష్ట్యాదులను చేయుటచేతను, సుసంతానోత్పత్తి చేతను, బ్రహ్మదేవపితృవైశ్వదేవ అతిథులయొక్క సేవారూపములగు పంచమహాయజ్ఞములచేతను, అగ్నిష్టోమాదులు శిల్ప విజ్ఞానాదులు అను యజ్ఞములను సేవించుటచేతను ఈ శరీరము బ్రాహ్మ అనగా వేదములయొక్కయు పరమేశ్వరునియొక్కయు భక్తికి నాధారరూపముగు బ్రాహ్మణుని యొక్క శరీరముగా చేయబడును. ఇన్ని సాధనములు లేక బ్రాహ్మణ శరీరము కాజాలదు—స్వామిదయానందసరస్వతి.

XIII. ఈ చతుర్వర్ణములను, క్రమక్రమముగా న్యూనతాధి కృతములేర్పడినవి గాని ఆయావర్ణముల వారిమధ్య భోజన ప్రతిభోజనములును, అన్యోన్య వివాహములున్నట్లును వారివారి కర్మలచేత పై వర్ణమువారు క్రిందకిదిగుటయు క్రిందివర్ణములవారు పైస్థానము వహించుటయు తటస్థించుచుండెను.

(1) శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతిశూద్రతామ్
క్షత్రియాజ్జాతమేవంతువిద్యాద్వైశ్యాత్తథైవచ॥
(మనుస్మృతి అ 10 శ్లో 65)

అర్థము— శూద్రకులమం దుత్పన్నమైనను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల వంటి గుణకర్మ స్వభావముగల వారైనేని, వారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులగుదురు. అట్లే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య కులములం దుత్పన్నులైనను శూద్రునివంటి గుణకర్మ స్వభావము కలవారైరే, శూద్రులగుదురు అట్లే క్షత్రియకులమందుగాని వైశ్యకులమందుగాని యుత్పన్నుడై బ్రాహ్మణునితోగాని, శూద్రునితోగాని సమానుడయ్యేనేని బ్రాహ్మణుడుగాని, శూద్రుడుగాని కాగలడు అనగా, నాలుగు వర్ణములయందును ఏ యే వర్ణముతో సమానులగు స్త్రీపురుషులు ఆయావర్ణములయందు గణింపబడుదురు. (స్వామిదయా నందసరస్వతి.)

(2) ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వంపూర్వం వర్ణమాపద్యతేజాతిపరివృత్తౌ। అధర్మచర్యయా పూర్వోవర్ణోజఘన్యంజఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ॥
(ఆపస్తంబసూత్రము)

అర్థము—ధర్మాచరణముచేత నికృష్టవర్ణములు ఉత్తమోత్తమ వర్ణములను పొందును. ఏవర్ణమున కెవరు యోగ్యుడో వానిని ఆవర్ణమందు గణింపవలయును. అట్లే అధర్మాచరణముచేత, ఉత్తమోత్తమవర్ణములవారు తమకం

కొసిచ నీచవర్ణములను పొందుదురు. వారిని ఆనీచవర్ణమందే గణింపవలయును. దీనిలో నేవర్ణమునకును నిందగాని, అ యోగ్యతగాని కలుగజాలదు.

(మనుస్మృతి అ 10 శ్లో 65, 72)

(3) బ్రాహ్మణుడు నాలుగు వర్ణముల స్త్రీలను వివాహము చేసికొని, వారందరివలనను పుత్రులను కన్నయెడల వారు తమతల్లుల వర్ణములను బట్టి కొన్ని భాగములవరుసను తండ్రియాస్తిని పంచుకొనెదరు ఈసంబంధబాంధవ్యములుగల వర్ణములవారందరు ఒండొరులకు సపిండులగుచుండుటచే నిర్దిష్టకాలములకు సూతకములు పట్టవలయును.

విష్ణుస్మృతి అ 18 శ్లో 1-40; అ 22 శ్లో 20-24
మనుస్మృతి అ 3 శ్లో 13; అ 9 శ్లో 151-154; 159-160
గౌతమధర్మసూత్రములు అ 4 సూ 22-25; అ28సూ35
[39, 45

యాజ్ఞ్యవల్క్యస్మృతి ఆచారకాండ శ్లో 57, 58, 132
దక్షస్మృతి అ11 శ్లో 12, 23; శంఖధర్మశాస్త్రము అ 4 శ్లో 7-18, అ 16 శ్లో 17-21

# శ్రుతిస్మృతులు — గీత



ఈమధ్య, మచిలీపట్టణములో జరిగిన యజ్ఞమును గురించి కొంతవాదము జరిగినది. వేదములు ప్రమాణములని ఒప్పుకొన్న తరువాత, యజ్ఞములలో జీవహింస కూడదని చెప్పుట ధర్మము కాదని హరి నాగభూషణంగారు, అధ్యక్షులుగా నుండి చెప్పినది న్యాయసమ్మతమే. ఈ కలియుగములో హింసాపూర్వకమగు నట్టి యజ్ఞయాగాదులను చేయుట ప్రజాభిప్రాయమునకు విరుద్ధమని చెప్పవలయునే కాని శాస్త్ర చర్చలోనికి దిగిన లాభము లేదు. శ్రుతులను పురస్కరించుకొని వానిలో చెప్పిన ధర్మములన్నియు నిత్యములనియు, స్మృతులలోని ధర్మములు మాత్రము కాలానుసారముగ మార్చుకొనబడ తగినవనియు, స్మృతులకంటె శ్రుతు లెక్కువ బలీయమనియు, వేదములపౌరుషేయములని నమ్మినవారిలో కొందఱు వాదించెదరు. కాని,వీరైనను, వేదవిహిత కర్మల నన్నింటిని యాచరించుటకు వెనుదీయుదురు. వేదములలో స్త్రీల వివాహములకు వయోనిర్ణయమున్నదా? స్త్రీలకు యజ్ఞోపవీతధారణ, యావజ్జీవ బ్రహ్మచర్య మున్నదా లేదా? పురుషులును స్త్రీలును సంపూర్ణస్వాతంత్ర్యము కలిగి ఆము

ష్మికవిద్యలను పూర్తిగగడించి, ఒండొరులను వరించి వివాహములను చేసికొనిరా లేదా? వేదములలో చెప్పినవిషయము లలో మాత్రమే స్మృతులను, సంప్రదాయములను గుర్తించుకొనవలెనని జైమినిసూత్రములలో నున్నదా లేదా? యువతీ వివాహములు నిషేధింపబడలేదు సరికదా, శ్రుతులు దానినే యంగీకరించుచున్నవి. (తైత్తిరీయ యేకాగ్నికాండ 1-3-3 4; 1. 4-7, 1-5-7; 1-11-1; 2; ఋగ్వేద X 85 46; 27, జైమినిగృహ్యసూ 21, 8; తైత్తిరీయబ్రాహ్మణ 11-4-6 దరిమిలాను, యేకారణముచేతనో, స్త్రీలకు విద్యాస్వాతంత్ర్యము లీయకపోవుటచే యువతీవివాహము లడుగంటెను. స్మృతులన్నియు మొత్తముమీద, నిటీవలి పరిస్థితులను బట్టి బాల్యవివాహములనే యామోదించినవి.

యజ్ఞములోని పశువధ నామోదించువారు, గొడ్డుమాంసము తిని సోమపానము చేసెదరా? దైవమునకు నివేదనము చేసిన మాంసమును శ్రాద్ధములలో బ్రాహ్మణులకు పెట్టవలసిన మాంసమును తినెదరా? శ్రుతులలో చెప్పిన ప్రకారము బ్రహ్మచర్య గృహస్థాశ్రమములను సక్రమముగ స్వీకరించి, వాని ధర్మములను పాలించెదరా? బ్రహ్మచర్యమే, పురుషులకును స్త్రీలకును గొప్ప తపస్సు. అదిలేనిచో, జ్ఞానము, మనోవికాసము, శరీరబలము నశించుటయేగాక, బ్రహ్మచర్య వ్రతభంగము శీఘ్రముగ చేయుటవలన వారి పుత్రులు కూడ అల్పాయుష్కులగుదురు. (అపస్తంబసూత్రము. I-V-1

టు 8) స్త్రీలు వేదాధ్యయనము, అగ్నిహోత్రకర్మలు, భిక్షలు చేయుచు, రజస్వలానంతరమున వానిని మానివేయవలసినదని ధర్మసూత్రకారులకు కూడముందుండిన స్మృతికర్త యొకరు వ్రాసిరి. (హారీతస్మృతి XXI-20-23) ఈ స్మృతికి వేదప్రామాణ్యముకూడ తోడై యున్నది గనుక యిది స్వీకరించతగినది. కాని శ్రౌత గృహ్య, కల్పసూత్రములు కూడ వేదములలోని కొన్ని యాదర్శములను కొట్టివేసినవనియే చెప్పవచ్చును. అయినను బోధాయనగృహ్యసూత్రములలో తైత్తిరీయ బ్రాహ్మణములోని మంత్రములను వివాహకాలమందు చదువవలెనని వ్రాసియున్నది. ఆమంత్రములు రజస్వలైన స్త్రీకే గాని యుపయోగించుటకు వీలులేదు. (తైత్తిరీయ బ్రాహ్మణము 11-4-6,

మొట్టమొదట ఆర్యులందరు బ్రాహ్మణులే. సత్యము, దమము, తపస్సు, శౌచము, క్షమ, ఆర్జవము, జ్ఞానము, దయ, ధ్యానము, అత్యాశ దురాశలు లేకపోవుట, యీ పదియాత్మగుణము లెవరియందుండునో వారెల్లరు బ్రాహ్మణులే. ఈ సద్గుణములేక, వేదవేదాంగములుపూర్తిగా చదువుకొని, నలువదిసంస్కారములు చేసికొన్నను, యెవరును ముక్తినిపొందరు (గౌతమ-VIII-22-25 గీత 18-42: విష్ణుస్మృ-II-16-17 ; శాంతిపర్వము-అ 296-శ్లో 23,24. మనుస్మృతి VI-92) ఆ స్త్రీక్యబుద్ధితో, ఆధ్యాత్మికాభివృద్ధిచేసికొను నే మతమువా

డైనను బ్రాహ్మణుడని చెప్ప నొప్పరు. ఎట్టి నీచవర్ణములలో పుట్టినను, యెట్టిదురాచారుడైనను, దైవభక్తి కలిగి ఋజుమార్గ ప్రవర్తకుడైనచో యీజన్మలోనే బ్రహ్మర్షి రాజర్షి కావచ్చును (గీత IX-23-33)

కొంతకాలమైన తరువాత మ్లేచ్ఛులతో మన యార్యులకుసంపర్కము కలిగినపుడు తమకు వర్ణములు కలవనియు (ప్రకాశమానుల మనియు) యితరులు మ్లేచ్ఛులనియు వాడుచు, క్రమక్రమముగా, ఆధ్యాత్మిక, నైతికవిషయములలోతమలో నెకొందరు కొరవడుచుండుటచే వృత్తులనుబట్టి వర్ణము లేర్పరచిరి సంఘాభ్యుదయమునకు యిట్టివేరు వేరువృత్తులుకూడ కావలసి వచ్చినది. కాని, యీవర్ణములవా రందరు వేదకాలములో ధర్మమును ఒకేవిధముగ నవలంబించుచు, దస్యులకు విడిగా నున్నట్లు సూచించుటకుతమరందరు బ్రాహ్మణులమనియే చెప్పుకొనుచు వచ్చిరి.(ఋగ్వేద_111-34-9) ఐహికవిషయములలో లోభము హెచ్చు పెరిగినకొలది ఆముష్మికధర్మములను దూరులగుచుండుటచే ప్రజలందరు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులుగ పరిగణింపబడి దేవునియొక్క వేరువేరంగములనుండి పుట్టినట్లు ఋగ్వేదములో వ్రాయబడినది. కాని, ఆయావర్ణములలోని వారు పైవర్ణముల కెక్కుటయూ, క్రిందివర్ణములకు దిగుటయు సదా సంభవించుచున్నట్లు ఇటీవలి పురాణేతిహాసములు స్పష్టముగ వాకొనుచున్నవి. (శాంతిపర్వము అ 188 శ్లో 1, 20,

13, 14, 16 అ 297 శ్లో 31-34; అ 327 శ్లో 48, 49 గీత అ 4 శ్లో 13; అ 18శ్లో 41 టు 49 14-16 మత్స్యపురాణ 144-78 వనపర్వము అ 149 శ్లో 18-23 ఐతరేయ బ్రాహ్మణము 7-23) కాబట్టి జన్మచేతనే బ్రాహ్మణత్వము సిద్ధించుననునది వెఱ్ఱిమాట. ఈవిషయములలో నిటీవలి ధర్మసూత్రములు స్మృతులు మనకు ప్రమాణములు కావు. ఇవి యాయాకాలముల యాచారములను తెలుపుచు, వానినెప్పటికిని, స్థిరపరచవలెనని ప్రయత్నించినవి, కాని అవియు స్థిరత్వము నొందలేదు. నిత్యశాశ్వత ధర్మములు శ్రుతులలోనే కాననగును. వానిలోకూడ కేవల కర్మకాండ యంతయు పూర్వకాలమం దాచరణలోనున్న యాచారములను తెలుపుచుండెను. శ్రుతులలో చెప్పబడు ధర్మములకంటె వ్యతిరేకముగ స్మృతులలో వ్రాయబడినపుడు, యీరెండవదానిని పరిహరించవలయునని మీమాంసశాస్త్రమే చెప్పుచున్నది.

ఈపైవిధమున విమర్శించినకొలది, భగవద్గీతకంటె, అత్యుత్కృష్టమైన యాధ్యాత్మికవిషయక గ్రంథము ప్రపంచములో మరియొకటి లేదనియు, ఉండబోదనియు నానమ్మకము. మోక్షసంపాదనకు కావలసిన వివిధమార్గములన్నియు ఆస్తికునికి దీనిలో దొరకును. ప్రపంచములోని అన్నిజాతులకును, అన్నిమతములవారికిని యిది యుపచరించగల గ్రంథ

ము. హేతుపూర్వకముగాని పిడివాదములు, వెఱ్ఱినమ్మకము లు, మూఢాచారములు, మతసంప్రదాయములు ఆయామత ములలోని మూఢ విశ్వాసములు యీగ్రంథపఠనమువలన తొలగిపోవును. సర్వమానవసౌభ్రాతృత్వమునకు యీగీతా ధర్మములు తోడ్పడునను టకెట్టి సందేహము లేదు. ఉపనిష త్సారమంతయు దీనిలో నిమిడియున్నది. వివిధమతసాంప్రదా యికులు తమ కనుకూలమైన యర్థములను, దీనిలోనుండి లా గుటకు ప్రయత్నించెదరు గాక. ఎటులయినను, దీనిలో చెప్పిన జ్ఞాన, ధ్యాన, భక్తి, కర్మయోగసాధనలు మానవకళ్యాణ మునకు మిక్కిలి యుపయోగకరమైనవి. జైనులు, బౌద్ధులు, పారశీలు, ముస్లిములు క్రైస్తవులు యేమతస్థులయిన నేమి దీనిలోని సనాతనధర్మముల ననుసరించి నడచుకొన్నవారే బ్రాహ్మణులు. వారే మోక్షమున కర్హులు. ఇదివర్ణసంకరమ ననిందు లోపమేమియు లేదు సాంఘికాచారములకును మో క్షప్రాప్తికిని యెట్టి సంబంధమును లేదు.

# బోధాయన ధర్మసూత్రములు



ఈ సూత్రములు ఆపస్తంబ, హిరణ్యకేశిన సూత్రములకంటె పూర్వపువి. వానివలెనే యివికూడ కృష్ణయజుర్వేదములోని తైత్తిరీయశాఖకు చేరి, ఆంధ్రకర్ణాట దేశములలో వాడుకలో నున్నవి. ఈబోధాయన సూత్రములను వ్యాఖ్యానములు దొరకనందున, మనకవి సంపూర్ణముగ లభించకపోవుటయేగాక, వానిలో నిటీవలకొన్ని మార్పులు చేర్చినట్లు పాశ్చాత్య విమర్శకుల యభిప్రాయము. బర్నల్ గారి పరిశోధనలను బట్టి యీసూత్రములు ఆరువిధములుగ విభజింపబడెను. (1) శ్రౌతసూత్రములు, (2) కర్మాంతసూత్రములు, (3) ద్వైధసూత్రములు, (4) గృహ్యసూత్రములు (5) ధర్మసూత్రములు, (6) శుల్బసూత్రములు. ఈబోధాయన ధర్మసూత్రములలో మొదటిరెండుప్రశ్నలు, ఆయనచే రచింపబడినవనియు మూడునాలుగుప్రశ్నలు తరువాత నెవరోచేర్చిరనియు, వీని భాషాభేదములనుబట్టి స్పష్టపడుచున్నది. బోధాయనులవారు ప్రవచనకారుడని ప్రసిద్ధిపడయుటచే, యీయన సామాన్యసూత్రకారుడు కాడని పూర్వుల యభిప్రాయము. శుక్లయజుర్వేదములో చేరిన శతాతప బ్రాహ్మణమునుండికూడ కొన్ని నిబంధనలు దీనిలో తీసికొనబడియున్నవి. ఈయన నావికా

యాత్రలనుగురించి తరుచుగా చెప్పుచుండుటచే, బోధాయనుండు ఆంధ్రజిల్లాలలోనివాడేమోయని సందేహము కలుగుచున్నది. సాంఘికాచారములు, పూర్వకాలములో నెట్లున్నవో తెలుపుటకు, కొన్నిసూత్రముల నీక్రింద నుదహరించుచున్నాను.

1. మొదట వేదములు (శ్రుతులు) తరువాత స్మృతులు తరువాత శిష్టాచారములు ప్రమాణములు (ప్రశ్న 1-అధ్యాయము 1-కండిక 1-సూత్రము 1 టు 4)

2. పదిదినములకంటె నెక్కువ ఆహారము సేకరించుకొనక, తృప్తికలిగియుండుట, ఓర్వలేమి, గర్వము, పరధనేచ్ఛ, కోపము, కాపట్యము మొదలగు దుర్గుణములు లేకుండుట, వేదవేదాంగ పారంగతులుగ నుండుట, శిష్టులలక్షణములు ఇట్టివారు, ధర్మనిర్ణయమునకు దొరకనియెడల, నాలుగువేదములు చదువుకొన్న నలుగురును, ఒక మీమాంసశాస్త్రజ్ఞుడును, వేదాంగములను తెలిసికొన్నవాడొకరును, ధర్మశాస్త్రజ్ఞుడొకడును, మూడుఆశ్రమములలోనున్న ముగ్గురు బ్రాహ్మణులును, యీపదిమందకలసి ఒకధర్మజ్ఞసభగాకూడి ధర్మమునునిర్ణయించవలెను. ఇట్టివారును దొరకనిచో, వేయిమందలకంటె అయిదుగురుగాని ముగ్గురుగాని, లేక ఒక్కరుగాని, అనింద్యులుగా నుండినయెడల ధర్మనిర్ణయముచేయుట కర్హులు. (ప్ర 1. అ1-కం.సూ 5 టు 9) వేదములు తెలియని వారనేక

వేలమంది బ్రాహ్మణులున్నను, వారు ధర్మజ్ఞసభ కానేరరు. (I-1-1. సూ 16.)

3. కొయ్యతో చేసిన యేనుగు, చర్మముతో చేసిన జింక, చదువుకొనిన బ్రాహ్మణుడు పేరునకుమాత్రమే, ఆయా తరగతులలో చేరినట్లెంచవలయును (1-1-1- సూ 10)

4. వేదములు పఠించుట పూర్తియగువరకు, ద్విజులు బ్రహ్మచర్యము నవలంబించవలెను. (1-2-3 సూ 4.)

5. బ్రహ్మచారి, అడవికిపోయి, కట్టెలు తెచ్చి గురువున కగ్నిహోత్రాదులకిచ్చుచు, సత్యవంతుడు, నిగర్వుడుగా నుండవలెను. ఆటపాటలు పనికిరావు. వాసనద్రవ్యములు పూలహారములు, పాదరక్షలు, ఛత్రము, కనులకు కాటుక, శరీరమునకు నలుగు విసర్జించవలెను. (1-2-3- సూ 19 టు 24)

6. బ్రహ్మచారి తనగురువు పాదములనొత్తుచు ఆయన తినగా, మిగిలిన యన్నమును తాను భుజించవలెను. (1-2-4 సూ 35)

7. బ్రహ్మచారి గురువునొద్ద విద్యను పూర్తిగ నభ్యసించి, అవివాహితుడుగ నున్నపుడు స్నాతకుడని పిలువబడును. అట్టివాడు దండకమండలములు పట్టుకొని తక్కిన ద్విజులవద్దను రథకారులవద్దను (వడ్రంగులు) వంపబడని పదార్థములను తెచ్చుకొని జీవించవలెను. వడ్రింగులు శూద్రులైనను, వేదములో చెప్పబడిన యజ్ఞములనుచేయుట కర్హులు. కష్టకాలములో స్నాతకుడు, అన్నివర్ణములవారియొద్దనుకూడ వండబడి

నపదార్థములును, తెచ్చుకొనవచ్చును. వానితో దేవతలకును, పితరులకును పాకయజ్ఞములు కావించవచ్చును. (1-2-5 సూ 9 టు 12)

8. పశువులను మేపునట్టియు, వర్తకము చేయునట్టియు చేతిపనులచే జీవించునట్టియు, గణికులు గాయకులైనట్టియు, సేవకులైనట్టియు, అధికవడ్డీమీద జీవించునట్టియు, బ్రాహ్మణులను, శూద్రులుగ పరిగణింపవలెను. (1-5-10-సూ 24)

9. పెంపుడు జంతువులను, పెంపుడుపక్షులను తినకూడదు. కాని మేకలను గొఱ్ఱెలను తినవచ్చును. ముళ్లపంది, అడవిపంది, చెవులపిల్లి, తాబేలు, ఖడ్గమృగములను, అయిదు వ్రేళ్ళుగలవాని నన్నిటిని తినవచ్చును. రెండుభాగములుగ చీలిన గిట్టలుగలలేళ్ళు, దున్నపోతులు మొదలగునవి భుజించతగినవే. కొన్నివిధములైన పక్షులను చేపలను తినవచ్చును (1-5-12- సూ 1 టు 8)

10. మేకపాలు, లొట్టియపాలు త్రాగకూడదు. ఒంటి గిట్ట జంతువులపాలుకూడ వర్జనీయములే (1-5-12-సూ 11)

11. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, తమ తమ క్రిందివర్ణములలోనుండి భార్యలను గ్రహించవచ్చును. అనగా, బ్రాహ్మణునికి నలుగురు, క్షత్రియునికి ముగ్గురు వైశ్యుని కిద్దరు, శూద్రునికొక్కరై భార్యలుండవచ్చును. (1-8-16-సూ 1-5)

12. బ్రాహ్మణునికి క్షత్రియభార్యవలన కలిగిన సంతతి బ్రాహ్మణులే. అతనికి వైశ్యభార్యవలన కలిగినవారు అంబష్టులనియు, శూద్రభార్యవలన కలిగినవారు నిషాదులనియు పారాశవులనియు వాడబడుదురు. (1-9-17-సూ 3- 4)

13. క్షత్రియునకు వైశ్యభార్యవలన కలిగినవారు క్షత్రియులే, అతనికి శూద్రభార్యవలన కలిగిన సంతానము ఉగ్రులనబడుదురు. వైశ్యునికి శూద్రభార్యవలన కలిగిన సంతానమురథకారులనబడుదురు. శూద్రునకు బ్రాహ్మణస్త్రీవలన కలిగిన సంతానమును ఛండాలురందురు.(1-9-17-సూ5-6-7)

14. బ్రాహ్మణునికి, బ్రాహ్మ, ప్రాజాపత్య, ఆర్ష, దైవవివాహములు విధ్యుక్తములు. అసుర, రాక్షస వివాహములు క్షత్రియులకును, గాంధర్వ, పైశాచవివాహములుశూద్రులకును విధింపబడినవి కొందరు శాస్త్రజ్ఞులు గాంధర్వవివాహము లన్నివర్ణములవారికిని అనుసరణీయములని చెప్పెదరు. (1-11-20-సూ 2-116)

15 విక్రయించుకొనబడిన స్త్రీ భార్యగా నుండతగదు. ఆమె అగ్నిహోత్రకర్మలలో పాల్గొనరాదు. ఆమెను దాసిగా భావించవలెను. కన్యాశుల్కమును పుచ్చుకొన్నవారు నరకమున బడుదురు. (1-11-21- సూ 2-3)

16. శూద్రులు, అపపాత్రులు, వినుచుండగా గాని, కనుపడుచుండగా గాని వేదములను వల్లెవేయకూడదు (1-11, 21-సూ15)

17. అష్టమి, చతుర్దశి, అమావాస్య, పౌర్ణమి మొదలగు పర్వదినములలో వేదమును చదువకూడదు (I-11-21-సూ 22)

18. సముద్రముమీద ప్రయాణము చేయువారును, బ్రాహ్మణుని సొమ్ము హరించినవారును, భూమివిషయమై అబద్ధపు సాక్ష్యమిచ్చువారును వర్తకము చేయువారును, శూద్రులను కొలుచువారును, శూద్రస్త్రీలయందు కొమాళ్ళను కనువారును పతనీయులు, వర్ణభ్రష్టులునగుదురు. వీరికి అనేకవిధములగు ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి (II-1-2-సూ 2-10)

19. గురువుల బంధువుల, స్నేహితురాండ్రతోను సంభోగించువారును, వైద్యవృత్తి, నటకవృత్తి, సంగీతనాట్యముల నేర్పువృత్తి, వీనివలన జీవించువారును, పశువులను కాచువారును, ఉపపాతకులు. వీరు రెండేసి సంవత్సరములు తమవర్ణములనుండి బహిష్కృతులై తరువాత ప్రాయశ్చిత్తముచేసికొని తమతమ వర్ణములలో చేర్చుకొనబడుదురు (II-1-2సూ 13-14)

20. ఎల్లప్పుడు కమండలమును యజ్ఞోపవీతమును ధరించి వేదాధ్యయనము చేయుచు, శూద్రాన్నము భుజింపక, వేదములో చెప్పబడిన పంచయజ్ఞములను చేయు బ్రాహ్మణుడు బ్రహ్మలోకనివాసిగానే సదాయుండును. (II-2-3-సూ 1)

21. వివిధవర్ణములనుండి భార్యలను తెచ్చుకొన్నపుడు వారిపుత్రులు తమతండ్రి యాస్తిని పదిభాగములుచేసి, ఆయా

వర్ణముల ప్రకారము 4 3, 2, 1, గా పంచుకొనవలెను. (II-2-౨-సూ 10)

22. ఔరసుడు, పుత్రికపుత్రుడు, క్షేత్రజుడు దత్తుడు, కృత్రిముడు గూఢజుడు, అపవిద్ధుడు, కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, నిషాదుడు, పారాశవుడు, అనుపదునలుగురు పుత్రులుండవచ్చును. వీరిలో ఔరసుడు, పుత్రి పుత్రుడు, క్షేత్రజుడు, దత్తుడు కృత్రిముడు, గూఢజుడు, అపవిద్ధుడు దాయార్హులు. కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు నిషాదుడు, తమతండ్రి కుటుంబములోనివారుగ నెంచబడుదురు. (II-౭-3-సూ 14 32)

23. స్త్రీలు, చిన్నతనములో తమతల్లి దండ్రులయొక్కయు యౌవనములో పెనిమిటి యొక్కయు, ముసలితనములో కొమాళ్ళ యొక్కయు సంరక్షణలో నుండవలెను. వారెన్నడును స్వాతంత్ర్యమునకు తగినవారుకారు. వారు అబలలు వారికి దాయభాగముండకూడదు. పెనిమిట్లను సంతోషపెట్టు స్త్రీలే స్వర్గమునకు పోవుదురు (II-2-3సూ 45.46)

24. స్త్రీలకెప్పుడును శుచిత్వము కలుగుట కవకాశములున్నవి. ప్రతినెలలోను బహిష్టులగుచుండుటచే వారిసమస్తపాపములు, మూడుదినముల తరువాత నశించుచుండును. సోముడుశుచిత్వమును, గంధర్వుడు మంచికంఠస్వరమును, అగ్ని అన్నియవయవములకును శుచియు, నిచ్చియున్నారు. గనుక, సమస్తదోషములనుండి, స్త్రీలువిముక్తులగులున్నారు. (II-2-4సూ 4,5

25. పదిసంవత్సరములైనతరువాత గొడ్రాలైన భార్యను' 12 సంవత్సరములతరువాత, కొమార్తెలనేకనుచున్న భార్యను, 15 సంవత్సరములతరువాత, పిల్లలుపుట్టి పుట్టినపిల్లలు నిలవనిభార్యను, పోట్లాడుభార్యను తక్షణమే,వదలివేసి, తిరిగి మరియొక స్త్రీని వివాహము చేసికొనవచ్చును. (II-2-4-సూ 6)

26. పెనిమిటి చనిపోయిన ఒకసంవత్సరము,లేక ఆరు మాసములవరకు తేనె, మాంసము, కల్లు, ఉప్పును విసర్జించి గురువుల యాజ్ఞను తీసుకొని, ఒక వితంతువు, తనకు కొమాళ్ళు లేనపుడు, తన పెనిమిటి సోదరునివలన ఒక కొమారుని కనవచ్చును. (II-2-4-సూ 7 ను 9)

27. బ్రాహ్మణుడును, వైశ్యుడును, ఆపత్కాలము లందు క్షత్రియధర్మముల నవలంబించవచ్చును.

(II-2-4సూ 18)

28. శూద్రుడు, అతిథిగావచ్చినపుడు, అతనిచేత నేదైనను పనిచేయించి, అతనికన్నము పెట్టవలెను (II-3-5సూ 14)

29. ఆడపిల్లను, బట్టకట్టుకొన నేరనపుడే, గుణవంతుడైనను, కాకపోయినను, ఒక బ్రహ్మచారికిచ్చి వివాహము చేయవలెను. రజస్వలైనతరువాత, అవివాహిత స్త్రీని యింటిలోనుంచకూడదు. మూడుసంవత్సరములవరకు ఆమెను అవివాహితగా రజస్వలైనతరువాత నుంచిన యెడల భ్రూణహత్యచేసిన దోషము సంభవించును. ఆరజస్వలను యెవరైనను, వివాహమున కడిగినను సరే, అడుగకపోయినను,

సరే, ప్రతిరజోదర్శనమందును, ఆమెతండ్రి పాపమును సంపాదించుకొనుచుండునని మనువు చెప్పెను. ప్రథమరజోదర్శనమైన మూడుసంవత్సరములవరకు, తండ్రియాజ్ఞకు వేచియుండి నాల్గవసంవత్సరములో, స్త్రీ తనకులములో వానిని, మంచి వానిని, వివాహము చేసికొనవలెను. అట్టివాడు దొరకకపోయినయెడల మంచిగుణములులేనివానినైనను వివాహము చేసికొనవలెను. (IV-1-సూ11 టు 14)

30. కన్యాదానము చేసినతరువాతను, గర్భాధానము చేయకమునుపు పెనిమిటి చనిపోయినయెడల, ఆస్త్రీ యక్షతయోనియై తిరిగి పుట్టినింటికివచ్చి వివాహము చేసికొనవచ్చును. (IV-1-సూ16)

# ఆపస్తంబధర్మసూత్రములు



ఈ సూత్రములు వింధ్యపర్వతములకు దక్షిణమున నున్న ప్రాంతములందు ప్రచారములో నున్నవి. ఆపస్తంబులవారు ఆంధ్రదేశజులని వాడుక. కృష్ణయజుర్వేదములోని తైత్తిరీయ బ్రాహ్మణములను బట్టి వీరు రచించిన కల్పసూత్రములో యీధర్మసూత్రములు ఒకభాగము. శ్రౌత, గృహ్య కర్మాంత, శుల్వసూత్రములు గూడ ఆకల్పసూత్రములోనే యున్నవి. మనప్రస్తుత సాంఘికపరిణామ విమర్శనమున కుపచరించునవి ముఖ్యముగా గృహ్యసూత్రములు, ధర్మసూత్రములు నై యున్నవి. ఈయన తనగృహ్యసూత్రములను టూకీగా వ్రాసిరి. ఆశ్వలాయన, సాంఖ్యాయన, గోభిల, పారస్కర గృహ్యసూత్రములవలె విపులముగ వ్రాయక వానిని తమ ధర్మసూత్రములలోనే కొద్దిగ వ్రాసిరి. క్రీస్తు పుట్టకపూర్వము అయిదారువందల సంవత్సరములు లోపుగ యీధర్మసూత్రములు వ్రాయబడియుండును. బోధాయన ధర్మసూత్రములు వింధ్యపర్వతముల కుత్తరమునను న్న ఆర్యావర్తములో వాడుక యందున్నవి. ఇవి ఆపస్తంబసూత్రముల కంటె పూర్వపువి. ఇప్పుడు మనదేశస్థులకు ముఖ్యప్రమాణమైన ఆపస్తంబధర్మసూత్రములలోని కొన్ని సాంఘికాచారములను ప్రస్తుత సాంఘిక సమస్యలకు సంబంధించినంతవరకు వివరించుచున్నా

ను తక్కిన శౌచ, ప్రాయశ్చిత్త, నైతిక, ఆధ్యాత్మిక వ్యావహారికాది ఆచారములు ఇప్పుడు జనసామాన్యములో వాడుకలో లేనివి పునరుద్ధరించుటకు వీలులేనివి యగుటచే నిచ్చట నుదహరించలేదు. ఈక్రింద నుదహరింపబడు కొద్ది యుదాహరణములవలననే, పూర్వ వర్ణాశ్రమ ధర్మములు చాలాభాగము అడుగంటినవనియు వానిని యీ యాధునిక యుగములో మనయువకులచేత అవలంబింపచేయలేమనియు స్పష్టపడును. మతముతో సంబంధము పెట్టుకొనకపోయినను బాహ్యశుచి, అంతశ్శుచులు మనవారందరు గమనించుచునే యుందురు హేతువులు కనుపడని కర్మకాండమంతయు త్రోసివేయుచుందురు.

1. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులలో మొదటివారు, తరువాత చెప్పబడువారికంటె జన్మమువలన నుత్కృష్టులు. శూద్రులుతప్ప తక్కిన మూడువర్ణములవారు ఉపనయనము, వేదాధ్యయనము, అగ్నిహోత్రములు కలిగియుండవలెను. (ప్రశ్న 1. ప 1 ఖం 1. సూ 5, 6,

(2) బ్రహ్మచారి దేవునినైవేద్యమును తినకూడదు ఉప్పు, కారము తేనె మాంసము తినకూడదు. సువాసనద్రవ్యముల నుపయోగించకూడదు. స్త్రీలతో సంభోగించరాదు. తలకుసుగంధతైలములను రాచుకొనుట దేహముపలంకరించుకొనుట వేడినీళ్ళతో శరీరమును కడుగుకొనుటపనికిరాదు జుట్టుముడివేసికొని యుండవలెను. (1-1-2సూ22టు 31)

(3) బ్రహ్మచారి మధుకరమెత్తి అన్నము తెచ్చు కొని గురువునకుగాని ఆయన కుటుంబమునకుగాని వారు లేని యెడల శ్రోత్రియునకుగాని ముందుగా పెట్టి తరువాత తాను భుజించవలెను (1-1-3-సూ31టు35) తనకొరకు మాత్రమే ముష్టియెత్తకూడదు

(4) బ్రహ్మచారి తాను వాసనచూచుటకు, పువ్వు లను ఆకులను కోయకూడదు. పాదరక్షలు గొడుగు, బండి మొదలగు భోగములుండకూడదు. నవ్వకూడదు. [1-2-7 సూ4,5,6]

(5) స్మశానము సమీపమునగాని. శూద్రులకు పతి తులకును వినబడునట్లుగాని, వేదమును చదువకూడదు. (I-3 9-సూ 4,9)

(6) శూద్రులు ముట్టుకొనుచుండగా ద్విజులుభోజనము చేయకూడదు. అపాత్రులతో యేకపంక్తిని భుజించగూడదు. (1-5-17 సూ 1-2)

(7) ఓడలో నేమియు తినగూడదు. (1-5-17సూ6)

(8) ద్విజుడు, అంగడిలో అన్నమును కొని తినకూడదు పచ్చిమాంసము తేనె, ఉప్పు నూనె మజ్జిగలు కొనుక్కొన వచ్చును [1-5- 7సూ14టు16)

9 నీరుల్లి వెల్లుల్లి, ఉల్లికోళ్ళు కుక్కగొడుగులు తిన కూడదు. కాని ఆవుల యెద్దుల మాంసము తాబేలు అడవి పంది ఖడ్గమృగము, చెవులపిల్లి యిర్రి లేడిమాంసములు కొన్ని చేపలను పక్షులను భక్షింపవచ్చును. (1-5-17-సూ26టు89)

(10) బ్రాహ్మణుడు, స్వధర్మముల నాచరించు క్షత్రియ వైశ్యులు పెట్టెడు భోజనము నారగించవచ్చునని కొందరి మతము. కష్టకాలమందు జ్ఞానమును సంపాదించుటకు వచ్చి, సేవ చేయుచున్న శూద్రుని యన్నమును ద్విజులు భుజించవచ్చును [1-6-18సూ13, 14)

(11) ఇండ్లను, భూములను బాడిగకిచ్చువారు వైద్య వృత్తివలన జీవించువారు అధికవడ్డీకి అప్పులిచ్చువారు, చేతిపనులమీద జీవించువారు వీరిచ్చు ఆహారమును తినకూడదు. [1-6-18సూ18టు22]

(12) అగ్నిహోత్రాదులను వదలి వేదములు నిత్యము వర్లించని బ్రాహ్మణు నింటిలో భోజనము చేయకూడదు. (1-6-18సూ32, 33,)

(13) బ్రాహ్మణుడు వర్తకము చేయకూడదు. కష్టకాలములో చేసినను, మిఠాయి, రంగులు, భోజనపదార్థములు, లక్క, ఉదకము, మిరియాలు, ధాన్యము, మాంసము, ఆయుధములు మొదలగు వానిలో క్రయవిక్రయములను చేయకూడదు. (1-7-20-సూ 10 to 14)

(14) వేదములు చదువని ద్విజులు పతితులు వర్ణభ్రష్టులగుదురు. (1-7-21-సూ 8)

(15) శుచిగానున్న శూద్రుడు, వైశ్వదేవములలో కూడ అగ్రజాతులపై తణిఖీలో వంటచేయవచ్చును. II-2-3-సూ (4)

(16) బ్రాహ్మణుని యింటికి శూద్రుడు అతిథిగావచ్చిన యెడల, అతనిచేత యేమాత్రమైనను పనిచేయించుకొనకుండ భోజనము పెట్టకూడదు. (II-2-4-సూ 19)

(17) వేదములు మొదలగునవి చదువుట బోధచేయుట అగ్నిహోత్రకర్మలు చేయుట చేయించుట, అన్నము పెట్టుట, అన్నము స్వీకరించుట, పొలములలో ధాన్యపుగింజల నేరుకొనుట, బ్రాహ్మణుల విధ్యుక్త ధర్మములు. క్షత్రియుల కు పైవానిలో వేదములు మొదలగునవి బోధచేయుట, అగ్నిహోత్రకర్మలు చేయించుట అన్నమును స్వీకరించుటకూడవు రాజ్యముచేయుట, యుద్ధము చేయుటయను రెండువిధులుపై వానితో చేర్చవలెను. వైశ్యునికి, క్షత్రియుని విధులలో వీనిని తీసివేసి వ్యవసాయ, పశుసంరక్షణ, వర్తకవిధులుచేర్చవలెను. (II-5-10-సూ 4 to 7)

(18) శ్రాద్ధకర్మలలో క్రొవ్వులతో కలసిన యాహారము, మొద్దు దున్నపోతు, ఖడ్గమృగముల మాంసము కొన్ని విధములగు చేపలు, పక్షులు, అడవిజంతువుల మాంసము బ్రాహ్మణులకు పెట్టినయెడల అధికఫలము రాగలదు. (II-7-16 సూ 24 to 27; II-7-17-సూ 1 to 3)

# గౌతమ ధర్మసూత్రములు



ఈ కాలములో ప్రచారమందున్న నాలుగు ధర్మ సూత్రములకును అనగా బోధాయన, ఆపస్తంబ, ఆశ్వలాయన హిరణ్య కేశినుల సూత్రములకు పూర్వముననే యీ గౌతమ ధర్మసూత్రము లుండెను. అప్పటికి అనేక గౌతములును, అనేకుల ధర్మసూత్రములు నున్నట్లు కనపడుచున్నవి గాని యవి యింత వరకును దొరకలేదు. ఈ గౌతమ ధర్మ సూత్రములు సామవేది చేత మొదట వ్రాయబడి తరువాత అనేకులచేత మార్చబడినట్లు వీనిలోని వ్యతిరేక విషయములు భాషాభేదములను బట్టి పెద్దలు నిర్ణయించుచున్నారు. అయినను మొత్తముమీద మన కిప్పుడు దొరికిన ధర్మసూత్రముల కంటె యివియే పూర్వపువి యని నిశ్చయించవచ్చును. వీని లోని కొన్ని ముఖ్య సాంఘిక ధర్మముల నిచ్చట వివరించుచున్నాను.

(1) ఇతరులచేత వివాహమాడబడని సవర్ణ స్త్రీనివివామాడుట యుత్తమము. వధూవరులు ఒకే ప్రవరలో చేరకూడదు. ఉభయుల తండ్రుల నుండి పైకి లెక్కించగా ఆరు తరముల వరకును, తల్లుల నుండి నాలుగు తరముల వరకును, వధూవరుల పూర్వులు కలియకూడదు. (అధ్యాయము 4 సూ. 3—5)

(2) బ్రాహ్మ, ప్రాజాపత్య, దైవ, ఆర్ష వివాహములు ధర్మ సమ్మతమైనవి. కొందరు ధర్మవేత్తలు ఆసుర గాంధర్వ వివాహములను కూడ నంగీకరింతురు (అ 4 సూ 14, 15)

(3) నాలుగు వర్ణములలో క్రింది వర్ణముల నుండి తెచ్చుకొన్న భార్యల సంతతివారు సవర్ణులు, అంబష్టులు, ఉగ్రులు నిషాదులు, పారాశవులని వరుసగా పిలువబడుదురు. (అ 4 సూ 16)

(4) ఏడవ తరములో, పైవర్ణము వారు క్రింది వర్ణములకును, క్రింది వర్ణముల వారు పై వర్ణములకును రాగలుగుదురు. కొందరు గొప్ప ధర్మవేత్తలు ఐదవ తరమే చాలు ననుచున్నారు ప్రతిలోమ వివాహములం జనించిన వారలెన్నటికిని కాజేరు (అ 4 సూ 22 to 25)

(5) శూద్రునికి పైజాతి స్త్రీల వలన కలిగిన సంతానము చండాలురు, నీచాతినీచులని వాడబడవలెను (అ 4 సూ 27, 28)

(6) ద్విజుడు, ప్రతిదినము కొంత వేదపారాయణమును, పితృ తర్పణమును చేయవలసిన విధి తక్కిన శ్రౌత కర్మములు, శక్తి కొలది చేయవచ్చును (అ 5 సూ 4—6)

(7) ఆపత్కాలమందు బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరుల వద్ద చదువుకొనవచ్చును బ్రాహ్మణుడు, తనకు విధించిన కర్మములు చేయజాలకపోయిన, క్షత్రియ ధర్మములనవలంబింప వచ్చును. అతడు వైశ్యధర్మములను కూడ నవలంబింప

వచ్చును కాని పరిమళ ద్రవ్యములు, నువ్వులు, నారబట్టలు, తోళ్ళు, రంగుబట్టలు, పాలు, పండ్లు, పువ్వులు, ఔషధములు, వేళ్ళు నీళ్ళు, తేనె, మాంసము, గడ్డి, విషము, కసాయి వ్యాపారము, ఆవుదూడలను, చూడితోనున్న ఆవులను బ్రాహ్మణు డెన్నడును విక్రయింపగూడదు. కొందరు ధర్మజ్ఞులు భూమి, బియ్యము, గొర్రెలు, మేకలు యెద్దు పాలిచ్చు ఆవులను కూడ విక్రయించకూడదని చెప్పెదరు (అ 7 సూ 1-15)

(8) కష్ట సమయములో బ్రాహ్మణుడు కత్తి పట్ట వచ్చును. క్షత్రియ వైశ్య వృత్తుల నవలంబింపవచ్చును. (అ 7, సూ 25 26)

(9) నలువది సంస్కార విధు లాచరించినను,అష్టసద్గుణములు లేనివాడు స్వర్గ మోక్షములను పొందడు. ఆ సంస్కార విధులలో కొన్ని లోపించినను ఈగుణములు కలవాడు వానిని పొందగలడు. ఆ సద్గుణము లేవనగా,సమస్తజీవరాసుల యెడల దయ, కోపము లేకపోవుట, శుచిత్వము, సమ్మది శుభము, ఆశ్యాశ దురాశలు లేకపోవుట.ఓర్పు(అ 8 సూ 23 to 25)

(10) భార్యతో కలిసి భోజనము చేయకూడదు. (అ 9. సూ 32)

(11) వేదము చదువుట, నిష్కామకర్మము,దానములపట్టుట, యిచ్చుట, యజ్ఞయాగాది కర్మములు చేయుట, చే

యిచ్చుట యివి ద్విజాతులందరకును విధ్యుక్త ధర్మములు (అ 10 సూ 1 to 3

(12) బ్రాహ్మణుడితరులచేత వర్తకము చేయింపవచ్చును. (అ 10 సూ 5)

(13) శూద్రుడు, అష్టక. పార్వణ, శ్రావణ, అగ్రహాయణి, చైత్రి, ఆశ్వయుజి యను పాకయజ్ఞములను చేసికొనవచ్చునని కొందరు ధర్మజ్ఞులు చెప్పెదరు (అ 10 సూ 65)

(14) శూద్రుడు బుద్ధిపూర్వకముగ వేదాధ్యయనము విన్నయెడల అతని చెవులలో సీసముగాని లక్కగాని కరిగించి పోయవలెను శూద్రుడు వేదములను చదివిన యెడల ఆతని నాలుకను కోయవలెను. అతను వేదములను జ్ఞాపకము తెచ్చుకొనుచున్న యెడల అతని శరీరము రెండు వ్రక్కలుగ చేయవలెను ద్విజునితో ఆతనుసమానముగ కూర్చున్నగాని పరున్నగాని సంభాషించినగాని, నడచినగాని, ఆతని వీపుబ్రద్దలుకొట్టవలెను. (అ 12 సూ 1 to 7)

(15) బ్రాహ్మణుడు శూద్రుని తిట్టినయెడల శిక్షయే లేదు. (అ 12 సూ 13)

(16) నువ్వులు, మినుములు, బియ్యము, నీళ్ళుదానము చేయుట వలన పితృదేవతలు ఒక మాసమువరకు తృప్తి నొందుదురు. చేపలు, లేళ్ళు, తాబేలు, అడవిపంది, మేకమాంసముల వలన మూడు సంవత్సరములవరకును గొర్రె, ఖడ్గ

…మృగ మాంసములను తినెనో బ్రాహ్మణులకు పెట్టిన యెడల చాలా కాలము వరకు పితృదేవతలు తృప్తినొందెదరు. (అ 15 సూ 15)

(17) జాతివాద్యముమీద సంగీతముపాడి జీవించు వానికి శ్రాద్ధకర్మముల యందు అన్నము పెట్టకూడదు. (అ 15 సూ 18)

(18) విధ్యుక్తధర్మముల నాచరించు ద్విజులయిండ్లలో బ్రాహ్మణుడు భోజనము చేయవచ్చును. దానము స్వీకరింప వచ్చును (అ 17 సూ 1)

(19) బ్రాహ్మణుడు చిరుచేపలను, శశిమాంసమును ఏ వర్ణమువారిచ్చినను స్వీకరింప వచ్చును వానిని నిరాకరించ కూడదు. (అ 17 సూ 3)

(20) గొల్లవాడు, సేద్యగాడు, మంగలివాడు, నౌఖరు పత్రకుడు, కుటుంబమునకు స్నేహితుడు పెట్టినట్టి భోజనమును బ్రాహ్మణుడు స్వీకరింపవచ్చును (అ 17 సూ 6)

(21) పోలీసు ఆఫీసరు, కంసాలి, పిసినారి, కారాగృహాధికారి, శస్త్రవైద్యుడు, పెట్టు అన్నమును బ్రాహ్మణుడు తినకూడదు. (అ 17 సూ 17)

(22) అడవిపంది, చెవులపిల్లి, ముళ్లపంది, ఖడ్గమృగము, తాబేలు తప్ప, తక్కిన పంచ నఖముల జంతువుల మాంసమును బ్రాహ్మణులు తినకూడదు. పాలిచ్చు ఆవులు, దుక్కి యెద్దు వీని మాంసమును వర్జింపవలెను. (అ 17 సూ 27, 30,32)

(23) పుత్రులు లేని విధవంతువు తన పెనిమిటి సోదరుని వలన పుత్రులను కనవచ్చును గురువాజ్ఞను తీసికొని ధర్మ శాస్త్రములలో చెప్పినతరుణము లందు సంగమముండవలెను. పెనిమిటికి సోదరులు లేనపుడు సపిండుడుగాని, సగోత్రికుడుగాని సమానవర్ణము [illegible]గాని పుత్రులను కనవచ్చును. ఇద్దరు పిల్లవాండ్రికంటె ఆ విధంతువెక్కువ మందిని కన కూడదు. ఆ పుత్రులు [illegible]తండ్రికే చెందుదురు. పెనిమిటి జీవించి యుండగా నతని, యిష్టము మీద కన్నపిల్లవాడు పెనిమిటికే చెందును. పరాయి మనిషి వలన కలిగిన పుత్రుడు ఆతనికి గాని, ఖరారుతీసికొన్న యెడల ఉభయులకు గాని చెందవచ్చును ఆ పిల్ల వానిని పెనిమిటియే పెంచినయెడల అతనికే చెంద గలడు. (అ 18 సూ 4 to 14)

(24) పెనిమిటి విదేశ గమనుడైన యెడల అతనిరాకకు ఆరు సంవత్సరములు పరీక్షించి అటు తరువాత తిరిగి వివాహము చేసికొనవచ్చును (అ 18 సూ 15)

(25) తల్లిదండ్రులచేత నియమించబడని అవివాహిత కన్య మూడు సారులు బహిష్ఠయైన తరువాత తనయిష్టము వచ్చిన వరుని వివాహము చేసికొన వచ్చును. (అ 18 సూ 20)

(26) తల్లిదండ్రులు కన్యాదానము చేయదలచినయెడల కన్య [illegible]ల కాక మునుపే చేయవలెను. ఆలాగున చేయుని వారు పాపులగుదురు. బట్టకట్టుకొనుటయెరుగని కన్యకు వివాహము చేయవలెనని కొందరు ధర్మజ్ఞులు చెప్పెదరు. (అ 18 సూ 21, 22, 23)

(27) ఒకవితంతువు తన పెనిమిటి సోదరులుండగా నితర బంధువుల వలన పుత్రులను కన్నయెడల, వారు దాయాదులు కారు (అ28సూ23)

(28) ఔరసుడు, క్షేత్రజుడు నియోగము వలనకలిగిన పుత్రుడు, కృత్రిముడు, గూఢజుడు, అపవిద్ధుడు, తమ తండ్రుల ఆస్తులను సమానముగ పంచుకొన తగినవారు (అ28సూ32.),

(29) కానీనుడు, సహోఢుడు, పౌనర్భవుడు, పుత్రికపుత్రుడు, స్వయందత్తుడు, కొన్నపుత్రుడు, వారల తండ్రుల కుటుంబములో చేరినవారగుచున్నారు. కాని మొదటిఅయిదు విధములగుపుత్రులు లేనపుడు, తరువాత చెప్పబడిన యీయారు విధములగు పుత్రులు తమ తండ్రిభాగములో నాలుగవ వంతు మాత్రమే తీసికొనెదరు (అ 28సూ 33' 34)

(30) బ్రాహ్మణునికి క్షత్రియ భార్య వలన కలిగిన జ్యేష్ఠ పుత్రుడు, మంచి గుణములు కలవాడైనయెడల, అతని బ్రాహ్మణ భార్యవలన గలిగిన కనిష్ఠ పుత్రులతో సమానముగ తండ్రి యాస్తిని పంచుకొనెదరు. కాని జ్యేష్ఠ భాగము మాత్రము మొదటి వానికి రానేరదు. (అ 28 సూ 35, 36)

(31) పైవిధముగానే, బ్రాహ్మణునికి క్షత్రియవైశ్య భార్యల వలన కలిగిన పుత్రులు పంచుకొనెదరు. ఈలాగుననే క్షత్రియుని పుత్రులకును చెప్పబడినది (అ 28 సూ38)

(32) బ్రాహ్మణునికి శూద్రభార్యవలన జనించిన కొమారునికి విధేయుడుగ నున్నయెడల తండ్రిఆస్తిలో నుండి వనోవృత్తి నీయవచ్చును. (అ27 సూ39)

(33) ప్రతిలోవివాహములవలనపుట్టినవారు బ్రాహ్మణునికిని శూద్రస్త్రీకిని పుట్టిన పుత్రులవలె నెంచబడెదరు. (అ28. సూ45)



# మానవధర్మశాస్త్రము.



మనుస్మృతి, స్మృతులన్నిటికెల్ల మొదటిదనియు సంపూర్ణమైన దనియు, హిందువులందరిచే గౌరవింపబడుచున్న దనియు ననుటకు సందేహములేదు ప్రస్తుతమందు వ్యాపకము లోనున్న యీ మానవధర్మశాస్త్రము వేదములలోను, మహాభారతములోను, బృహస్పతిస్మృతిలోను వాక్రాయబడిన మనుస్మృతియని యెవరును అభిప్రాయపడకూడదు. మను స్మృతి సుమారు 500 బి సి. క్రిందట వ్రాయబడినట్లు కొందరు పరిశోధకులయభిప్రాయము ఇది పూర్వపుగద్యకావ్య మునకు శ్లోకరూపముగ, నూతనవిషయములతో దగ్గిమిలాయించి వ్రాయబడినది. కృష్ణ యజుర్వేదములో మైత్రాయణీయ శాఖలో మానవులనే భాగములో చేరియుండుటచే, యిది మానవధర్మశాస్త్రమని పేర్కొనబడినది ఈశాఖవారివి, ధర్మసూత్రములే గాక వీరికల్ప సూత్రములు, గృహ్యసూత్రములుకూడ కొన్ని యిటీవల దొరికినవి. ఈ ధర్మశాస్త్రము యొక్క ప్రాతిపదికములగుగద్య ధర్మసూత్రములింకనుదొరక లేదు. కాబట్టి యీ గ్రంథము సూత్రకాలము (600 B. C. 200 B. C.) తరువాతనె వ్రాయబడియుండును దీని మొదటి వ్యాఖ్యానకర్త మేధాతిథి 1000 A. D.

లో జీవించెనని స్పష్టముగా మనకు తెలియవచ్చినది. కాబట్టి యీగ్రంథము కనీసము సుమారు 500 A, D. లో వ్రాయ బడి యుండవచ్చును. కుమారిలభట్టుయొక్క ఆశ్వలాయన గృహ్యసూత్రముల వ్యాఖ్య 700 A. D. లో రచింపబడి నట్లు స్పష్టము. ఈ మానవధర్మశాస్త్రములోని భాషా వ్రయోగములు, దానింలోనివంటివే. మొత్తముమీద క్రీస్తు పుట్టినతరువాతనే, యీగ్రంథము 100 A. D.500A. D. మధ్యను వెలువడినదని చెప్పవచ్చును. దీనిలోని ధర్మములను ప్రస్తుతమందు సాంఘిక పరిణామశాస్త్రమున కుపకరించు కొన్నిటినిక్కడ నుదహరించుచున్నాను.

(1) కఱ్ఱయేనుగు, తోలుజింక, వేదము నేర్వని బ్రాహ్మణుడు, నామమాత్రములే కాని నిజమగునవి కావు. (అ 11శ్లో 157)

(2) నపుంసకునికి భార్య, అవునకు మరియొకయావు' బుద్ధిహీనునకు ధర్మోపదేశము నెట్లనుపయోగములో వేదము తెలియని బ్రాహ్మణుడుకూడ సంఘమునకు నట్లే. (II-158) ఈజన్మములోనే, యతడును, అతనికుటుంబముకూడ శూద్రులే (II-168). వేదజ్ఞానములేని బ్రాహ్మణుడు అగ్ని హోత్రములోని గడ్డివలె భస్మమునొందును. (III-168)

(3) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు, తమ క్రిందవర్ణ ములనుండి భార్యలను, వివాహము చేసికొనవచ్చును (III-13)

కాని బ్రాహ్మణుడు శూద్రకన్యను వివాహ[illegible]కొని, కుమారునికన్న యెడల శూద్రుడగును. (III-17)

(4) స్త్రీలను గౌరవించిన కుటుంబముతే సంపదతో కూడుకొని, దేవతలనుకూడ సంతోషింపచేయును. వారు విచారపడినయెడల కుటుంబము నశించును (III 55-62)

5 చండాలుడు' కుక్క, పంది, నపుంసకుడు, కోడి, బహిష్ట స్త్రీ, చూచుచుండగా బ్రాహ్మణుడు భోజనముచేయ కూడదు. (3-239) నీచజాతివాడు తాకుటవలన బ్రాహ్మణుని కర్మమంతయు నాశనమగును. III-241)

6. నువ్వులు' బియ్యము, పప్పులు, నీళ్ళు, దుంపలు, పీనివలన ఒకమాసమును చేపలు, మాంసమువలన రెండునెలలును, లేడి మాంసమువలన మూడునెలలును, గొర్రె మాంసమువలననాలుగునెలలును, పక్షిమాంసమువలన అయిదు నెలలును, మేకమాంసమువలన ఆరునెలలును, చారల లేడి మాంసమువలన యేడుమొదలు తొమ్మిదినెలలును, అడవిపంది దున్నపోతు మాంసమువలన పదినెలలును, చెవులపిల్లి తాబేలు మాంసమువలన పదునొకండు నెలలును, ఆవుపాలవలన ఒక వత్సరమును, ఖడ్గమృగము మాంసమువలన పండ్రెండు సంవత్సరములును, మహాశల్కము యెర్రగొర్రెమాంసము వలన యెంతకాలమైనను శ్రాద్ధములందు బ్రాహ్మణులకు పెట్టినయెడల పితరులు తృప్తినొందుదురు. (IV-267 టు 272)

7. బ్రాహ్మణుడు ప్రాపంచక వ్యవహారములను మాని వేదాధ్యయనము చేయుచు వేదమును బోధచేయుచు కళ్ళములలో గింజల నేరికొని తృప్తికలిగి శుద్ధముగ జీవించవలెను. (IV-10 టు 12)

8. భార్యతో కలసి భోజనము చేయుటగాని, ఆమె భోజనము చేయుచుండగా చూచుటగాని కూడదు. IV-48

9. శూద్రునికి సలహా నీయకూడదు. దేవుని కర్పించిన యాహారము నతనికి పెట్టకూడదు. ధర్మములను మతసంబంధమైన కర్మలను అతనికి నేర్పకూడదు. అట్లు చేసిన యెడల అట్టి శూద్రునితో అసంవృత్త నరకమున బ్రాహ్మణులు పడుదురు. (IV-808.)

10 శూద్రరాజులనుండి దానము తీసికొనకూడదు. పదివేల కసాయిఅంగళ్ళను పెట్టుకొనువానితో నట్టిరాజు సమానుడు. (IV-76)

అత్యాశగల రాజునొద్దనుండి దానముపట్టినవాడు వరుసగా యిరువదియొక్క నరకములందు పడుచుండును. IV-87

11. శూద్రుడు వినునట్లుగా వేదాధ్యయనము చేయకూడదు. (IV-99)

12. వేదములు చదువుకొనిన బ్రాహ్మణుడు దానము గ్రహించిన యెడల నీటిలో వేసిన రాయివలె క్రిందికి పడిపోవును. కాబట్టి యట్టిబ్రాహ్మణునికి దానముచేయకూడదు. మంచినీళ్లు దాహముకూడ అతని కీయకూడదు. (IV-190 టు 194)

13. పాటకుడు, పిసినారి, అధికవడ్డీకి ఋణమిచ్చువాడు నపుంసకుడు, వైద్యుడు, వీరియన్నమును తినకూడదు. (IV-210టు 212)

14. వెల్లుల్లి, నీరుల్లి, ఉల్లికోళ్లు తినకూడదు (V-5) దున్నపోతునుతప్ప తక్కినఅడవిజంతువులనుతినకూడదు (V-9) కొన్నివిధములైన చేపలనుతినవచ్చును. (V-16)పంచనఖములు గల మృగములలో అడవిపంది, ముళ్ళపంది, ఖడ్గమృగము, తాబేలు, చెవులపిల్లి, వీనిని తినవచ్చును. లొట్టిపిట్టతప్ప, తక్కిన ఒక్కపలువరుసగల జంతువులను తినవచ్చును. (V-18)

15. దేవపితృయజ్ఞములను చేసినతరువాత అట్టిమాంసములను భక్షించవలెను. తక్కిన కాలములలో వానిని విసర్జించుటయే యుత్తమము (V-31 టు 56) శ్రాద్ధములందు తప్పక మాంసములను పుచ్చుకొనితీరవలెను. అట్లు చేయని యెడల యిరువదియొక్క జన్మములవరకు మృగములై పుట్టుదురు. (V-35) మాంసము తినుటలోగాని మత్తుపదార్థము త్రాగుటలోగాని, సంభోగములోగాని తప్పేమియు లేదుగాని, వానిని విడుచుటవలన గొప్పసత్ఫలములు కలుగును. (V-56)

16. ద్విజులు శూద్రులను తిట్టినయెడల, జుల్మానా వేయవచ్చును. కాని శూద్రుడు ద్విజుని తిట్టినయెడల వాని నాలుకను నఱికివేయవలెను. ద్విజునిపేరును, వర్ణమును తృణీక

రించినయెడల, యెఱ్ఱగాకాల్చి పదియంగుళముల యినుపకడ్డీని అతని నోటిలోనికి గ్రుచ్చవలెను (VIII_270_271)

17శూద్రుడుబ్రాహ్మణునివిధ్యుక్తధర్మములనుగురించి పురోహితునితోగాని, శోత్రియులతోగాని, ముచ్చటించిన యెడల, అతని చెవులలోను నోటిలోను బాగుగాకాంగించిన చమురు పోయవలెను (VIII_272)

18. శూద్రుడు తన యేయవయముచేత ద్విజులను బాధించునో ఆయవయవమును నరికివేయవలెను, కొట్టుటకు శూద్రుడుచేయిగాని, కర్రగాని యెత్తినయెడల వానిచేయి నరికివేయవలెను. (VIII_279_280)

19. శూద్రుడు ద్విజుని ప్రక్కను కూర్చుండుటకు ప్రయత్నించినయెడల, అతని పిర్రలమీద వాతలువేసి, దేశము నుండి వెడలగొట్టవలెను. (VIII-281)

20. బ్రాహ్మణుడు, ఇతరులను శిరచ్ఛేదము చేయ వలసిన నేరమును చేసినపుడు, అతని బుఱ్ఱగొరిగించి, అతని యాస్తి అతనికిచ్చివేసి దేశమునుండి వెడలగొట్టబడవలెను. (VIII-379-380)

21. బ్రాహ్మణుడు తనకిష్టమయిన వస్తువును యథే చ్ఛగా శూద్రునివలన లాగుకొనవచ్చును. (VIII-417)

మాఖ్యముగగమనింపు — పై 16-21 ధర్మములనుబట్టి స్వగౌరవముగల శూద్రుడు యీశాస్త్రమును తగులబెట్టవలె నని కోరుటలో ఆశ్చర్యమేమి?

యాస్తిలో నెప్పటికిని పదియవవంతు భాగమునకు మాత్రమే హక్కుదారు లగుదురు. [IX-154]

29. ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢజుడు, అపవిద్ధుడు తమతండ్రికి వారసులగుచు, అతని కుటుంబములో చేరినవారు నగుచున్నారు కానీనుడు, సహోడుడు, కొనబడినవాడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, శూద్రస్త్రీవలన పుట్టినవాడు వారసులుకారు. కుటుంబములో చేరినవారు మాత్రమగుదురు వీరిలో ఒకరి తరువాత నొకరు వారసత్వమున కర్హులు. [IX 159-160]

30. వివిధ వర్ణములవారు కొన్ని తరములలో పైవర్ణములలోనికి పోవుచుండవచ్చును. క్రిందివర్ణములలోనికిదిగుచుండవచ్చును. [X 42] బ్రాహ్మణునికి శూద్రస్త్రీవలన కలిగిన సంతానమునకు ఏడుతరములలో బ్రాహ్మణత్వము పైవర్ణములసంపర్కముచేత సిద్ధించవచ్చును. [X 65] ఈ సంబంధములలో భూమికంటె విత్తుకే ప్రాధాన్య మీయబడుచున్నది [X-72]

31. కష్టసమయములలో బ్రాహ్మణుడు, క్షత్రియ వైశ్యులకు విధించిన కార్యములను చేయవచ్చును. కాని కొన్నివిధములైన వస్తువులను క్రయవిక్రయములు చేయకూడదు. [X 81-82 టు 92]

# వశిష్ఠధర్మశాస్త్రము.



ఈ శాస్త్రము ధర్మసూత్రకాలములో చివరభాగమున వ్రాయబడి, దరిమిలాను అనేక మార్పులను చెందినది. వింధ్య పర్వతముల కుత్తరమున పశ్చిమోత్తర పరగణాలయందు ఒకానొకప్పుడు విశేషముగ వ్యాప్తి చెందినట్లు కనుపడు చున్నది. దీనిలో కొంతభాగము శిథిలమైనపుడు, మన్వాది స్మృతులలో నుండియు, మహాభారతము మొదలగు నిటీవలి పురాణముల నుండియు, దానిని పండితులు పూరించినట్లు కను పడుచున్నది. మొత్తముమీద, నీధర్మశాస్త్రము, బోధా యన, ఆపస్తంబ సూత్రములకు తరువాతనే, రచింపబడినది. ఈయన యాగోత్రపురుషుడగు పరాశరులవారి తాతగారై యుండవచ్చును. నే నీయన వ్రాసిన ధర్మసూత్రముల నవలంబించవలెనో, యీాయన మనుమని ధర్మముల నవలం బించవలెనో, లేక మా సూత్రకారుడైన ఆపస్తంబుల వారివి యంగీకరించవలెనో, పూర్వనాగరిక ధర్మశాస్త్ర వేత్తలు, సప్రమాణముగ నిర్ణయించెదరుగాక. వీరిలో వీరికి భేదములు కలిగినపుడు ఏల పరాశరస్మృతిలోని ధర్మముల నవలంబించవలెనో, పూర్వధర్మముల నీయనకు రద్దుపర చుట కెట్టియధికారమున్నదో, యేల యీాయన ధర్మ ములే ముందెల్లపుడు నాచరించవలయునో, యీాయన యాద

హరించని విషయములలో వీరి పూర్వులలో, యెవరిధర్మముల నాచరించవలెనో, లేక వీరందరు చెప్పిన ధర్మములకు, నేక వాక్యత కల్పించి, యెట్లు సమన్వయము చేయుదురో, శ్రౌత స్మార్త వేత్తలను వ్రాయుమని వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాను. మతోద్రేకము, అహంకారము, దురాగ్రహము అన్యమతద్వేషము, దురభిమానము మొదలగు దుర్గుణములను విడచి, వ్యక్తిదూషణ లేకుండ వ్రాయగలవారి మాటలే ఆదరణీయములని నమ్మెదను. సత్యాన్వేషణునకు సానుభూతితో నుపదేశించుచు సాంఘిక శాస్త్రవిషయములను శ్రద్ధతో పరిశీలించవలెను. ఈ వశిష్ఠధర్మశాస్త్రములోని కొన్ని సాంఘిక ధర్మముల నిక్కడ వ్రాయుచున్నాను.

1. బ్రాహ్మణుడు, తనకిరింది వర్ణములనుండి ముగ్గురను, క్షత్రియులిద్దరను, వైశ్యశూద్రులొక్కొక్కరిని భార్యలుగా స్వీకరించవచ్చును. వేదమంత్రరహితముగ శూద్రస్త్రీని ద్విజులు వివాహము చేసికొనవచ్చునని కొందరు శాస్త్రజ్ఞులు చెప్పెదరు కాని, అది నా మతముకాదు. (అ 1 సూ 24)

2. బ్రాహ్మ, దైవ, ఆర్ష, గాంధర్వ, క్షాత్ర, మానుషవివాహముల నంగీకరించ వచ్చును సొమ్మునిచ్చి భార్యను తెచ్చుకొనుట మానుషవివాహమని చెప్పబడుచున్నది.

[1-29 to 35.]

3. వేదములను చదువుట, వానిని నేర్పుట, తనకొఱకు నితరుల కొరకును యజ్ఞము చేయుట, భిక్షపెట్టుట,

భిక్షను స్వీకరించుట, బ్రాహ్మణుని ధర్మములు. వేదములు చదువుకొనుట, తనకొఱకు మాత్రము యజ్ఞయాగాదులను చేసికొనుట దానమునిచ్చుట యుద్ధము చేయుట, క్షత్రియధర్మములు వైశ్యునకు యుద్ధముగాక పై క్షత్రియధర్మములును వ్యవసాయము, వర్తకము, పశుసంరక్షణ. వడ్డీకి అప్పులిచ్చుట ముఖ్యధర్మములు శూద్రునకు పై మూడువర్ణములకు సేవచేయుటయే జీవనోపాయము (అ-2-13 to 20)

4. శక్తిలేనపుడు పైవర్ణములవారు తమ తరువాత వర్ణములవారి వృత్తుల నవలంబించవచ్చును కాని క్రిందివర్ణములవారు తమ పైవర్ణములవారివృత్తుల నవలంబించకూడదు. (అ2-22)

5. బ్రాహ్మణ క్షత్రియులు, వైశ్యవృత్తి నవలంబించునపుడు రాళ్ళు, ఉప్పు, నారబట్టలు, తోళ్ళు, రంగుబట్టలు, ఆహారము, పుష్పములు, ఫలములు, వేళ్ళు సువాసన ద్రవ్యములు, నీళ్ళు, విషము, ఆయుధములు, మాంసము, పాలు, యినుము, సీసము, లక్క, మద్యము తగరము క్రయవిక్రయములు చేయకూడదు (అ-2-24 టు 26)

6. వేదములు చదవని, నేర్పని, అగ్నిహోత్రముల నుంచుకొనని బ్రాహ్మణులు శూద్రులతో సమానులు (అ3-1)

7. వేదజ్ఞానము లేనివాడు, వర్తకము, వైద్యము, నాట్యములవలన జీవించువాడు, శూద్రుల యాజ్ఞ ననుసరించువాడు, ద్విజుడైనను శూద్రతుల్యుడు. (అ-3-3)

8. వేదజ్ఞానము లేక అగ్నిహోత్రాదులను వదలి భైక్షువృత్తిచే జీవించు బ్రాహ్మణులు దొంగలే. కనుక రాజు ఆ గ్రామవాసుల నందరిని దండించ వలయును. (3.4) కర్రతో చేసిన యేనుగు, చర్మముతో చేసిన లేడి, వేదము నెరుగని బ్రాహ్మణుడు నామమాత్రధారులు. (III-II)

9. యజ్ఞములలో నేగాక బ్రాహ్మణ క్షత్రియాతిథులకుగూడ, యెద్దు గొర్రెమాంసములను పెట్టవచ్చును. (4-738)

10. స్త్రీకి స్వాతంత్ర్యము కూడదు చిన్నతనములో తల్లిదండ్రులు, యౌవనములో పెనిమిటి, వృద్ధాప్యదశలో కొమాళ్ల సంరక్షణలో నుండవలెను. స్త్రీ లెప్పుడును శుచులే. వారిపాపము లన్నియు బహిష్ఠలు కాగానే వదలిపోవును. (V-2, 4)

11. వేదవేదాంగములు చదివిన బ్రాహ్మణుడైనను సన్మార్గ ప్రవర్తన లేనియెడల పవిత్రుడు కానేరడు. సౌఖ్య పడ నేరడు. (VI-3, 4)

12. బ్రహ్మచారి భిక్షమెత్తి తనగురువుకు పెట్టి మిగిలిన యన్నమును తాను తినవలెను. అతడు మంచముమీద పండుకొనకూడదు. శరీరమును శుభ్రపరుచుకొన కూడదు. కంటికి కాటుకను పెట్టుకొనకూడదు. పల్లు తోముకొన కూడదు. శరీరమును చమురుతో పూసికొని నలుగు పెట్టుకొనకూడదు. పాదరక్షలు తొడుగుకొనకూడదు. గొడుగు వేసికొనకూడదు. (VII-14, 15)

13. వైద్యుడు, వేటకాడు, చెడిపోయిన స్త్రీ, దొంగ, పతితుడు, శూద్రుడు, చాకలి, గవుళ్లవాడు, అధికవడ్డిని తీసికొనువాడు వీరి యన్నమును బ్రాహ్మణుడు తినకూడదు. (XIV-2, 3)

14. పంచనఖములు గల జంతువులలో, యేదుపంది, ముళ్లపంది, చెవులపిల్లి, తాబేలును, అన్నివర్ణములవారును తినవచ్చును ఖడ్గమృగము, అడవిపందివిషయమై భేదాభిప్రాయములున్నవి. (XIV-39, 46, 47)

15. ఔరసుడు, భార్యకుగాని వితంతువునకుగాని నియోగమువలన కలిగిన పుత్రుడు, పుత్రిక పుత్రుడు, పౌనర్భవుడు, కానీనుడు, గూఢజుడు-వీరారుగురు దాయార్హులు. ముఖ్యబంధువులు. పున్నామనరకమను అపాయమును తప్పించగలవారు (XVII-12 to 25)

16. సహోఢుడు, దత్తుడు, విక్రయించుకొనబడినవాడు స్వయందత్తుడు, అపవిద్ధుడు, శూద్ర స్త్రీవలన కలిగిన పుత్రుడు, నీయారుగురును దాయార్హులుకారుగాని, బంధువు లగుదురు. (XVII-26 to 39) మొదటియారుగురు లేనపుడే తక్కిన ఆరుగురు, తమతండ్రియాస్తినితీసికొనుట కర్హులు. (XVII-39)

17. జ్యేష్ఠపుత్రునికి రెండుభాగము లీయవలెను. బ్రాహ్మణుని చాతుర్వర్ణ్య భార్యల పుత్రులు 3, 2 పత్తున్న తండ్రిఆస్తిని పంచుకొనవలెను. (XVII-42, 43 to 50)

18 పుత్రులులేని వితంతువు 16 సంవత్సరముల వయసు దాటినతరువాత, చనిపోయిన తన భర్త యొక్క గురువుల యాజ్ఞప్రకారము బంధువర్గములోగాని, యితరుల వలనగాని, పుత్రిని కనవచ్చును (XVII-59)

19. ఒకకన్య, రజస్వలానంతరము మూడు సంవత్సరము లాగి, సవర్ణుడగు పెనిమిటిని సంపాదించు కొనవచ్చును ఆమె తల్లిదండ్రులు ఆమె రజస్వలైనతరువాత ఆమె నితరుల కిచ్చిన యెడల నశించెదరు. కనుక ఆమె బట్టకట్టుకొనుట యెరుగక మునుపే నామె నితరులకిచ్చి వివాహము చేయవలెను. రజస్వలై పుట్టినింట నామె యున్నయెడల, తండ్రికి పాపము సంభవించును. (XVII-68 to 71)

20. అక్షతయోనియగు వితంతువు తిరిగి వివాహమును చేసికొనవచ్చును. (XVII_74)

21. పెనిమిటి దేశాంతరగతుడైనయెడల అయిదు సంవత్సరములాగి, పెనిమిటిని వెదకుకొనుటకు భార్య పోవచ్చును. ఆర్థికస్థితినిబట్టిగాని, ఆధ్యాత్మిక దృష్టితోగాని, పెనిమిటిని వెదకుకొనుటకు వెళ్లదలపనియెడల పెనిమిటి చనిపోయినచో చేయదగిన పనులను (నియోగము) చేసికొనవచ్చును. ఈవిధముగానే సంతానముగల బ్రాహ్మణ స్త్రీ అయిదు సంవత్సరములును, సంతానములేని బ్రాహ్మణ స్త్రీ

నాలుగు సంవత్సరములును, అటులనే క్షత్రియ స్త్రీ 5, 3 సంవత్సరములును వైశ్యస్త్రీ 4, 2సంవత్సరములును, శూద్ర స్త్రీ 3, 1 సంవత్సరముల వరకును ఆగినియోగము చేసికొనుచుండవలెను. పెనిమిటిగా గ్రహించువారిలో పెనిమిటి సపిండులు, సకులు, సమానోదకులు, సగోత్రికులు క్రమముగా స్వీకరించ తగినవారు. కుటుంబములోవారు లేనపుడేపరాయివారిని పెనిమిట్లనుగాస్వీకరించవలెను. (XVII-75 to 80)

22. శూద్రకులమువారుపాపాత్ములు అదిశ్మశానమువంటిది. వారు శవములవంటివారు. కావున వారియెదుట వేదములుచదువకూడదు. వారికి సలహా నీయకూడదు ఎంగిలియన్నముకూడ వారికి పెట్టకూడదు ధర్మశాస్త్రము వారికి బోధించ కూడదు. ప్రాయశ్చిత్తవిధులు వారికి బోధించ కూడదు. ఇట్లుజరిగించిన పైవర్ణములవారు అసంవృతమను నరకములో నట్టిశూద్రునితోకూడ పడుదురు.

(XVIII-11 to 15)

N. B. ఈ సూత్రములోచెప్పిన ధర్మము సృష్ట్యాదినుండి భగవంతుడేర్పరచిన నిత్యధర్మములలో చేరినయెడల దీనినామోదించు బ్రాహ్మణులు మొదలగు అగ్రజాతులు ప్రపంచమునుండి తుడిచిపెట్టబడుటకు తగినవారని నిశ్చయముగా నమ్మవలెను. దైవకటాక్షమువలన అట్టి యగ్రజాతులలోనివారు అరుదుగ నున్నందుకు సంతోషము.

# విష్ణుస్మృతి



ఈస్మృతి మొదట మనుస్మృతికి సమకాలీనమైయుండ వచ్చునుగాని దానివలెనే యిదియు నిటీవల చాలా మార్పులు చెందినట్లు స్పష్టముగా కనబడుచున్నది. కృష్ణయజుర్వేదము లో చారాయణీయకఠమను శాఖలోచేరిన ఋషి దీని గ్రంథ కర్తయని పరిశోధకుల యభిప్రాయము. తక్కిన స్మృతులు ధర్మసూత్రములలోవలెనే దీనిలోని సివిల్కు, క్రిమినల్ నిబంధ నలు, ఆచారకాండ, ప్రాయశ్చిత్తకాండ, రాజులవిధులు, స్వర్గ నరకవిషయములు మొదలగునవి ప్రస్తుత మనులులో లేనం దున వానిని వదలివేసి వర్ణములు, వివాహములు, భోజనములు మొదలగువానితో సంబంధించిన సాంఘికవిషయములనే దీనిలోనుండి కొన్నిటి నిక్కడ నెత్తివ్రాయుచున్నాను.

1. బ్రాహ్మణుడు వేదముచదువుకొని భిక్షాటనము చేసి యితరులకొరకు త్యాగమొనరించుట, క్షత్రియుడు శూరుడై జగత్తును రక్షించుచు పన్నులను వసూలుపరచుట, వైశ్యుడు పశుపాలనము, వర్తకము, వడ్డీకి అప్పులనిచ్చుట, శూద్రుడు ద్విజులనుసేవించి చిత్రలేఖనము మొదలగుకళలను నేర్చుకొనుట ఆయావర్ణములవారి ముఖ్యధర్మములు.

[II 5 to 14]

(2) కష్టసమయములలో పైతివర్ణమువారును తమ క్రిందవర్ణములవారి వృత్తుల నవలంబించవచ్చును. (2-15)

(3) ఇంద్రియనిగ్రహము, సత్యము, శుచిత్వము, ఔదార్యము, అహింస, గురుభక్తి, యాత్రలు సేవించుట, ప్రేమ, దురాశారాహిత్యము, ఋజుమార్గప్రవర్తనము, దైవబ్రాహ్మణభక్తి, క్షమ, యీ మొదలగు సద్గుణములు అన్నివర్ణముల వారికి నుండవలసినవే. (2. 16, 17)

(4) గొప్ప నేరములకుకూడ బ్రాహ్మణులకు దెబ్బలశిక్ష కూడదు. అతనియాస్తితో దేశమునుండి వెడలనడచుటయే శిక్ష. (V 2, 3)

(5) క్రిందివర్ణమువాడు పైవర్ణస్థుని తన యేయంగము తో హానికలిగించునో ఆ యంగమును నరికివేయవలెను అతడు పైవర్ణమువారితో సమానముగ కూర్చున్నయెడల పిర్రల మీద వాతలువేసి దేశమునుండి వెడలగొట్టబడవలెను. ఆతడు తిట్టినయెడల నాలుకను కోయవలెను. నీచవర్ణుడు బ్రాహ్మణునకు అతని విధాయక కృత్యమును జ్ఞాపకము చేసిన యెడల వానినోటిలో సలసల కాచిన చమురుపోయవలెను అతడు పైవర్ణమువారి పేరుగాని వర్ణముగాని తృణీకరించినయెడల నెర్రగా కాల్చిన పదియంగుళముల యినుపఖడ్గిని వాని గొంతుకలో దూర్చవలెను. (V 19 to 25)

(6) ఈక్రిందివిధములగు కొమాళ్లలో ఒకరితరువాత నొకరు తండ్రియాస్తికి కర్తలు (1) ఔరసుడు (2) నియోగములవలన భార్యకుగాని, వితంతువుకుగాని కలిగిన పుత్రుడు (3) పుత్రికపుత్రుడు (4) పౌనర్భవుడు (5) కానీనుడు (6) గూఢజుడు (7) సహోఢుడు (8) దత్తుడు (9) కొనబడినవాడు (10) స్వయందత్తుడు (11) అపవిద్ధుడు (12) కృత్రిముడు వీరిలో దాయార్హుడగువాని తరువాతి వారు మనోవృత్తికి మాత్రమర్హులు (X V 2 to 30)

(7) బ్రాహ్మణుడు నాలుగు వర్ణముల స్త్రీలను వివాహము చేసికొని, వారందరివలనను, పుత్రులను కన్నయెడల వారు తమ తల్లుల వర్ణముల ప్రకారము 4, 3, 2, 1, భాగములుగా తండ్రియాస్తిని పంచుకొనవలెను. (XVIII 1to40)

(8) ప్రతివర్ణమువారును, తమవర్ణముల సపిండులు చనిపోయినపుడు సూతకము పట్టవలెను (XXII 20 to 24)

(9) బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య వివాహములు బ్రాహ్మణులకును, గాంధర్వవివాహము క్షత్రియులకును విధించబడినవి. (XXIV 18 to 27)

(10) అవివాహితకన్య మూడుసారులు బహిష్ఠయైన తరువాత, పతిని స్వయముగ నన్వేషించుకొనవచ్చును. రజస్వలకాకపూర్వము కన్యకు వివాహమును నిశ్చయించనియెడల, ఆమె పతితురాలగును. అప్పుడామెను తీసికొనిపోయినవాడు అపరాధిగా నెంచబడడు. (XXIV 40, 41)

(11) స్త్రీయెల్లపుడు స్వతంత్రహీనురాలుగా నేయుండవలెను. పెనిమిటి చనిపోగానే సహగమనమునైనను చేసికొనవలెను. లేక పతివ్రతగానైనను, తనకాలము గడపవలెను (XXV 13, 14)

(12) ద్విజులు, అగ్రవర్ణపుభార్య లేనపుడు తరువాతవర్ణపు భార్యతో అగ్నిహోత్రకర్మల నాచరించవచ్చును. శూద్రభార్యతో కూడదు. (XXVI. 3)

(13) మంత్రములతో దేవతలకు నివేదింపబడని మాంసమును బ్రాహ్మణుడు తినకూడదు. శ్రౌతస్మార్తయజ్ఞములలో మాంసమును తప్పక తినవలయును. (L1 59 to 61)

(14) నూనె, అన్నము, పప్పు, ఉదకము, వేళ్ళు, పండ్లు కాయకూరలు, గోధుములు మొదలగు వానివలన ఒకనెలయు, చేపలవలన రెండునెలలు, జింకమాంసమువలన మూడునెలలు, గొర్రెమాంసమువలన నాలుగునెలలు, పక్షిమాంసమువలన అయిదునెలలు, మేకమాంసమువలన ఆరునెలలు, చారలలేడి మాంసము వలన యేడునెలలు, గోడ్డుమాంసము వలన తొమ్మిదినెలలు, దున్నపోతు మాంసమువలన పదినెలలు, కొమ్ములులేని మేక మాంసమువలన పదునొకండునెలలు, ఆవుపాలవలన నొకసంవత్సరము, ఖడ్గమృగముల మాంసము వలన నెంతకాలమూ వరకైనను, పితరులు శ్రాద్ధములందు తృప్తినొందుదురు. (LXXX I to 14)

# ఆ చా ర కాం డ



మన హిందువులలో, నాచారములను మతముతో ముడిపెట్టుచున్నాము. మన యాచారములు కాలక్రమమున ననేక విధములగు మార్పులనుపొంది నేటికిని, మన యార్యావర్త దేశమందు భిన్నములగు కులాచారములు, దేశాచారములు, వివిధరాష్ట్రములలో ప్రబలియున్నవి. ఈయాచారములకు దాసులమై మనముండకూడదు కర్మకాండతో సంబంధించిన నిబంధనలు మనలను నిర్బంధించకూడదు. ప్రస్తుత జీవితపు పోరాటములో, వాని నెట్లును మనము వదలి వేయుచున్నాము. అగ్నిహోత్రాదులకు నిదివరకే స్వస్తి చెప్పితిమి. జందెము తప్ప, యీకాలపు ద్విజులకును, ద్విజేతరులకును భేద మంతగా కనుపించదు. శ్రౌతస్మార్తకర్మలను, పూర్వము వలె మన ద్విజులచేత చేయించ తలపెట్టుట యేటికెదురీదుటయే. మన పూర్వులు, బాహ్యశుచి, అంతశ్శుచులకు చెప్పిన విధానములను కొంతవర కంగీకరించ వచ్చునుగాని, యివి జరిగించకపోయినయెడల, నరకము సంప్రాప్తించుననుమత సంబంధమైన శిక్షల నెవరు నంగీకరించరు. హేతుపూర్వకమై ఆరోగ్యప్రదములైన నిబంధనలను వానిని మతబలము నీయకయే, మన బుద్ధిచేత నవలంబించుచుండుము.

మన మతగ్రంథములలో నైతిక విషయము లనేకములు వ్రాయబడి యున్నవి వానిని మనమును, ఇతర మతస్థు లునుకూడ ననుసరించ దగినవే ఇవి యన్ని మతములకు సామాన్యమే. కాని హేతుపూర్వకముగాని కొన్నికొన్ని కర్మ లను విధిగా మనల నాచరించవలసినదని ప్రమాణములను చూపించు వర్ణాశ్రమ ధర్మవాదుల కొక మనవి. వారు ఏకాలపు ధర్మములను మనల నవలంబించమనెదరు ? ఈ శ్రౌతస్మార్త ధర్మములను పాటింపక పోయినయెడల, రౌర వాది నరకములకు పోదుమని శృతి ప్రమాణములను వారెన్ని చూపించుచున్నను వానిం జెడచెవిని బెట్టుచున్న జనసామాన్యమును వీరు గమనించుచున్నారా ?

బ్రాహ్మణుని కుండవలసిన లక్షణములు, బ్రాహ్మణే తరులయందు కనవడినపుడు, వీరిని బ్రాహ్మణులనుగా నేల నెంచకూడదు? అట్టివారిలో నంతర్వివాహముల నేల జరి గించుకొనకూడదు? నిర్వైరము, సత్యముపలుకుట, దొంగ తనము లేకుండుట, వీర్య రక్షణము, విషయ భోగము లందు వహ్యము, అహింస, పవిత్రత, సంతోషము మొదలగు గుణ ములు గలవాడే ఉత్తముడగు బ్రాహ్మణుడు. అట్టిగుణములు కలవాడు, జన్మమువలన శూద్రునికి పుట్టినను బ్రాహ్మణునిగ నేల యెంచకూడదు ? వంశ పారంపర్యముగ కొన్నిగుణము లలవడునని గాంధీమహాత్ము డంగీకరించుచు, వానిని నిలు

పుట కేర్పడిన వర్ణాశ్రమ పద్ధతి వందనీయమనియు, కాని అంతమాత్రముచేత శాశ్వత న్యూనాధిక్య భేదముల నుంచ కూడదనియే సెలవిచ్చిరి ఆయనకు మనము బ్రాహ్మణునిగా నేల యంగీకరింప కూడదు? పండిత మదన్మోహన మాల వ్యగారు, పై రెండవవిషయములో మహాత్మునితో నేకీభ వించుచు నీ జన్మములో నాయా వర్ణములలో పుట్టుట తటస్థిం చినవారు, ఆవర్ణములలోనే, ధర్మవ్యాధునివలె నుండితీరవల యునని యభిప్రాయపడుచున్నారు ఒకజన్మములో నేపైకెక్కు ట, క్రిందికి దిగుట వీరంగీకరించుచున్నట్లు కనుపడదు. వీరి యభిప్రాయము లెట్లున్నను, ప్రస్తుత వర్ణములు, ప్రత్యేక ముగనిలచి, ఒండొంటితో కలియకుండ నుండుట యసంభవము అట్లు కలియుటవలన నెట్టిపాపము లేదని, ప్రపంచములోని వివిధ మతములనుపోల్చి పరిశీలించినవా రొప్పుకొనక తప్పదు. మన వర్ణాశ్రమవాదులు మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి మొదలగు స్మృతులను చదివినయెడల నిప్పుడు వర్ణముల లోను, ఆశ్రమములలోను జరుగుచున్న మార్పులకు సహజ ముగ వచ్చితీరుననియు, వానివలన నెట్టిపాదిత్యము సంభవించ దనియు వీరు గ్రహించెదరు. వీరికొరకు యాజ్ఞవల్క్యస్మృతి లోని యాచార కాండలోని కొన్నిధర్మములను, మచ్చునకు నిక్కడ నుదహరించుచున్నాను.

1 ద్విజులకు శూద్రకులములోనుండి స్త్రీ పరిగ్రహమేది చెప్పబడినదో యది నాయొక్క మతము కాదు. ఎందువల్లనంటే, ఆశూద్ర స్త్రీ యందు తాను స్వయముగానే పుట్టుచున్నాడు. బ్రాహ్మణ క్షత్రియులకు, వైశ్యులకు భార్యలు వర్ణక్రమ ప్రకారము వరుసగా ముగ్గురు నిద్దరు నొకరు నుండవచ్చును. శూద్రునకు తనకులస్థురాలు మాత్రమే. [శ్లో 57,58

2 మరదిగాని, సపిండుడుగాని, సగోత్రుడుగాని, గురువుయొక్క అనుజ్ఞ పొందినవాడై, నెయ్యి పూసికొనినవాడై, పుత్రేచ్ఛచేతను కుమారులు లేని స్త్రీని ఋతుకాలమందు పొందవలెను. గర్భము కలిగేవరకు పొందవలయును (శ్లో 70-71

3 వ్యభిచారమువలన కలిగెడి దోషము, ఋతువందు పరిహారము పొందుచున్నది. గర్భము వచ్చినయెడల పిల్ల పుట్టిన తరువాత, స్త్రీ శుచియగుచున్నది. గర్భచ్ఛేదము చేసికొన్న స్త్రీని మాత్రము పెనిమిటి విసర్జించవచ్చును [శ్లో 74]

4 గృహస్థుడు పెద్దయెద్దును, పెద్దమేకను, అతిథిగా వచ్చిన శ్రోత్రియునికొరకు మీకిది యని ప్రీత్యర్థముగా చెప్పవలెను. [శ్లో 109]

5 శూద్రుని యాచించి యజ్ఞము చేయుటవలన చండాలుడుగా పుట్టుచున్నాడు. యజ్ఞముకొరకు ప్రాప్తమైన ద్రవ్యము నెవడీయడో వాడు శకుంతపక్షి లేక కాకిగా ముందు జన్మమందగుచున్నాడు. [శ్లో 127]

## వర్ణాశ్రమధర్మపరిణామము.

6 బ్రాహ్మణుడు కోతకోసి మళ్లయందు జారిపడిన గింజలను, రోలుదగ్గర పడిన ధాన్యము, నేరికొని జీవించవలెను. పన్రెండు దినములకు తగుధాన్యము కలవాడు కుసూల ధాన్యుడు. ఆరుదినములకు సరిపడిన ధాన్యము కలవాడు కుంభీధాన్యుడు. మూడుదినములకు తగినధాన్యము కలవాడు త్ర్యాహికుడు. రేపటికి ధాన్యము లేనివాడు అశ్వస్తనుడు. వీరిలో నొకరితరువాత నొకడు శ్రేష్ఠుడు. [శ్లో 128]

7 శూద్రులలో దాసులు, గొల్లవాండ్రు, పారంపర్యముగా వచ్చిన మిత్రులు, పాలికాపులు నెవడు మీవాడని చెప్పుకొనునో వాడు, ఇంటి వ్యాపారమును విచారించే వాడు, వీరిండ్లలో బ్రాహ్మణులు భోజనము చేయువచ్చును. [శ్లో 167]

8 భగవన్నివేదనము కాని మాంసమును విడువవలెను.

[శ్లో 1

9 చమురులో చేరిన చద్ది అన్నము, చాలాకాలము న్నప్పటికి భోజనమునకు యోగ్యమైనది. చమురులో చేరని గోధుమలు, యవలు, పాలు, పెరుగు భోజనమునకు యోగ్యమైనవి. [శ్లో 169]

10 అయిదు గోళ్ళు గల ముండ్లపంది, ఉడుము, తాబేలు, శల్లకి, చెవులపిల్లి, సింహతుండ మను మత్స్యము మొర్రమీను భక్షించుటకు యోగ్యములు [శ్లో 179]

11 ప్రాణమునకు బాధవచ్చిన కాలమందును శ్రాద్ధ మందును బ్రాహ్మణేచ్ఛ చేతను దేవతల ను, పితరులను పూజించి సంస్కరింప బడిన మాంసమును తినే పురుషుడు దోషపాతుడు కాడు (శ్లో 180)

12 పితరులు, శ్రాద్ధ యోగ్యమైన యన్నము చేత నొక నెల, క్షీరాన్నము చేత నొక సంవత్సరము చేప, యిరి, ఆడ మేక, పక్షి, దుప్పి, అడవిపంది, చెవులపిల్లి మాంసముల చేత వరుసగా నొక్కొక్క మాసముతిశయముగా తృప్తిని పొందు చున్నారు. (శ్లో 257)

13 గయుంగోనున్నవాడై ఖడ్గమృగముయొక్క మాంసమును, మహాశల్కము చేపను, తేనెను, నివ్వర ధాన్యపు టన్నమును, నెర్ర మేకపోతు మాంసమును కరివేపా కును, ముసలి తెల్ల మేకపోతు యొక్క మాంసమును దేనిని యిచ్చుచున్నాడో ఆ యావత్తును అనంతముగా ఫలమును పొందుచున్నాడు. (శ్లో 259)

14 వినాయకునికిని, పార్వతీ దేవికిని, బాగుగాదంచని బియ్యమును నువ్వుపొడితో మిశ్రమమైన యన్నమును, పచ్చివి పండినవి యగు చేపలను, మాంసమును, సారాయిని యిచ్చి కోరికల నిమ్మని వేడుకొనవలెను. (శ్లో 285)

15 పుత్రులులేని వానివలన పరుని భార్యయందు నియోగము మూలమున పుట్టిన కొడుకు, ఉభయకుటుంబముల

కు దాయము పొందుట కర్హుడు న్యాయశాస్త్ర ప్రకారము పిండము నిచ్చుటకును అర్హుడు. (శ్లో 128 వ్యవహార కాండము)

16 ఔరసుడు, తన పుత్రిక పుత్రుడు, సగోత్రుని వలన గాని యితరుని వలనగాని తనభార్యయందు కలిగిన వాడు, వివాహము కానితనకూతున పుట్టినకు వాడు. కుండ గోళక యోనులగు వితంతువులకు పుట్టినవాడు, దత్తుడు, మాతాపితరుల చేత విక్రయించ బడినవాడు, అట్లే యుబడక పెంచుకొనబడినవాడు, వివాహకాలమందు గర్భముతో నుండిన స్త్రీకి పుట్టినవాడు, మాతాపితరులవలన విడువబడినవాడు, ఈ పుత్రులు ముందు ముందు చెప్పినవారు లేకపోవుచుండగా వెనుక వెనుక చెప్పిన వారు పిండము నీయతగినవారు. ఈవిధి సమానజాతుల విషయమై పుట్టిన కొమాళ్లకే యని తెలిసికొనవలెను. (శ్లో 129)

17 శూద్రస్త్రీకి పుట్టినవాడు తన తండ్రి ఆస్తిలో భాగార్హత కలవాడై యున్నాడు (శ్లో 132)

పైని చెప్పిన ధర్మములు, పరాశరస్మృతి కాలము నాటికి మారిపోయినవి. కాని యీ స్మృతిలో చెప్పిన ధర్మములుకూడ కొన్ని శ్రుతికటువుగాను, అన్యాయముగా నుండుట చే దీనినైనను ప్రమాణముగా నెవరును గైకొన కూడదు. ఉదాహరణము—దుస్స్వభావుడయ్యును బ్రాహ్మణుడు పూజింపదగును. శూద్రుడు వశీకృతేంద్రియుడయ్యును పూజింపదగడు. ఎవడైన చెడ్డయావును విడచి మిక్కిలి పాలిచ్చుగాడిదెను పితుకబోవునా ? (అ 8 శ్లో 25) ఈఋషి, బ్రాహ్మణులను,

ఆవు గాడిదలనువలె ప్రత్యేక తరగతులలో జన్మించునట్లుచేసి మానవ సౌభ్రాతృత్వమునకు భంగము కలిగించెను. వర్ణాశ్రమ ధర్మవాదులు, వీరివాదనచే గ్గైకొందురా ? మనలో ననేకమంది బ్రాహ్మణేతర విద్యార్థికులకు మూర్ఖులకన్వయించు శూద్రశబ్దమును మన ముపయోగించకూడదు. వారిలో ననేకమంది బ్రాహ్మణులు కలరు.



# స్మృతికర్తలు.



వీరిలో మనువు, యాజ్ఞ్యవల్క్యుడు ముఖ్యులు. వీరు గాక, హారితుడు, ఔశనుడు, ఆంగీరసుడు, యముడు, బృహస్పతి వ్యాసుడు, శంఖలిఖితులు, దక్షుడు, గౌతముడు, పరాశరుడు, వృద్ధపరాశరుడు, అత్రి, సంవర్తుడు, కాత్యాయనుడు, శతాతపుడు, నారదుడు, విష్ణువు, దేవలుడు, మొదలగు వారనేకమంది స్మృతికర్తలుండిరి. వీరు వేరు వేరు కాలములలో వేరు వేరు ప్రాంతములయందున్న ఆచారములను లిఖించుచు పూర్వపుశ్రుతులమీదనే యాధారపడినట్లు చెప్పుకొనుచుండిరి. ఆచారప్రాయశ్చిత్త వ్యవహార కాండలలో సాధారణముగా కొన్నిటిని మాత్రమే చాలాస్మృతులు వక్కాణించుచున్నవి వీనిలో ప్రాయశ్చిత్త వ్యవహారకాండ లిప్పుడములులో లేవు. ఆచారకాండమాత్రము కొన్నియూపిరితో నున్నది. అయినను నే నిదివరకు కొన్నిముఖ్య స్మృతులలోని సాంఘికధర్మముల నుదహరించి యున్నాను. ఇతర స్మృతులలోనివికూడ కొన్నిటిని కనుపరచుచున్నాను.

(1) స్త్రీబహిష్ఠయగుటవలన శుచిత్వమునొందును. (ఆంగీరస- అ-1. శ్లో. 42)

(2) బ్రాహ్మణుడు పర్వదినములలో క్షత్రియునింట

[illegible]

వచ్చును. కాని శూద్రునింట నెప్పుడు తినకూడదు. [అంగీరస-అ-1శ్లో 55]

(3) శూద్రులలో, సౌఖరు, మంగలి, పసులకాపరి, వంశపారంపర్యపుస్నేహితుడు, ఒకపొలముచే తనతోకలసి దున్నువాడు, తనశరీరమును పరులకర్పణము చేయువాడు-వీరు పెట్టినట్టియన్నమును ద్విజులు భుజించవచ్చును. (యమ-శ్లో 22)

(4) పండ్రెండు సంవత్సరములు వయసువచ్చిన కన్యకు వివాహము చేయనితండ్రి నెలనెలకు ఆమెరజస్సును త్రాగుచున్నట్లెంచబడును. (యమ శ్లో 22)

(5) రజస్వలయైన అవివాహిత కన్యను చూచిన తల్లిదండ్రులు, నన్నదమ్ములు నరకమునకు పోవుదురు. ఏబ్రాహ్మణుడైనను అట్టికన్యను వివాహముచేసికొన్నయెడల అతనిని వృషలీపతిమిటియని పిలచెదరు. అతను పంక్తిబాహ్యుడు. వృషలితో కాపురము చేయుచున్నవానికి పుట్టగతులు లేవు. (యమ-శ్లో 23, 24, 28)

6 స్త్రీలతలలను గొరిగించకూడదు. వారు ఆవులున్న కొట్టములో రాత్రిపండుకూడదు. ఆవులను వెంబడించగూడదు. వేదమంత్రములను చదువకూడదు. స్త్రీలశిరోజములనన్నిటిని కలిపి చివర రెండువ్రేళ్లకొలతవరకు కత్తిరించినయెడల, అదియె వారికి క్షవరము. (యమ శ్లో 73-74)

7 ఒక్కవేదమును మాత్రము చదివి, తక్కిన వేదములను నిర్లక్ష్యము చేసినవా రిరువదియొక్కసారి మృగముల గర్భములందు జనించెదరు. (అత్రి శ్లో 11)

8 గాయత్రి జపించునట్టియు, అగ్నిహోత్రకర్మలు చేయునట్టియు శూద్రుని రాజు చంపివేయవలెను (అత్రిశ్లో 19)

9 వేదమును చదవని, అగ్నిహోత్రకర్మలుచేయని ద్విజులకు అన్నముపెట్టినయెడల, పట్టిదొంగలను కాపాడుచున్న గ్రామవాసులందరిని రాజు శిక్షించవలెను. (అత్రి శ్లో 32)

10 నియమములుచేయుచు, యమములను అలక్ష్యము చేయువారు పతితులగుదురు. క్రౌర్యములేకుండుట, క్షమించుట, సత్యము, అహింస, యీవి, నిరాడంబరము, ప్రేమ సంతోషము, నెమ్మది, కోపము లేమి, యీపదిగుణములును యమములనబడును. శౌచము, యజ్ఞము, నియమము, న్యాయమైన బ్రహ్మచర్యము, వ్రతాచరణము, మౌనము, వేదాధ్యయనము, స్నానము, ఉపవాసము, యీపదియు నియమములనబడును. (అత్రి శ్లో 47to49)

11 గాయత్రిని జపించుట, నియమము, యాత్రలకు పోవుట, సన్యాసాశ్రమము, మంత్రముల నుచ్చరించుట, దేవతల నారాధించుట, యీయారును స్త్రీలకును, శూద్రులకును పనికిరావు. (అత్రి శ్లో 135)

12 పెనిమిటి జీవితకాలములో మతసంబంధమైన కర్మలుచేయుచు, ఉపవాసములుచేయు స్త్రీ, పెనిమిటిని అల్పాయుష్మంతుని చేయుటయేగాక, ఆమె నరకమునకు పోవును. (అత్రి శ్లో 136)

13 సోముడు, గంధర్వుడు, అంగిరసుడు, స్త్రీకిశుచిత్వ మునిచ్చిరి. అగ్నిహోత్రుడు పవిత్రత నిచ్చెను, కాబట్టి స్త్రీ లెల్లపుడు పవిత్రలును, శుచులునై యుందురు. (అత్రి శ్లో 139)

14 స్త్రీయొక్క పరిశుద్ధతను చర్చించ నవసరము లేదు ఆవుల కొట్టము, నూనెగానుగ, చెరుకుగానుగ, స్త్రీలు, రోగులు, నెల్లపుడు శుచులే స్త్రీ లితరులతో వ్యభిచ రించినను, బ్రాహ్మణుడు హానికరములగు వేదకర్మలు చేసినను నదులలో మలమూత్రములు విసర్జించినను, అగ్నిలో అశుభ్ర మైన పదార్థములు వేసినను, తమ సహజపవిత్రతలను పోగొ ట్టుకొనవు. (అత్రి శ్లో 189)

15 స్త్రీలు, మొదట దేవతలచేతను, తరువాత చంద్రు నిచేతను, తరువాత గంధర్వులచేతను, తరువాత అగ్నిచేతను, తరువాత మనుష్యులచేతను అనుభవించబడు వారగుటచే నెట్టి పాపము వారికి చెందదు. (అత్రి శ్లో 190)

16 ఒకస్త్రీ తనకంటె నుత్తమవర్ణమువానితో (అసవర్ణ) సంభోగించినయెడల, తనకు సంతానము కలిగేవరకు అశుచిగాయుండి, తరువాత బహిష్ఠకాగానే, మేలిమిబంగారు వలె సంపూర్ణ శుచిత్వమును పొందును. బలవంతముగా నామెను చెరిపినయెడల, నామెను, పెనిమిటి యెన్నడును వదల కూడదు. బహిష్ఠకాగానే ఆమె శుచియగును.

(అత్రి శ్లో 191 to 194)

17 స్త్రీలయొక్క చర్యలనుగురించి ప్రస్తాపించ కూడదు పరిశీలన చేయకూడదు. వారెపుడు శుచులే. వాన చినుకులు గాలివలన కొట్టుకొనువచ్చు దుమ్ము నెల్లపుడు మాలిన్యము లేనివే (అత్రి శ్లో 238)

18 అన్నపుగంజి, పేలాలు, పెరుగు, పులిసినయంబలి, నూనెతో చేసిన పదార్థములు, శూద్రునివైనను స్వీకరించ వచ్చును దానివలన నేట్టిపాపము లేదు. పచ్చిమాంసము వెన్న, నూనె, పండ్లవలన తీయబడు చమురు, నేవర్ణముల వారిపాత్రలందున్నను, బయటకు తీయగానే పవిత్రములగును (అత్రిశ్లో 246, 247)

19 జ్యోతిషము చెప్పుకొని జీవించువాడు, అర్థము తెలి యక పురాణములను చదువువాడు, అథర్వణవేదమును చదువు వాడు శ్రాద్ధములకు పిలువబడకూడదు బృహస్పతివలె పండి తులైనను, వీరినిపూజించకూడదు (అత్రిశ్లో 376)

20 బ్రహ్మచారి పూలదండలను, సువాసన ద్రవ్యము లను, తేనెను, మాంసమును వర్జించవలెను. నక్షత్రములుండ గానే ఉదయమునందును, సూర్యుడ స్తమించకమునుపుసాయం తనమునను సంధ్యావందనము చేయవలెను (సంవర్త-శ్లో 5, 6)

(21) ఒడలిమీద వెండ్రుకలు మొలచినతరువాత స్త్రీని చంద్రుడనుభవించును. రజస్వలైన తరువాత నామెను గంధర్వుడనుభవించును. కుచములంకురించిన తరువాత నగ్ని యనుభవించును 8 సంవత్సరముల స్త్రీ గౌరియనియు, 9 సంవ

త్సరముల స్త్రీ రోహిణియనియు, పదిసంవత్సరముల స్త్రీ కన్య యనియు తరువాత రజస్వలయనియు పిలువబడును. (సంవర్త శ్లో. 66)

(22) వివాహముకాని స్త్రీని రజస్వలైన తరువాత చూచినయెడల తల్లిదండ్రులు, సోదరులు నరకమునకు పోదురుగనుక రజస్వల కానిపూర్వమే కన్యకు వివాహము చేయవలెను. ఎనిమిది సంవత్సరములకు వివాహము చేయుట అత్యుత్తమము (సంవర్త-శ్లో 65 to 68)

(23) యజ్ఞోపవీతము, జుట్టుముడి లేకుండ, నేకర్మ చేసినను, అది చేయబడనట్లుగానే యెంచబడును (కాత్యాయన, అ 1 శ్లో 4)

(24) శ్రుతిస్మృతిపురాణములలో భేదము లున్నపుడు శ్రుతులే ప్రధానము. తరువాత స్మృతులు. ఆపైని పురాణములు ప్రధానములు. (వ్యాస- అ 1 శ్లో 4)

పై స్మృతుల నన్నిటి నాంధ్రములో ననువదించి న్యాయపరిశీలన చేయుచో,వర్ణములు ప్రస్తుత శిలారూపముదాల్చిన తరువాతను, వేదకాలానంతరమున నేర్పడిన బ్రాహ్మణములలోని యజ్ఞయాగాదికర్మలు అతిక్లిష్టములును క్లేశములునై చాలాభాగము బ్రాహ్మణులు అమలులో పెట్టలేనపుడును, విదేశీయుల సంఘట్టనముల మూలమున, సాంఘికాచారములు నూతనముగ ఆయాప్రాంతముల బయలు దేరినతరువాత నీ స్మృతులు వ్రాయబడుచుండినట్లు స్పష్టపడును. వీని

గౌరవము తగ్గకుండుటకు, ప్రతిస్మృతికర్తయు, తాను వేదముల మీదనే యాధారపడినట్లే తెలుపుచుండును స్థాలీపులాకన్యాయముగ నేను వివిధస్మృతులనుండి కనుపరచిన వర్ణాశ్రమ ధర్మము లీ కాలమందాచరించుట లేదని మనసనాతన ధర్మవాదులుకూడ ఒప్పుకొనవలసి యున్నారు. వీరే తమబిడ్డల చేత వేదవిద్యమానిపించి పొట్టకూటికి నింగ్లీషుభాషను వారికి నేర్పుచున్నారు. బ్రహ్మచారి, గృహస్థుడు జరిగించవలసిన అగ్నిహోత్రాది కర్మలను తాముమానివేసి, వారిచేత మాన్పించిరి. సేవకావృత్తి నవలంబింప జేయుచున్నారు. బ్రాహ్మణుడు సంతతతృప్తితో, మరునాటికైనా వడ్లగింజలను సేకరించుకొనక, స్మృతిధర్మముల నవలంబించి కాలము గడుపవలసియుండగా తనజీవనము కొరకును, ధనసంపాదన కొరకును, నితరవృత్తులలో అనేకులతో పోటీచేయుచున్నాడు. ఇట్టివారే సనాతనధర్మసభలకు నాయకులై శారదాబిల్లును ప్రతిఘటించి, తమ మతమును నిలువబెట్ట జూచుచున్నారు. ఈస్మృతులలో చెప్పబడిన వర్ణాశ్రమ ధర్మముల, నీయిరువదవ శతాబ్దములో ఆచరణమందు పెట్టజాలనపుడు, కొన్ని నిబంధనలు మాత్రము, జాత్యభివృద్ధికి ప్రయోజనకరములా, లేక హానికరములా యను విషయమును విచారించక, వాని యుల్లంఘనము వలన నరకబాధలు కలుగునని వాదించుట హాస్యాస్పదము. అట్లైనచో, నీ స్మృతులనుబట్టి, యీ సనాతన ధర్మాందోళనపరులు, తాము ప్రతిదినముజరిగించు

ధర్మోల్లంఘనమున కెన్ని జన్మములు నరకములందు పడవ లెనో తెలియదు, నిజమేమన. యీ ధర్మములు మానవకల్పితములు. వాని ప్రయోజనము పోయినతరువాత వర్జనీయములు. వీనిలో సహేతుకరమైనవి, దేహమనోబుద్ధులకుపచరించునవి అనుసరణీయములు కాని యీ ధర్మములయువలంఘోల్లంఘనములు స్వర్గనరకములకు దారిజూపునవి కావు.

పరిణామశాస్త్రమునుబట్టి అహింస, మొదలగు నైతిక ధర్మములుకూడ, పూర్వకాలమునుండి, సంఘాభివృద్ధికొరకు, పరిణామమును పొందుచుండెనేగాని, వీనిని భగవంతుడు మనమనఃఫలకములమీద వ్రాసినట్లెంచతగదు. మానవసేవయే భగవత్సేవగాని, కర్మకాండ ఆచారకాండలలో మునిగితేలు కాలము గతించెనని నమ్మవలెను. ఈధర్మశాస్త్రములలో వ్యక్తులకును సంఘమునకును ప్రయోజనకరమగు నిబంధనలు, సూత్రములు కొన్ని లేకపోలేదు కాని వానిని హేతుపూర్వకముగ నాచరణలోపెట్టెదముగాని వానిలో వ్రాసినంతమాత్రమున, మనమంగీకరించకూడదు. మతము దైవముఅనువానిమీద నాధారపడి, యీధర్మములన్నియు భగవద్దత్తములని నమ్మి మూఢాచారములకు జనులు బానిసలు కాకూడదు. ఇట్టిపిచ్చికట్టుబాట్లు ప్రతిమతములోను, ప్రతిసంఘములో నున్నవి. కాని యీ దేశములో నున్నంతవిపరీతాచారములు మరియొక దేశములోలేవు. ఆర్యమతములో వేలకొలది శాఖోపశాఖలు, వీని ప్రత్యేకతవలన జనించిన ద్వేషములు,

పరస్పరవిరుద్ధాచారములు, దృష్టిదోష, పంక్తిదోష, స్పర్శదోష వాయుదోషములు స్త్రీలకు పెంపుడు జంతువులబానిసత్వము, మొదలగు దురాచారములు నశించినగాని, మానవసౌభ్రాతృత్వమునకును, లోక కళ్యాణమునకును, మనహిందువులు తోడ్పడజాలరు. కాబట్టి ఆయుపనిషత్తులు, గీత మొదలగు వేదాంతగ్రంథములలోని అధ్యాత్మజ్ఞానమునకు విర్రవీగక, మత శృంఖలములకు కట్టుబడక, ప్రపంచములోని తక్కినసంఘములతోపాటు, మానవకళ్యాణమునకు మనమందరమును పాటుపడవలయును.



# వర్ణాశ్రమ ధర్మసభలు.

ఈ మధ్య, కేంద్ర శాసనసభలో వివాహగర్భాధాన వయోనిర్ణయపు బిల్లులు ప్రవేశపెట్టబడుటచేత, మన హైందవ మతాచారములతో ప్రభుత్వమువారు జోక్యము కలుగచేసి కొనకూడదని తీర్మానించుట కిట్టి సభలు సమావేశమగుచున్నవి. ఇదియే యీసభల ప్రధానోద్దేశమైన యెడల ప్రజల శరీరారోగ్యములకు భంగము కలిగించు ఆచారములను త్రోసిపుచ్చుటకు మన ప్రజాప్రతినిధులు ప్రయత్నము చేయవలసినదా కాదాయను విషయము చర్చనీయాంశమే. దీనిలో భేదాభిప్రాయము లుండుట కవకాశములున్నవి. కాబట్టి మన రాజధానిలోని వైశ్య బ్రాహ్మణులకు మాత్రమే ప్రస్తుత సమస్య సంబంధించిన దగుటచే, వీరే, దీనికి అనుకూలముగ గాని, ప్రతికూలముగ గాని,సభలుచేసి, తమతమ భిన్నాభిప్రాయములను వెల్లడి చేయుచున్నారు. ఈసమస్యను స్త్రీలే నిర్ణయించుకొనవలసినదా, లేక వారికొరకు పురుషులే చేరి నిర్ణయించవలసినదా యనునది కూడ నొక వివాదాంశమే

మనమతమును అపాయస్థితిలోనికి విజాతీయ ప్రభుత్వము తేగూడదని ఆందోళన చేయుటన్యాయ్యమే. ప్రస్తుత ప్రభుత్వములు తాము నిలువవలె నన్న నిట్టి మతవిషయము

లలో నెన్నటికిని జోక్యము కలుగచేసికొనవు. మనకిప్పుడు స్వదేశ ప్రభుత్వము లేనందునను, కాలానుసారముగ ధర్మజ్ఞసభ లేర్పడి మనసమాచారములలో మార్పులు చేసికొనజాలకపోవుట చేతను, కొద్దిపాటి ప్రజాస్వామిక ప్రభుత్వములలోనైనను, మన ప్రతినిధులు దేహారోగ్యమునకు సంబంధించిన కొన్ని మతాచారముల విషయమై యిట్టిబిల్లును ప్రవేశపెట్టినపుడు, మన గవర్నమెంటు వారు అద్భుతగులక తటస్థులుగానుండక తప్పదు. కాని మన హైందవప్రతినిధులలో, శాసన సభలోని మెజారిటీవారు సంపూర్ణ చర్చచేసి బిల్లునుప్యాసు చేసినపుడు మన మందరము పూర్వపుధర్మజ్ఞ సభలతీర్మానము మనరాజులు ఒప్పుకొని ఆచరణలో పెట్టినట్లే మనము ను శిరసావహించవలసినదే. రాజనీతిజ్ఞు, లే దేశములో నైనను ఆధునిక కాలములో మత విశ్వాసములలో నెన్నడు జోక్యము కలుగజేసి కొనరు. కాని జాతివీర్యమును, ఆరోగ్యమును, నశింపజేయు ఆచారములును, ఘోరాచారములును, మతగ్రంథములలో సమర్థింపబడినను, సంఘాభివృద్ధికొరకు వానినిరద్దుపరచుటకు ప్రజాప్రతినిధులకు సంపూర్ణాధికారమే యుండి తీరవలెను. మనవిజాతీయ ప్రభుత్వము, మన శాసనసభలు లేని కాలముననే సహగమనమును మాన్పించినది. ఈ ఘోరాచారము, దక్షస్మృతి పరాశర స్మృతులు మొదలగు మత గ్రంథములలో అత్యుత్కృష్టపదవి నిచ్చునని వ్రాయబడి యున్నది. దీనినిచ్ఛాపూర్వకముగ నవలంబించ

బోవు వృద్ధ స్త్రీనైనను ప్రభుత్వమువారు చెఱసాలలో పెట్టెద రు. మైనరైన స్త్రీని జీవితకాల మంతయు బలహీనురాలుగ చేయు ఆచారము నేల నిషేధించ కూడదు? ఇదియీ స్త్రీకి, జీవితకాలము వరకు చావుకాదా? మన వైద్యశాస్త్రగ్రంథ ములగు చరకసుశ్రుతము లే చిన్నపిల్లల నిషేకమును నిరసించు చున్నప్పుడు పెనిమిటుల బలాత్కార సంభోగమును 16 సంవ త్సరములవరకు ఆపుచేయుటలోతప్పేమి? ఇక వివాహవయో నిర్ణయములో శాస్త్రకారులలో భేదమున్నపుడు, సంఘాభి వృద్ధి కనుకూలమైన ప్రమాణములనే, మన ప్రజాప్రతినిధు లు తీసికొని యీవైశ్య బ్రాహ్మణులకుకూడ నిర్బంధ శాస నముల నేల చేయగూడదు? ఇది వీరి మతాచారపు నమ్మక ముల నెట్లు భంగించును? ప్రజల మోక్షప్రాప్తి కిట్టి యా చారములు, మూఢాచారములైనను సదాచారములైనను ఎట్లు ఆటంకములు కలుగజేయును? కాలానుసారముగ మా రుచుండిన యీయాచారములు శాశ్వతధర్మము లెట్లగును? మన పూర్వపు న్యాయధర్మముల నన్నిటిని యిచ్చవచ్చినట్లు శాసనసభలు మార్చివేయుచున్నవికదా. సంఘమునకు హాని కరమగు ఆచారములను మన శాసనసభలు మార్చవలసిన దనియే నాయభిప్రాయము. విదేశీయ పరిపాలకులు మన మతాచారములతో జోక్యము కలుగచేసి కొనకూడదను విష యమును సాకుగా తీసికొని యీవర్ణాశ్రమధర్మసభలుఅయిదు షేలేండ్ల క్రిందటియాచారములను ముందెల్లప్పటికి నిలువ

బెట్టుటకు ప్రయత్నించుచున్నవి. కనుక వీనిని గురించివిపులము గా ముందువ్రాసెదను.

మన పూర్వ వర్ణాశ్రమములు వర్ణధర్మములు నిత్యములనియు శాశ్వతములనియు, మార్పపడ కూడదనియు అవి కాలవైపరీత్యమున మారినయెడల పునరుద్ధరించ బడవలె ననియు నీ సభలు చాటుచున్నవి ఈసభలలో పాల్గొను పూర్వ సాంప్రదాయికులు గాని నవీనవిద్యాధికులు గాని శ్రుతిస్మృతులలో చెప్పిన ధర్మముల నవలంబించ నేరక ప్రజలయెదుటశుష్కాలాపములు పలుకునపుడు వీరి మాటలను పాటించు వారెవరు నుండరు ఇట్టి శాస్త్రవిచారణలో వీరి దినచర్యను కఠినముగ విమర్శించక తప్పదు "యథాశక్తి సహాగమన,' మనుసామెతను బట్టి తాము చెప్పునట్లు నూత్రము చేయుడనుచు తాము ధర్మాచరణలో నెంత కొఱవడి నను,తమ నడత నవలంబించక మనమందరము వీరుప దేశించు చు ధర్మపన్నముల ననుసరించ వలె ననియు,వీరుచెప్పుమాటను వీరి ధర్మసంస్థాపనవాదదౌర్బల్యమును స్పష్టపరచును. వీరి యుపన్యాసములు తీర్మానములు వట్టి అరణ్యరోదనములై హాస్యాస్పదములగుచుండును కాని ఆధునిక విద్యాధికులును విమర్శకులును వీని నెంతమాత్రము లక్ష్యముచేయరు. నేను మన బెజవాడలో జరిగిన ఆంధ్రదేశవర్ణాశ్రమ ధర్మసభను గురించి కొంచెముగా విమర్శించుటకు తలపెట్టితిని గనుక యీ విమర్శనలోని న్యాయాన్యాయ్యములను చదువరులకే

వదలి నాకు తోచినది నిర్భయముగ వ్రాయుచున్నారు.

ఈ సభవారు పంపిన యాహ్వానపత్రికలో నాకు బెజవాడలో గల యనేకమంది స్నేహితులును చిరపరిచితులును దస్కతులు చేసినారు. మనవిదేశప్రభువులు గాని, యనేక మతముల సభ్యులతో నిండిన శాసనసభలు గాని మన మతాచారములతో జోక్యము కలిగించుకొనకూడదని యభిప్రాయము వీరికందరికి నుండుటబట్టియే వీరందరు దస్కతులుచేసి సభ కూర్చిరనుట నిశ్చయము. ఈవిషయమై మాలో కొందరికి భేదాభిప్రాయము లుండినను వీరి తీర్మానమును గురించి నేను విమర్శించదలచలేదు. కాని దీనిని సమర్థించుటకు తామందరు సనాతనధర్మపరాయణుల మనియు, స్త్రీలకు వివాహమవశ్య మనుష్ఠేయ మనియు, అష్టవర్ష బాలికా వివాహము శ్రేష్ఠతమమనియు, ఋత్వనంతర వివాహములు సర్వదా నిషిద్ధములనియు నీ మొదలగు సూత్రములను తమ తీర్మానములలో చొప్పించిరి. నే నక్కడకు రాజాలక నాస్నేహితులయిన యధ్యక్షులవారిని కొంచెము విశాలదృష్టి కనుపరచవలసినదనియు దేశకాలపాత్రాదుల ననుసరించి తీర్మానముల చేయించిన బాగుగనుండుననియు మాత్రము వారికి విన్నవించుకొంటిని. ఇప్పుడు నాస్నేహితులగు ఆహ్వాన సంఘాధ్యక్షుని యొక్కయు, అధ్యక్షుని యొక్కయు, నుపన్యాసములను రెండు మూడు సారులు చదివితిని. మన కాశా సూర్యనారాయణరావు గారు, మనవర్ణాశ్రమధర్మస్థితి ప్రస్తుతము అంధుదవ

అవస్థయగు అపక్షయాకారమును చెందియున్న దనియు దీనిని ఆరవదియగు వినాశావస్థను చెందకుండ మనము పాటుబడని యెడల వర్ణాశ్రమధర్మములు నశించిన సమకాలముందె మన దేశమునకు నాశనము కలుగక తప్పదనియు ధర్మమనగా వర్ణాశ్రమోచిత కర్మ మనియు సెలవిచ్చిరి. కానివీరు చెప్పిన ప్రకారము సృష్ట్యాది యందే ప్రజల సౌకర్యముల కొరకై వర్ణాశ్రమ ధర్మములను భగవంతు డేర్పరచెనని చెప్పుచు నివియన్నియు నితర దేశములలో లేవని ఒప్పుకొనిరి. అక్కడ యేల కొనయూపిరితో నైనను లేకపోవుట తటస్థించినది? సృష్టికర్త మన దేశమందే పక్షపాతము వహించి మనకు మాత్రమే సుఖము కల్పించదలచు కొనెనా? ఋగ్వేదములో పదియవ మండలములోని పురుషసూక్తము మొదలు శ్రుతిస్మృతులలో నీ ధర్మములలో నెట్టిమార్పులు కలిగినట్లు లిఖింపబడినవి ఈయనగాని అధ్యక్షులుగాని సభ్యులుగావచ్చిన పండితులుగాని గమనించినట్లు కనపడదు. శాస్త్రచర్చకు అంతము లేదు గాన అక్కడకు దయచేసిన శాస్త్రులవారు ధర్మశాస్త్రములను తేటతెలుగుతో తెనిగించినయెడల వానిని నాస్వంతసొమ్ముతో అచ్చువేయించి ప్రజలయెదుట పెట్టెదను. ప్రజలేసత్యమును సులభముగా నిర్ణయించుకొనెదరు. అట్లుకాక తమ కనుకూలించు కోరికలను మాత్రమే క్రోడీకరించి, వర్ణాశ్రమ ధర్మములు నిత్యములని ప్రజలను మోస

పుచ్చుట న్యాయ్యముకాదు. ధర్మశాస్త్రము లన్నిటిని ప్రజా సామాన్యమునకు రహస్యముగనున్న సంస్కృతభాషలోనుండి వారికి తెలిసిన తెలుగుభాషలోనికి వచనముగా అనువదించిన యెడల వీరివాదములోని నిజానిజములు వానియంతట నవియే బయల్పడును. కాబట్టి శాస్త్రచర్చనువదలి యీధర్మనిర్ణయమునకీ సభాసదులు అర్హులాయను విషయమును మాత్రమే చర్చించెదను. ఎవడు వేదములను అధ్యయనముచేసి వేదార్థమును విచారించడో వాడు జాత్యా శూద్రునితో తుల్యుడు. పొందతగిన దానిని (తత్వమును) పొందడు. (ఔశనస్మృతి తృతీయన్యాయ్యము 129 శ్లోకము) వేదాధ్యయనమును పాఠముమాత్రము చేసినవాడు బురదయందు పడినపశువు వలె దుఃఖించుచున్నాడు. (డిటో 128 శ్లో) వ్యవసాయము, శిల్పముమీాద కొలువు, వేతనము తీసికొని విద్యచెప్పుట, వడ్డీ పుచ్చుకొనుట, వర్తకము, రాజును యాచించుట, భిక్షము ఆపత్కాలమునందు మాత్రమే బ్రాహ్మణునికి జీవనోపాయములు (యాజ్ఞవల్క్యస్మృతి ప్రాయశ్చిత్త కాండము. 36 వ శ్లోకము) ఆపత్కాలానంతరము అట్టి బ్రాహ్మణునకు ప్రాయశ్చిత్తములు విధించబడియున్నవి. అజ్ఞానముచే చేయబడిన కృత్యములకేగాని బుద్ధిపూర్వకముగా చేయబడినవానికి ప్రాయశ్చిత్తములేదు. శాస్త్రమువలన అపవాదిమై ఆపావము ననుభవించుటకు తిరిగి యీలోకములో పుట్టుచున్నాడు. )168 వ శ్లో.) అధములగు నేబ్రాహ్మణులు వైశ్వదేవము

చేయక భుజించుచున్నారో వారు నిరర్థకులై యపవిత్రమగు నరకమునందు పడుదురు, వారు కాకులై పుట్టుదురు. (పరాశర స్మృతి ఆచారకాండము శ్లో ౕ౪,ౕౕ) వేదము చదివి యర్థ మెఱింగి కర్మములు చేయువారు బ్రాహ్మణు లనబడుదురు. సవితను దెలుపు గాయత్రిజపమును సంధ్యోపాసనమును అగ్ని కార్యములను చేయక వ్యవసాయము చేసికొని బ్రతుకువారు బ్రాహ్మణు లను పేరుమాత్రము నొందుదురు, ఇట్టివారు వేల కొలది కూడినను అది సభయనబడదు. (పరాశరస్మృతి ప్రాయశ్చిత్తకాండము అష్టమాధ్యాయము 4,5 శ్లో) వైశ్వ దేవము నెవరుచేయక భోజనము చేయుచున్నారో వారు వేద ములను చదివినవారైనప్పటికి శూద్రులై దుష్టజన్మమును పొందుచున్నారు, (శతాతప ధర్మశాస్త్రము షష్ఠాధ్యాయము శ్లో. 2,3, శంఖలిఖితస్మృతిశ్లోకములు 2,3) రాజు సేవచేయు వాడు, క్రయవిక్రయవ్యాపారము చేయువాడు, గ్రామపురో హితుడు, మొదలగువారు బ్రాహ్మణులే కారు. (శతాతపధర్మ శాస్త్రము 12 వ అధ్యాయము) ఇట్టివి స్థాలీపులాకన్యా యముగ కొన్నివిధులనుమాత్రము పేర్కొంటిని. ఇట్టి ధర్మ ముల నాచరించినవారు మన బెజవాడ వర్ణాశ్రమ ధర్మ సభలో లేరు సరికదా న్యాయమునమ్ముకొని నిజమును మరు గుపరచుట అబద్ధమును పురికొల్పుటయే నిత్యజీవనముగల మావంటి లాయరు అధ్యక్షుడుగా నున్నారు. ధర్మము పేరు

చెప్పి ప్రజలవలన ద్రవ్యము గ్రహించి దానిలో కొంతమాత్రము ఖర్చుపెట్టి తక్కినది హరించు వైశ్య శిఖామణులు, విద్య నమ్ముకొని జీవించు బ్రాహ్మణోత్తములు మొదలగువారు సభాసదులుగ నున్నారు. వీరేనా ధర్మనిర్ణయము చేయుట కరుదెంచిన మహానుభావులు? అటులైనచో వీరు ప్రజలను మోసపుచ్చుటకే యిట్టిసభలను సమావేశపరచుచున్నారని నేను చెప్ప సాహసించుచున్నాను. ఈ వర్ణధర్మములు నిత్యములు కావని స్మృతులలోని యాధారములనే తీసికొని మరి యొక వ్యాసమును లిఖించెదను.

చాతుర్వర్ణ్య ధర్మములు సృష్ట్యాదినే యేర్పడి, నిత్యములై, మార్చగూడనివి యని వర్ణాశ్రమ ధర్మ సభాధ్యక్షులగు టి ఆర్, రామచంద్రయ్యగారు, ప్రభల లక్ష్మీనరసింహంగారు మొదలగు ఆధునిక పండితులు పూర్వశ్రౌతస్మార్త ధర్మములను తిరిగి మనలో ప్రవేశపెట్టుమనుచునున్నారు. ఈ ధర్మములు నిత్యములా, లేక ఆయా యుగములలో మారుచుండెనా యనుప్రశ్నమట్టుకే నేనిక్కడ విచారించుచున్నాను గాని, వానిలోని లోపాలోపములుగాని పునరుద్ధారణావశ్యకతా నావశ్యకతలను గాని విమర్శించ దలచుకొనలేదు. దీనిని చదువరులు ముందుగా గ్రహింప వేడెదను.

ఋగ్వేదములో నొక్కచోటను మాత్రమీ వర్ణ ప్రశంస యున్నది. ఈ ఋక్కు ఆ వేదము పదియవ మండల

ములో 18 వది గాను, తైత్తిరీయారణ్యకములో మూడవ ప్రశ్నమందును, శుక్ల యజుర్వేదమందు 31 వ మంత్రములోను అథర్వ వేదములోని 19 వ కాండయందు నున్నది. దీనికి పురుషసూక్తమని పేరు. దీనియర్థమేమన ఈ పురుషునకు విద్యాది గుణముముఖముగ భావింపబడినదాయెను వీర్యాదిగుణము బాహువులుగ భావింపబడిన దాయెను. వ్యాపారాది ధర్మము ఈ పురుషునకు ఊరువుగ భావింపబడినదాయెను. సేవాది గుణము పాదములుగ భావింపబడిన దాయెను. ఈ నాలుగు గుణములలో నెక్కువ తక్కువలు నిర్ణయింపబడి యుండును. ఇది కేవలము రూపక ప్రయోగము. (Allegoric) అనగా ముఖము అంగములన్నిటిలో శ్రేష్ఠమైనట్లు పూర్ణవిద్యచేతను,ఉత్తమగుణ కర్మ స్వభావము చేతను ఉత్తముడగువాడు బ్రాహ్మణుడు. పరమేశ్వరుడు నిరాకారుడగుటచే, ముఖాద్యంగములే లేనపుడు, వాని యందు పుట్టుట యనునది యసంభవము. ప్రపంచములో యేజాతివారైననేమి పూర్ణ విద్వాంసులును ధర్మాత్ములును పరోపకార పారీణులును, జితేంద్రియులును, మిథ్యాభాషణాది దోషరహితులును, ధర్మాచరణతత్పరులునగువారిని బ్రాహ్మణులని చెప్పవలయును. వారి భక్ష్యాభక్ష్యములతోగాని, ప్రార్థనా విధానముతోగాని మనకెట్టి సంబంధము లేదు. విద్యా బలశౌర్యన్యాయకారిత్వాది గుణములతో కూడియున్న

వారు క్షత్రియులనబడుదురు విద్యావంతులై కృషి, పశుపాలనము, వ్యాపారము మొదలగు గుణములతోఁ గూడుకొన్నవారు వైశ్యులగుదురు. విద్యావిహీనులును, మూర్ఖులు నగువారు శూద్రులనబడుదురు. సత్వరజస్తమోగుణములు వీరియందు క్రమముగా స్థిరపడియుండును. ఈ నాలుగు వర్ణములు ప్రత్యేకింపబడి అన్యోన్యసంబంధము లుండకూడదని గాని, వేరువేరు ధర్మములున్నవని కాని, వేదములలోఁ జెప్పబడి నట్లు కనుపడదు. ఆపస్తంబులవారు, యీ శ్రుతి ననుసరించియే (శ్రౌతసూత్రం 2-288) రాజన్య వైశ్యులకు బ్రాహ్మణ శబ్దము దీక్షచేసిన యెడల ప్రయోగింపవలెనని చెప్పినారు. భగవద్గీత నాల్గవయధ్యాయములోని 12 శ్లోకములో" చాతుర్వర్ణ్యమ్మయాసృష్టమ్ గుణకర్మ విభాగశః,, అను వాక్యము ఈ సిద్ధాంతమునే బలపరచుచున్నది. శ్రీకృష్ణభగవానులు, తా నర్జునునకిచ్చిన బోధ, ప్రపంచములోనున్న మానవజాతి కంతకు నుద్దేశింపబడుటవలన, నిక్కడి కర్మశబ్దము శ్రౌతస్మార్తకర్మములకు మాత్రము వర్తింపక, మనుష్యుడుచేయు సమస్త కర్మములకును వర్తించును. కాబట్టి శూద్రుడుకూడ జ్ఞానముచేత యీజన్మములోనే బ్రాహ్మణుడు కావచ్చును జన్మమువలన బ్రాహ్మణత్వమును పొందినవాడు ఈ జన్మలోనే శూద్రుడగును. కాబట్టి, వర్ణవ్యవస్థ, యావత్తు మనుష్యకోటికి, గుణకర్మ స్వభావానుసారముగ నుండును

గాని, జన్మమాత్రమును బట్టి కాదు. జన్మమువలన మనమంద రము శూద్రులమే. వారివారి గుణములను కర్మములనుబట్టి ఆయావర్ణముల కర్హులగుదుము.

ఆపస్తంబ సూత్రము-ధర్మాచరణమువలన నీచమైన వర్ణము, ఉత్తమోత్తమవర్ణమును పొందుచున్నది. ఇక నా వర్ణమందు ఏ యేకర్మలు కర్తవ్యములును, అధికార రూప ములునై యున్నవో ఆయా గుణకర్మ స్వభావములన్నియు నాపురుషునికిని స్త్రీకిని లభించదగును. అటులనే యధర్మా చరణము వలన నుత్తమోత్తమవర్ణములను పొందును. ఇక వారు ఆయావర్ణములను గూర్చిన యధికారములను, కర్మలను పాలించువారు కావలయును. ఇది యంతయు నీ జన్మములోనే జరుగవచ్చును. ఉత్తమజన్మప్రమేయ మేమియు నీ సూత్ర ములో లేదు.

మన దేశములో వేదయుగముననో, అనంతరముననో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణములవారు చేయవలసిన విధు లనేకము లేర్పడినవి. దరిమిలాను స్మృతులలో వాని నింకను పెంచిరి.

మనుస్మృతి అ 10 శ్లో 65 ఉత్తమగుణ కర్మస్వభావ ములబట్టి శూద్రుడుగా నున్నవాడు వైశ్యక్షత్రియ బ్రాహ్మ ణాదుల యొక్కయు, అట్లే వైశ్యుడుగా నున్నవాడు క్షత్రి య బ్రాహ్మణులయొక్కయు, అట్లే క్షత్రియుడుగానున్నవాడు

బ్రాహ్మణునియొక్కయు వర్ణాధికారములను కర్మలను పొందుచున్నాడు. అట్లే నీచమైన గుణకర్మలను బట్టి బ్రాహ్మణుడుగా నున్నవాడు క్షత్రియ వైశ్య శూద్రాదుల యొక్కయు, క్షత్రియుడుగా నున్నవాడు వైశ్య శూద్రుల యొక్కయు, వైశ్యుడుగా నున్నవాడు శూద్రునియొక్కయు, వర్ణాధికారమును కర్మలను పొందుచున్నాడు. ఇదియంతయు నీ జన్మములోనే.

ఇట్లు ప్రతివాడును ఉత్తముడగుటకు ప్రయత్నించవచ్చును. ఛాందోగ్యోపనిషత్తునందు వ్రాసియుండినట్లు అజ్ఞాతకుల మందలి జాబాలియు, భారతమందు వ్రాసియుండినట్లు క్షత్రియవర్ణస్థుడగు విశ్వామిత్రుడును, చండాల కులమందలి మాతంగ ఋషియు బ్రాహ్మణులైనట్లు అనేకులైనారు. అగుచున్నారు. కాగలరు. బ్రాహ్మణులకు శ్రౌతస్మార్త కర్మ లెంత వృద్ధియగుచు వచ్చినను, ఇతర వర్ణముల వారితో భోజన ప్రతిభోజనములు నన్యోన్య వివాహముల కెట్టి యాటంకములు లేవు. సాధారణముగా నే ధర్మముల నవలంబించిన వారు వారితోనే సమానమైన కుటుంబ స్త్రీలనే వివాహము చేసికొను నాచారము వృద్ధియగుచు వచ్చి యీవర్ణములు ప్రత్యేక శిలలుగా చేయబడినవి. ఈ పరిణామమునకు నిదర్శనములు చూపుటకు ముందు మనువు కాలములోని బ్రాహ్మణధర్మము లేవో వ్రాసెదను.

మనుస్మృతి—అ 2- శ్లో 28. సకల విద్యలను చదువుట చేతను చదివించుట చేతను, బ్రహ్మచర్యము సత్యభాషణము మొదలగు నియమములను బాలించుట చేతను, అగ్నిహోత్రాది హోమము, సత్యము యొక్క గ్రహణము, అసత్యము యొక్క త్యాగము, సత్య విద్యలయొక్క దానము. వీనిచేతను, వైదికములగు కర్మ, ఉపాసన జ్ఞానవిద్యలను గ్రహించుటచేతను, పక్ష్యేష్ట్యాదులను చేయుట చేతను, సుసంతానోత్పత్తిచేతను, బ్రహ్మదేవ పితృ వైశ్వదేవాతిథుల యొక్క సేవారూపమగు పంచ మహాయజ్ఞముల చేతను, అగ్నిష్టోమాదులు, శిల్పాది విజ్ఞానాదులు నను యజ్ఞములు సేవించుట చేతను, ఈ శరీరము బ్రహ్మీయంగా వేదముల యొక్కయు పరమేశ్వరుని యొక్కయు భక్తికి నాధారరూపమగు బ్రాహ్మణుని యొక్క శరీరముగా చేయుబడును. ఇవి యన్నియు నుండవలెనని లేదు. ఈ ధర్మమును ప్రతి వర్ణము వారు ననుష్టించి యుత్తమ వర్ణములో చేరవచ్చును. వర్ణములలో నన్యోన్య సంబంధములు కొంత కాలము వరకు జరుగుచునే యుండెను.

శంఖధర్మ శాస్త్రము. అ 4 శ్లో 7-18 బ్రాహ్మణునికి బ్రాహ్మణ జాతీయురాలు, క్షత్రియ జాతీయురాలు, వైశ్య జాతీయురాలును భార్యలుగా చెప్పబడి యున్నారు. క్షత్రియునికి క్షత్రియ జాతీయురాలును వైశ్య జాతీయురాలే భార్యగా నుండవలెను. శూద్రునికి శూద్ర జాతీయురాలే చెప్పబడినది. ప్రతిలోమ వివాహములు మాత్రము నిషేధింప బడినవి.

శంఖ ధర్మశాస్త్రము అ 16 శ్లో 17-21. జ్ఞాతియైన శూద్రుడు చనిపోయిన యెడల బ్రాహ్మణాది వర్ణములకు సూతకము వరుసగా ఒక దినము, మూడు దినములు, ఆరు దినములు, ఒక మాసము చెప్పబడినది. జ్ఞాతియైన వైశ్యుడు చనిపోయిన యెడల బ్రాహ్మణాదివర్ణములకు సూతకము వరుసగా మూడు దినములు ఆరు దినములు, పదిహేను దినములు నొక నెల చెప్పబడినది. జ్ఞాతియైన క్షత్రియుడు చనిపోయిన యెడల బ్రాహ్మణునికి ఆరు దినములకు శుద్ధియగును. మిగిలిన వర్ణములకు పండ్రెండు దినముల వలన శుద్ధిప్రదేశము చేయవలెను. జ్ఞాతియైన బ్రాహ్మణుడు చనిపోయిన యెడల నన్ని వర్ణముల వారు నేకరీతిగా పది రాత్రుల చేత శుద్ధిని పొందుదురు. ఈ చొప్పున సర్వజ్ఞుడైన యముడు చెప్పెను." తరువాత ధర్మము లెట్లు మారెనో తెలిపెదను.

వృద్ధ పరాశరస్మృతి. శ్లో 6-275,43-47 సవర్ణము కాని వివాహములు కలియుగ మందు వర్జించవలెను. ఇట్లే శ్రాద్ధములలో మాంసము పెట్టుట అశ్వమేధ గోమేధ సన్యాసములు, మధుపర్కకాలమందు పశువును చంపుట, వానప్రస్థాశ్రమ గ్రహణము, సముద్రయాన స్వీకారము, జలపాత్రధారణము, నరమేధము, స్త్రీ పునర్వివాహము, పరభార్యాపరిగ్రహణము, యతికి అన్ని వర్ణములయందు భిక్షచేయుట మొదలైనవి ఆచరింప గూడదు. కాబట్టి యివన్నియు నొకప్పుడున్న వనియు, కలియుగములో వర్జింపబడలెను.

ననియు తాత్పర్యము. ఔరస దత్తపుత్రులు తప్ప, తక్కిన పదిరకముల పుత్రులను స్వీకరించుట, భిన్నజాతులనుండి పుత్రస్వీకారము, అసుర, గాంధర్వ, రాక్షసపైశాచ వివాహ ములు జరుగ కూడదు.

ఈ స్మృతి ధర్మములు నిత్యములు కావనియు మారు చున్నవనియు ఆయా యుగములలో మాత్రము అవియా చరించతగి యుండెననియు తేలుచున్నది.

పరాశరస్మృతి అధ్యాయము 1, శ్లో 25,33, అ 11 శ్లో 50 కృతయుగంబున మనుధర్మములును, త్రేతాయు గంబున గౌతమ ధర్మంబులును, ద్వాపరంబున శంఖ లిఖిత ధర్మంబులును, కలియుగంబున పరాశరధర్మంబులును ప్రచారముగ ననుష్ఠింపబడును. ఆయాయుగములలో మారు చుండెడి ధర్మంబులను కాలవశత ననుష్ఠించు నప్పటప్పటి ద్విజులును నింద్యులు కారు'' కాబట్టి యీ కాలపరిస్థితుల ను బట్టి శ్రౌతస్మార్తకర్మకాండలను అనుసరించ జాలనపుడు నింద్యుల మెట్లగుదుము?

క్రమముగా వర్ణ సంకర మగుచున్నదని యెట్టి కఠిన నిబంధనలు నొకప్పుడు నడలుట జరిగినదో యీపరాశర స్మృతివలన నే స్పష్టపడ గలదు

పరాశరస్మృతి అ 1 శ్లో 65 శూద్రుడు బ్రాహ్మణ స్త్రీని కూడినను వేదము నర్థము విమర్శించినను తత్క్షణము పాపియగును. బ్రాహ్మణుడు కృషిచేయ వచ్చును. (ఆచార

కాండ అ 2 శ్లో 2) పంద్రెండవ యేడు వచ్చిన కన్యను నెపడు పెండ్లిసేయడో వాని పితరులు ఆ కన్య రజస్సు త్రాగుదురు. (ప్రాయశ్చిత్త కాండము. అ 7 శ్లో 4 to 8) బ్రాహ్మణుడు ఆరు కర్మంబులు శ్రద్ధతో నాచరించుచు నిత్యము దేవతల నతిథుల పూజించుచు హోమావశిష్టము భుజించుచుండిన నశింపడు. (ఆచారకాండము. అ 1 శ్లో 33) వేదాధ్యయనము మొదలగు కర్మలు కలవాడును పవిత్రనుగు వ్రతము కలవాడు నగు క్షత్రియుని యొక్కయు వైశ్యునియొక్కయు నిండ్లనెప్పుడు దేవపితృ కర్మములందు బ్రాహ్మణులు భోజనము చేయవలెను. (ప్రాయశ్చిత్త కాండ అ 11 శ్లో 12) బ్రాహ్మణుడు శూద్రసంబంధులైన నేయి పాలు నూనెయును చమురుతో వండినపూరీలు మొదలగు భక్ష్యములును పుచ్చుకొని వెడలి యేటియొద్దనభుజింపవచ్చును(ప్రాయశ్చిత్త కాండ అ 11 శ్లో 13) క్షత్రియుడు పెండ్లాడిన శూద్రకన్య యందు కన్న కొడుకు గోపాలుడని తెలియదగును. వాని యన్నము బ్రాహ్మణుడు తినవచ్చును. సంశయము లేదు (అధ్యాయము 11. శ్లో 23) శూద్రుని యన్నమును శూద్రునితో నొక యింట నుండుటయు, వానితో నాసనమున కూర్చుండుటయు, వాని వలన పుణ్య పాపములు తెలిసికొనుటయు, బ్రాహ్మవర్చస్సుచే మెఱయుచున్న వానినైనను నరకమున బడద్రోయును. ( 12, 34) ఎవడు కాపువాని చేత నన్నము వడ్డించుకొనునో, యెవనికి శూద్ర స్త్రీ భార్య

గానుండునో వాడు హావ్యకవ్యము చేయతగడు. ఆబ్రాహ్మ
ణుడు నరకమును పొందును (అ 12 శ్లో 35)

పైని వ్రాసిన కొద్ది విషయములను బట్టియే యీ
కాలపు వర్ణధర్మములు నిత్యములు శాశ్వతములుగా సృష్ట్యాది
నుండియు నున్నవని చెప్పుట పట్టి బూటకపు మాట. అట్లున్న
యెడల ప్రపంచములోని ప్రతిజాతియందు నీ వర్ణాశ్రమ
ధర్మము లిక్కడవలెనే కొద్దిగనైనను కనుపడుచుండ
వలెను. శృతిస్మృతులను జాగ్రతగ పరిశీలించినచో ఆయా
కాలములలోనున్న ఆచారములనే వానిని రచించిన వారు
లిఖించిరి. కనుకనే మనువు మొదలగు ఋషులు, ఆచారము
లకే ప్రధాన స్థాన మిచ్చిరి. ఇదిగాక యీశ్రుతిస్మృతు
లన్నియు సమాన ప్రమాణములుగ భావించ కూడదు.
"శ్రుతిస్మృతి పురాణములకు వైరుధ్య మున్నప్పుడు, ఏది
వేదములలో చెప్పబడినదో అది యత్యంత శ్రేష్ఠమైన
ధర్మము. స్మృతి పురాణముల యందున్నది తక్కువైన
ధర్మము. స్మృతులలో మనువు వచనము గ్రహించ తగి
నది. ఆచార విషయములలో పరస్పర విరోధమున్నపుడు
వారి వారి దేశమునుపట్టి ధర్మముల నేర్పాటు చేసికొన
తగినది"—(గౌతమ ధర్మశాస్త్రము. అ 1 శ్లో 10,12,18,18)
స్వామి దయానంద సరస్వతుల వారు వేదములను మాత్రమే
అపౌరుషేయములని ఒప్పుకొని ఆర్య సమాజ మతమును
స్థాపించిరి. వానిని పౌరుషేయము లనియే భావించి అగ్ని

హోత్ర సంబంధమైన కర్మలనుకూడా త్యజించి రాజా రామమోహన రాయులవారు బ్రహ్మసమాజ మతమును స్థాపించిరి. మన మిప్పు డీ రెండిటిలో దేనిలోను చేరక కర్మకాండంతయు కట్టిపెట్టి వర్ణాశ్రమ ధర్మము లన్నియు వదలివేసి కలికాల వ్యవహారములను బట్టి మన మందరము శ్రుతిస్మృతుల ప్రకారము శూద్రులమైనను వానిలో విశదీకరించిన కొన్ని లక్షణములు కలవారిని బ్రాహ్మణులుగ నెంచుకొనక తప్పదు మహమ్మదీయులు క్రైస్తవులు పారశీలు బౌద్ధులు మొదలగు నేజాతివారైనను సరే కొన్ని లక్షణము లున్నయెడల వారిని మనము బ్రాహ్మణులుగ భావించి వారితో భోజన ప్రతిభోజనములు, నన్యోన్య వివాహములు జరిగించుకొన వచ్చుననుటకు ఋగ్వేదమే మనకు ప్రమాణము. తపస్సు, ఇంద్రియనిగ్రహము, కృప, దానము, సత్యము, ధర్మము, మంచి వినికిడి, కరుణ, విద్య, జ్ఞానము, పరలోకభావజ్ఞానము నివి బ్రాహ్మణ లక్షణములనియు, నివి గలవారికి నమస్కరించవలసినదనియు శతాతప ధర్మశాస్త్రములో నున్నది. [అ 11 శ్లో 4] ఇక ఆశ్రమధర్మములను గురించి వ్రాసెదను.

## బ్రహ్మచర్యాశ్రమము

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు క్రమముగా 8. 11. 12 సంవత్సరముల వయస్సున ఉపనయనముచేసి వేదమును నేర్పించవలెను. ప్రతిదినము స్నానము, మార్జనము, ప్రాణాయామము, సూర్యోపస్థానము గాయత్రి

జపము, సంధికాలముల యందగ్నిహోత్ర క్రియలు చేయుచుండవలెను. బ్రహ్మ యజ్ఞ రహితులు బ్రహ్మహత్య చేసినవారగుదురు. గురువుదగ్గర వేదాధ్యయనము చేయవలయును. దొరకిన భిక్ష ముందుగా గురువున కిచ్చి తరువాత ఆయన యుచ్ఛిష్టమును తినుచుండవలెను. దండమును, కృష్ణాజినమును, ఉపవీతము, మొలత్రాడును, ధరించవలెను. మధుకరవృత్తి చేయవలెను. వేదమును సమాప్తి చేసి, గురువుకోరిన ద్రవ్యమునిచ్చి ఆయన యనుజ్ఞచేత సమావర్తనము చేయవలెను. అనగా తిరిగి ఇంటికి వెళ్ళునపుడు చేయవలసిన విధులు నెరవేర్చవలెను. (యాజ్ఞవల్క్య స్మృతి, ఆచారకాండము, బ్రహ్మచారిప్రకరణము. శ్లో 10—51)

బ్రహ్మచారి నేలమీద పండుకొనవలెను. (శంఖధర్మశాస్త్రము) సావిత్రివ్రతమును, వేదవ్రతమును, ప్రతీకవ్రతమును, ఉపనిషద్వ్రతమును, గోదానవ్రతమును, త్రిసుపర్ణవ్రతమును చేయవలెను. (బుధ స్మృతి) ఎప్పుడును ఒకరి యన్నమునే తినువాడు కాకూడదు. సారాయిని, మాంసమును, లవణమును, నేతిని, అన్నివిధములగు భక్ష్యములను విడువవలెను. (లిఖితస్మృతి) తాంబూలమును, దంతధావనమును ఉచ్ఛిష్టభోజనమును, పగటినిద్రను, విడిపింపవలెను. (లిఖిత స్మృతి) గొడుగును, పాదుకలును గంధమును, పుష్పములును జలక్రీడయు, జూదము, సంగీతమును, వాద్యమును విడిపించ

వలెను. గురువు నింటియందే యుండి ఆయనకెల్లపుడు శు శ్రూష చేయుచుండవలెను. ఇంద్రియనిగ్రహము కలవాడై యేనుగులను, గుర్రములను నెక్కకూడదు. (హారీత ధర్మశాస్త్రము అ 3 శ్లో 49_63) అద్దము చూడకూడదు. దంతధావనము చేయకూడదు. గురువుయొక్క ఉచ్ఛిష్టమును వారి యనుమతితో భుజించవలెను. మాలిన్యమును పోగొట్టెడి అభ్యంజన స్నానము నెప్పుడును జేయకూడదు. ఎల్లప్పుడు జుట్టుముడి కలవాడుగా నుండవలెను. (ఔశనస్మృతి; మనుస్మృతి అ 2 శ్లో 177-180).

ఎనిమిదేండ్లమీద 36 ఏండ్లపర్యంతము గాని లేక దానిలో సగభాగముగాని లేక కనీసము 9 యేండ్లు గాని వేదము నభ్యసింపవలెను. (మనుస్మృతి అ 5 శ్లో 1) కనిష్ట బ్రహ్మచర్యము 24 యేండ్ల వయస్సువరకును, మధ్యమ బ్రహ్మచర్యము 44 యేండ్ల పర్యంతమును, ఉత్తమబ్రహ్మచర్యము 48 సంవత్సరములవరకును చేసినయెడల, వీరురోగరహితులై దీర్ఘకాలము జీవించి, విద్యాదిగుణసంపన్నులై యుందురు. (ఛాందోగ్యోపనిషత్తు 3వ ప్రపాఠము 16వ ఖండము) సుశ్రుతము సూత్రస్థానము, 35వ అధ్యాయములో, శరీరమునకు నాల్గుఅవస్థలు చెప్పబడియున్నవి. వృద్ధి ముసంవత్సరములు మొదలు 25 సంవత్సరములవరకు, యౌవన 16 సంపూర్ణత, 25 మొదలు 40వ సంవత్సరమువరకు, కించి

త్పరిహారిణి 40 మొదలు 48 సంవత్సరములవరకు. ఈ 48 వ యేట వివాహము చేసికొనుట యుత్తమోత్తమ మని చెప్పబడియున్నది.

పైని చెప్పిన బ్రహ్మచర్యాశ్రమ విధులు, సాధారణముగా మన తండ్రులు, మనము మన కొమాళ్ళు ఆచరించలేదు. బెజవాడ వర్ణాశ్రమధర్మ సభలోని శాస్త్రులవారు కూడాతమ పుత్రుల చేత ఆచరింప చేయలేదనియె నానమ్మకము. ఆంగ్లేయ పాఠశాలలలో చిన్నప్పటినుండి తమ పిల్లల చేత విద్య నభ్యసింప జేయు వారెట్లు వర్ణాశ్రమధర్మముల మాట యెత్తుదురో నాకు ఆశ్చర్యముగనున్నది. వీరెవరును బ్రాహ్మణులు కారని నేను రుజువుచేయగలను. వీరు శ్రౌతస్మార్త కర్మములలో మిక్కిలి కొరవడి యున్నారు. వీరెవరును ఉపదేశకర్తలు కారని స్మృతులన్నియు యేకగ్రీవముగ ఘోషించుచున్నవి. ఇదివరకు వెనుకటి వ్యాసములో వ్రాసినదిగాక మరియొక వచనము కూడ యిక్కడ పొందుపరచుచున్నాను. వేదమును స్వరముతో పాఠము మాత్రము చేసి, దానియర్థమెరుగని వాడు కొమ్మలతోను ఆకులతోను, పూవులతోను, గూడుకొన్న వృక్షమువలెను ధాన్యాదులను మోయు పశువువలెను భారవాహుడై యున్నాడు. (నిరుక్తము) ధర్మనిర్ణయము చేయుట కేర్పడిన కార్య నిర్వాహక సభ్యుల యోగ్యతలను చదువరులే గ్రహించగలరు. వీరెవరును దేశ కాలపరిస్థితులను గుర్తించి యీ కాలమునకు ధర్మనిర్ణ యు

ములు చేయుటకుగాని, పూర్వశ్రుతిస్మృతులయందలి ధర్మ
ములను పునరుద్ధరించుటకుగాని అనర్హులని పైని నేను వ్రాసి
న ప్రమాణముల వలన స్పష్టపడుచున్నది. పైని చెప్పిన వి
ద్యావిధానమును విమర్శింతము. కేవలము వేదాధ్యయనము
నేచేయుచు, శ్రౌతస్మార్తకర్మలతో యావజ్జీవము గడపువాడు
ఛాందసుడును ప్రపంచజ్ఞానమెఱుగనివాడునగును. బాల్యములో
నేభూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రముగణితము, పదార్థవిజ్ఞాన
శాస్త్రమురసాయనశాస్త్రము, మొదలగునవియభ్యసింపవలెను.
పురాణములలో పాలసముద్రము నేతిసముద్రము కల్లుసముద్ర
ము మొదలగునవి నేర్చుకొని అట్లాంటికు పెసిఫికు మహాసము
ద్రము లెక్కడున్నవో తెలియని బాలుడు వ్యర్థుడగుట కె
ట్టి సందేహము లేదు. ప్రపంచములోని విషయములను కొన్ని
టినైనను గుర్తెఱుంగని యువకుడు ప్రపంచాతీతమైన విషయ
ములను గురించి ముచ్చటించుట కెట్లు అర్హుడగును? సాం
ఖ్యవేదాంత సిద్ధాంతములను భాష్యములతో వల్లెవేసిన మను
జుడు కూడ కొన్ని భౌతికశాస్త్రములలో నైనను పరిచయ
ము లేనిది సరియైన మతగురువు కూడ కానేరడు. ఇతరుల
కాధ్యాత్మిక విషయములను బోధించుటకైనను సమర్థుడుకా
డు. ఇతనికి జ్ఞానవిజ్ఞానములు రెండును తెలియవలెను. కుశా
గ్రబుద్ధిగల పిల్లవాండ్రచేత అర్థము కాని వేదము
లను వల్లె వేయించుచు సంవత్సరములను గడుపుటకంటె నె
క్కువ పాపము వేఱుగనుండదు, ఆధ్యాత్మిక విషయము

లను తెలిసికొన వలసిన కాలము వారికి ముందున్నది. భగవద్గీత ఉపనిషత్తులలోని విషయములను వారు క్రమేణ గ్రహించెదరు. ఈలోపుగా వారి జీవనోపాధికి తగిన సాధనముల ను చూచుకొన వలయును కర్మకాండ యంతయు వర్జించి పురోహిత వృత్తినవలంబించదలచు కొన్నను లోపలి గుంజుపోయి వట్టి డొల్లవలెనున్న పూర్వపు కర్మకాండను ఆచరించు వారే నక్రతుగానున్నపుడు వీరికి జీవన మెట్లు జరుగును ? కాబట్టి ప్రస్తుతపాఠశాలలలోని విద్యావిధానము కొద్ది మార్పులతో మనకు మిక్కిలి యుపయోగపడుచున్నది. కొందరు సంస్కృత వ్యాకరణ సాహిత్యములలో ఉన్నతపరీక్షల నిచ్చిన తరువాత అష్టాధ్యాయి మహాభాష్యములను చదువుకొన వచ్చును.

ఇక ముందు గృహస్థాశ్రమ ధర్మములను గురించి వ్రాసెదను.



# గృహస్థాశ్రమము.

## వి వా హ ము లు

—:—

బ్రహ్మచర్య వ్రతమును, సాంగోపాంగముగ విద్య విద్యను, ఉత్తమశిక్షను పదార్థవిజ్ఞానమును పూర్ణముగ పొందినవాడై, వివాహవిధాన పూర్వకముగ గృహస్థాశ్రమమును ప్రవేశించుటకు, విద్యాలయమును వదలి, యింటికై పువచ్చుట సమావర్తన సంస్కారమనబడుచున్నది. ఈవిషయమై ఆశ్వలాయన పారస్కర గోభిలీయ శౌనకాది గృహ్యసూత్రములను చూచునది.

వివాహమునకు ముందు వధూవరుల వయస్సును, కులమును, స్వభావ శరీరాదులను మధ్యవర్తులచే పరీక్షించబడజేయవలెను. (మనుస్మృతి అ 3-2-4-10) ఉత్తమ బ్రహ్మచర్య వ్రతము సలిపి సద్విద్యల బడసిన పురుషులును స్త్రీలును వివాహము చేసికొనవలెను. (ఋగ్వేదము మం 2 సూ 35, మం 406 మం 5 సూ 37 మం 3, మం 5 సూ 41 మం 7) వివాహకాలమందు వధూవరులు ఒండొరులతో చెప్పుకొను వాక్యములను, ప్రమాణములను తెలిసికొన్నయెడల, వారు తమ విధులను బాగుగా తెలిసికొన్న విద్యాధికులై యుండవలెనని కనుపడుచున్నది. పరాశర స్మృతిలోని "అష్టవర్షాభవే

ద్వారి” యను సప్తమాధ్యాయములోని నాలుగవ శ్లోకము ప్రక్షిప్తమని నేను భావించెదను. ఒకవేళ ఆ ఋషియు మరి కొందరు నిట్టి శ్లోకములను వ్రాసిన యెడల, అప్పటి దేశాచారములను వారు లిఖించి యుండవలెను గాని వేదవాక్యములకు వ్యతిరేకముగ వారు వ్రాయరని నమ్మవలెను. అట్టి కొన్ని వాక్యములకు దయానంద సరస్వతీస్వాములవారి యర్థమును వ్రాయుచున్నాను.

(ఋగ్వేదము. మ10 సూ85. 47) ఈ యజ్ఞశాలయందు కూర్చుండిన విద్వాంసులారా! మీరు మా ఉభయులను తమ ప్రసన్నతాపూర్వకముగ గృహస్థాశ్రమమున కలిసియుండుట కొరకు నొకరు స్వీకరించుచున్నామని నిశ్చయముగ నెరుగదగును. ఇక మా యిరువురి హృదయములు జలమువలె శాంతముగను ఒక్కటిగను కలసియుండగలవు. ఎట్లు ప్రాణవాయువు మాకు ప్రియమైయున్నదో యటులే మేమిరువురము నొకరితో నొకరు ప్రసన్నులమయి యుందుము. ఎట్లు ధారణకర్తయగు పరమాత్మ అందరి యందు కలసియుండి సమస్తజగత్తును ధరించుచున్నాడో యటులే మేమిరువురము నొకరితో నొకరు ప్రసన్నులమయి యుందుము. ఒకరి నొకరు ధరింతుము. ఎట్లు ఉపదేశము చేయువాడు శ్రోతలను ప్రేమించుచున్నాడో అటులే మా యిరువురి యాత్మ పరస్పరము దృఢమయిన ప్రేమను ధరించుగాక.

(అ-5-5)ఓ స్త్రీ (లేక) పురుషుడా! జగత్తునకుపూర్వము ఋతమను యదార్థ స్వరూపంబగు మహత్తత్వ ముత్పన్నమై యుండెను. ఆ మహత్తత్వమందు సత్యమును, త్రిగుణాత్మకమైనట్టియు, నాశరహితమైనట్టియు, ప్రకృతిప్రతిష్ఠితమై యున్నది. ఏ ప్రకారము ప్రకృతి పురుషుల యొక్క సంయోగమునుండి విశ్వమంతయు నుత్పన్నమై యున్నదో అటులనే యీ వివాహము చేసికొనుటకు మే మిరువురము సత్యమయిన ప్రతిజ్ఞ చేయుచున్నాము. దానికి మా ప్రతిజ్ఞలని జపము చేసికొనుటకు దృఢమయిన యుత్సాహము కలిగి యుందుము గాక.

(ఋ. మ 10 సూ 85 మం 36.) హే వరాననే(లేక) హేవీరా! నేను ఐశ్వర్యము నుసంతానము మొదలుగా గల సౌభాగ్యాభివృద్ధి కొఱకు నీ చేతిని గ్రహించుచున్నాను. నీవు నాతోడ జరావస్థను పొంది సుఖపూర్వకముగ నుందుము. నేటినుండి పతి పత్నీ భావముచేసి మన మొండొరులకు ప్రాప్తమయి యున్నాము. సకలైశ్వర్య యుక్తుడును న్యాయకారియు, సకల జగదుత్పాదకుడును, అనేకవిధములగు జగత్తులను ధరించువాడును నగు పరమాత్మ యీ సభామండపమున కూర్చుండి యున్న విద్వాంసు లందరి యెదుట గృహస్థాశ్రమ కర్మానుష్ఠానమునకై నిన్ను నాకునిచ్చుచున్నాడు. నేటినుండి నేను నీ చేతను నీవు నా చేతను అమ్ముబడియున్నారము. ఎప్పుడు నొకరికొకరు అప్రియము

నాచరించకుందుము. హే ప్రియే! ఐశ్వర్య యుక్తమయి న నేను నీచేతిని గ్రహించుచున్నాను. ధర్మయుక్తముగ ప్రేరేపించు నేను నీచేతిని గ్రహించియున్నాను. నీవు ధర్మముచేత నాభార్యవై యున్నావు నేను ధర్మముచేత నీగృహపతిని మన మిరువురము కలసి గృహకార్యములను సమర్థించుకొనుచుందుము. ఇరువుర కప్రియాచరణమును వ్యభిచార మెన్నటికిని చేయకుందుము. దానంజేసి గృహకార్యము లన్నిటి సిద్ధియు ఉత్తమ సంతానమును కలిగి ఐశ్వర్య సుఖములు సదావృద్ధినొందుగాక! హే అనఘే! సకల జగత్పాలకు డగు పరమాత్ముడు నిన్ను నాకు నిచ్చియున్నాడు. నీవే సంపూర్ణ జగత్తునందు నన్ను పోషించుటకు యోగ్యమయిన పత్నివగుదువు గాక! హే ప్రజాపతీ! నీవు పత్నియగు నాతో నూరేండ్లవరకు సుఖపూర్వకముగ జీవించియుందుము. (ఇట్లే వధువు కూడ వరుని నుండి ప్రతిజ్ఞ చేయించతగును) హే శుభాననే! ఎట్లు పరమేశ్వరుని యొక్క యీసృష్టి యందు అతని యొక్కయు, ఆప్తులగు విద్వాంసులయొక్కయు, శిక్ష చేత దంపతులమగుచున్నామో యెట్లు విద్యుతము, విశ్వమంతటను వ్యాపించుచున్నదో, అటులే నీవు నాప్రసన్నతకై సుందరమైనవస్త్రములనుభూషణములను,ధరించినావలనసుఖమును పొందుము. మనయొక్క కోరికను పరమాత్ముడు సిద్ధింపజేయును గాక. ఎట్లు సకల జగదుత్పాదకుడును, పూర్ణైశ్వర్యయుక్తుండును నగు పరమాత్ముడు ఉత్తమప్రదల్వాతో

సాస్త్రీవగు నిన్ను ఆచ్ఛాదితమయి శోభాయుక్తముగ చేయు
నో యట్లే నేను సూర్యుని కిరణములవలె నిన్ను వస్త్రభూష
ణాదులతోడ సదా శోభింప జేయుదును. ఓ ప్రియురాలా!
నేను నీ ప్రకారమే సూర్యునివలె సుశోభిత మయినట్టియు,
ఆనందమయినట్టియు, అనుకూలమయినట్టియు ప్రియాచరణ
మొనర్చి ఐశ్వర్య వస్త్రభూషణాదులచేత సదా యానందిం
జేయుదును,

పారస్కర గృహ్యసూత్రము. కాం 2కం 6. ఓవధూ!
ఎట్లు నేను జ్ఞానవంతుడనై జ్ఞానపూర్వకముగ నిన్ను గ్ర
హించుచున్నానో అటులే నీవును జ్ఞానపూర్వకముగ నన్ను
గ్రహించుదానవగుచున్నావు నేను సామవేదమువలె ప్రశం
సితుడనై యున్నాను. నీవు ఋగ్వేదమువలె ప్రశంసితురా
లవై యున్నావు. నీవు పృథివివలె గర్భము మొదలుగాగల
గృహాశ్రమ వ్యవహారములను ధరించుదానవై యున్నావు.
నేను వర్షము కురిపించు సూర్యునివలె నున్నాను
పరస్పరము కలిసి వీర్యమును ధరింతుముగాక. ఉత్తమ
ప్రజలను ఉత్పన్నము చేయుదము గాక. అనేక పుత్రు
లను పొందుదుము గాక. మంచిరీతి నొందారులము ప్రస
న్నచిత్తులమును పరస్పరరుచిగలవారమును సుప్రకారము
విచారము చేయువారమునై నూరేండ్లు ఒకరి నొకరము
ప్రేమదృష్టితో చూచుచుందుము గాక. నూరేండ్లవఱకు
ఆనందముగ జీవించియుందుము గాక. నూరేండ్లవఱకు ప్రియ
మయిన వచనములు విన్నుచుందుము గాక,

అథర్వకాం. 14, అ1, మం 51-57. ఎట్లు మనస్సుతో కులాభివృద్ధిని చూచుచు నేను నీరూపమును ప్రీతితో పొంది, యందు ప్రేమద్వారా వ్యాప్తమగుచున్నానో యటులే నా వధువవగు నీవు నాయందు ప్రేమతో వ్యాప్తనయి అనుకూలమయిన వ్యవహారమును పొందుదువుగాక. ఎట్లు నేను మనస్సుచేతను వధువవగు నీతో దొంగతనము మానుకొనుచున్నానో, దొంగతనముచేత నెట్టి యుత్తమపదార్థమైన భోగించకుందునో, స్వయముగా పురుషార్థముతోడ శిథిలుడనైనను ఉత్కృష్టమయిన వ్యవహారమునందు విఘ్నరూపంబగు దుర్వ్యసనములు గల బంధనములను దూరముచేయుచుందునో యటులే యీవధువు కూడ చేయుచుండును గాక. ఇవ్విధముగనే వధువు గూడ నేనును దీనితో నీప్రకారమే వర్తించుచుండునని వరుని స్వీకరింపవలయును.

పారస్కర గృహ్యసూత్రము కాం 2-కం 8. ఓ వధూ! [లేక] ఓ స్వామీ! నీయంతఃకరణములను ఆత్మను నాకర్మకనుకూలముగ ధరించుకొనుచున్నాను. నాచిత్తమున కనుకూలముగ నీచిత్తము సదా యుండుగాక. నావాక్కును నీ వేకాగ్రచిత్తముతో సేవించుచుండుము ప్రజాపాలకు డగుపరమాత్ముడు నిన్ను నాకొఱకు నియుక్తపరచుగాక.

ఈ విధముగా వధూవరులు ప్రతిజ్ఞలు (ప్రమాణములు) గైకొను వాక్యము లనేకము లున్నవి. ఏరు వివాహా

దినములలో మూడు రాత్రులు వేర్వేరుస్థానములందు భూమి మీద పడక వేసి బ్రహ్మచర్యవ్రత సహితముగనుండి శయనించుచుండతగును. నాల్గవదినమున గాని అప్పుడు విఘ్నము లేమయిన సంభవించినపుడు మఱియొక దినమునగాని గర్భాధాన సంస్కారమొనరింపవలయును నేటికిని అర్థము తెలియని మన పురోహితులు వివాహములలో నీగర్భాధాన మంత్రముల నేకరువు పెట్టుచునే యుందురు. వీనిని చదువ దలచినవారు యాజుష వివాహప్రయోగము మంత్రప్రశ్నము ఖం 2 మం 1 టు 6, ఖం 13-1టు9. తైత్తిరీయ బ్రా 2-4-6-15 మొదలైన ప్రమాణములను చూడదగును.

మన వర్ణాశ్రమ ధర్మములను పునరుద్ధరింప దలచువారు, శ్రుతులను గృహ్యసూత్రములను, శుశ్రుతము మొదలగు ప్రమాణగ్రంథములను త్రోసివేసి యెనిమిదేండ్ల బాలికను వివాహము చేయుటే అత్యుత్తమమని చెప్ప సాహసించుచున్నారు. వీరు చెప్పే ధర్మము సృష్ట్యాదినే, శాశ్వతముగను, నిత్యముగ నేర్పడినదని యేమాత్ర మింగిత జ్ఞానము కలవారైనను ఒప్పుకొనరు.

# గృహస్థాశ్రమధర్మములు.

బ్రాహ్మణులను గుఱించిన ముఖ్య ధర్మములు అన్ని స్మృతులలోను ఒకే విధముగ నున్నవి. బ్రాహ్మణుడు ప్రాత కాలము సంభవించుచుండగా శాస్త్ర ప్రకారము శౌచమును, దంతధావనమును, స్నానమును చేయవలెను. వీనిలో ప్రతి స్వల్ప విషయమునకును అనేక విధు లేర్పడి యున్నవి. స్నానమైన తరువాత ఆచమనము చేసికొని శుచిత్వమును పొందవలెను. అలాగుననే మధ్యాహ్నము సాయంత్రము చేయవలెను. ఇది యంతయు దినమునకు మొదటి భాగమందు విధింప బడినది. రెండవ భాగమునందు వేదాభ్యాసము విధింప బడుచున్నది. ఈ వేదాభ్యాసము అయిదు విధములు. వేదమును స్వీకరించుట, దానియర్థము విచారించుట, అభ్యసించుట, జపము చేయుట, శిష్యులకు చెప్పుట. మూడవ కాలమందు పోష్యవర్గముయొక్క జీవనము వెదుకవలెను. నాలుగవ ఝాముమునందు స్నానమునకొఱకు మన్ను, నువ్వులు, పుష్పములు, దర్భలు మొదలైనవానిని తెచ్చుకొనవలెను. అట్లు స్నానము చేసి మూడు దోసిళ్ళ యుదకమును తిలలతో నీయవలెను. అయిదవ భాగమందు పితరులకు, దేవతలకు మనుజులకు జంతువులకు తగినట్టు హవిర్భాగము లీయవలెను. గృహస్థుడు దేవ పితృ కార్యములను చేసినపిమ్మట మిగిలిన అన్నమును తినవలెను, ఎనిమిదవ కాలములో లోక వ్యవహా

రీముల పనులమీాద పోయిన పిమ్మట తిరిగి వెలుపల సంధ్య చేయవలెను. ప్రతిరాత్రియందు ద్వితీయ తృతీయ యామములను శయనించవలెను. (దక్షస్మృతి. అ 2 శ్లో 1-68) ఇవియన్నియు నిత్యకర్మములు, ఇక నైమిత్తికకర్మములనుగుఱించియనేక విధులున్నవి. ఇప్పటి బ్రాహ్మణులు నిత్యకర్మములు చేయదలచుకొన్నయెడల, తమ భోజనము వెతుకుకొనుటకు సావకాశమే లేదు. అష్టవర్షా భవే[redacted]రి యను పరాశర స్మృతి శ్లోకము నాధారము చేసికొనదలచిన యీా సనాతన ధర్మసభ వారిలో నొక్కరును ఆస్మృతిలో చెప్పిన విషయములైన ననుసరించి నడచుట లేదు. ధర్మము లప్పటప్పటికి మారుచుండు నని పరాశరుల వారే చెప్పిరి. (శ్లో అ 1 33 అ 9 శ్లో 50) వైశ్వదేవమును చేయని వారును అతిథి సత్కారమును చేయని వారును నరకమున బడుదురు. (1-శ్లో 54, 55) వేదము, వేదార్థమెరింగి కర్మలను చేయువారే బ్రాహ్మణులు (అ 8. శ్లో 3) ఏగ్రామమున వ్రతములను వేదములను, చదువక, బ్రాహ్మణచారులు బిచ్చ మెత్తుదురో, రాజు ఆయూరివారి నందరిని దండింపవలెను. వారు దొంగలను పోలినవారికి అన్నము పెట్టినవారగుదురు. (అ1 శ్లోక 58] శూద్రులకు బ్రాహ్మణుల సేవించుటయే ధర్మము. వారు విప్రులయందు భక్తిలేక యేమిచేసినను నిష్ఫలము (అ 1. శ్లో 62) కఱ్ఱతో చేయబడిన యేనుగు, తోలుతో చేయబడిన మృగము, వేదముచదువని బ్రాహ్మణుడు, వీరు

ముప్పురు పేరు మాత్రము పొందువారు (అ 8. శ్లో 16) వేదాధ్యయనము మొదలగు కర్మలు కలవారగు క్షత్రియుని యొక్కయు వైశ్యునియొక్కయు నిండ్ల నెప్పుడు దేవ పితృ కర్మలందు బ్రాహ్మణులు భోజనము చేయవలెను. (అ11. శ్లో 12) క్షత్రియుడు పెండ్లాడిన శూద్రకన్యయందు కన్నకొడుకు పేరుమాత్రమున గోపాలుడని తెలియదగును. వాని యన్నమును బ్రాహ్మణుడు తినవచ్చును సంశయము లేదు. (అ11 శ్లో 23) వివాహ కాలమున నగ్ని సంపాదించుకొని, యాత్మారోపణముచేసి, వైశ్వదేవాదులు చేయనివాడు పరపాకని వృత్తుడనబడును. తా ననుదినమును ఉదయమున లేచి వైశ్వదేవాదులు చేసికొనియు, నితరుల యన్నము తినుటచే బ్రతుకువాడు పరపాకరతు డన బడును. ఏ విప్రుడు గృహాస్థాశ్రమమును పొంది యితరుల కన్నము పెట్టక తానే తినునో వాని నపచుడని చెప్పుదురు. ఈ ముగ్గురి యన్నము విప్రుడు తినగూడదు (అ 11 శ్లో 49) వేదములు సాంతముగ చదివిన వారు నలుగురైనను ముగ్గురైన నైకమత్యమున నిశ్చయించినది ధర్మము. ఐమత్యము నొందనివారు వేలకొలది, వచనము లుదహరించి చెప్పినను ధర్మము కాదు. సవితను తెలుపు గాయత్రి జపమును, సంధ్యోపాసనమును, అగ్ని కార్యములను, చేయక వ్యవసాయము చేసికొని బ్రతుకు వారు పేరునకుమాత్రము బ్రాహ్మణులు. ఇట్టివారు కొలది మంది కూడినను సభ యనబడదు. (అ 8. శ్లో 3,4,5) నాలుగు

వేదములను చదివిన వారును, ధర్మాది ప్రమాణజ్ఞులును, వేద
షడంగముల నెఱిగినవారును, ధర్మశాస్త్రములను చదివిన
వారును, గృహస్థాశ్రమము మొదలగు నాశ్రమము గలవారు
ను, పదుగురకు తక్కువ కాని వారు (కలసినచో) ముఖ్య సభ
యనబడును. (8. శ్లో 27) ఈ కాలములో నిట్టి ధర్మజ్ఞ
సభలేర్పడజాలవు.

వివాహముల విషయమై కొన్ని శ్లోకములు, కలియుగ
మున కేర్పడిన యీ పరాశర స్మృతిలోనే యున్నవి. పతి
దేశాంతరము వెడలి వార్త దెలియకున్న, మృతినొందిన,
సన్యసించిన, నపుంసకుడైన, పాపియైన, నీయైదాపదల యం
దును స్త్రీలకు వేరొక పతి విధియింపబడుచున్నాడు [అ4.
శ్లో 28] విద్యారణ్యుల వారి వలె నిది యుగాంతర విషయ
మని తప్పించుకొన జాలుదురా? ఏ స్త్రీ పెనిమిటి మృతి నొం
దిన మరల వివాహమాడక బ్రహ్మచర్యము చేయునో ఆ స్త్రీ
మృతినొంది బ్రహ్మచారులవలె స్వర్గము చెందుచున్నది.
(అ 4 శ్లో 29) మనుష్యునియందు మూడుకోట్ల యేబది
లక్షలు రోమము లుండును. పెనిమిటి చనిపోయినపుడు
సహగమనము చేసిన స్త్రీ యన్నివేల సంవత్సరములు స్వర్గ
మున నివసించును. (అ 4 శ్లో 30) పాములవాడు బలిమిని
కలుగునుండి పామును పైకిలాగురీతిని, అనుగమన మొనర్చిన
స్త్రీ భర్తను పాపముక్తునిచేసి, వానితో గూడ నానందము
నొందును (అ 4 శ్లో 31)

ఈపరాశర స్మృతిలోనే కన్యకు 12 యేండ్ల లోపున వివాహము చేయవలసినదని యున్నదికదా! (అ 7 శ్లో 4 టు 8) మొదటిదానివిషయమై విదేశప్రభుత్వమువారు జోక్యము పుచ్చుకొన్నపుడు నోరుమూసికొని యూరకుండి, రెండవదాని విషయమై మన విద్యార్థికులు ప్రతిఘటించి నాలోచించి, చట్టము చేయదలచినపుడు అడ్డు దగులుటకు కారణమేమి? ఈ రెండును మత సంబంధమయిన ధర్మములే. ఒకస్మృతినిబట్టినే యీ కలియుగములో విధిగా నాచరించతగినవే ఒకటి ఐచ్ఛికము, రెండవది నిర్బంధమని వాదించవచ్చును గాని విదేశ ప్రభువుల జోక్యము మతములో జరుగకుండ లేదుగదా!

ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము, మన మత ధర్మములు సృష్ట్యాదిని కల్పింపబడి నిత్యములని యీనాఁటి శాస్త్రి మనభవారు చెప్పుట మిక్కిలి సాహసమనియు శ్రుతిస్మృతులలోని విషయములను తెలిసినవారు వానిని మరుగుపరచుట, తెలియనివారు మౌనము దాల్చక సభలకెక్కి తమ వాగ్జాలమును కనుపరచుట, ప్రజలను నిజముగా మోసము చేయుటకే యనియు నిర్ధారణ చేయవలెననియే. ఎక్కడ నెప్పుడిట్టి సభలు చేయబడునో ఆ సభాసదులు స్మృతుల ననుసరించుట, శూద్రులేగాని బ్రాహ్మణులు కారని మనము ఘంటాపథముగ నిర్ణయింపగలము. ఇంతమాత్రము సత్యము చెప్పుట చేత వారిని న్యూనత పరచినవారము కాము. ఈ కాలములో నెవరును, తాను స్మృతులనుబట్టి సద్బ్రాహ్మణుడనని కాని

నవైశ్యుడనని కాని క్షత్రియుడనని గాని, నచ్ఛూద్రుడ
నని గాని చెప్పకొనలేదు. మన సంప్రదాయములను బట్టియు
ఆచారములను బట్టియు వర్ణ సాంకర్యమును బయటకు ఒప్పకొ
నజాలకున్నాముగాని, భారతములోనే చెప్పబడిన వర్ణసాంకర్య
మను యాశ్వరోద్దేశమును ఎదుర్కొనుట కెతమాత్రము
వీలులేదు. మన మందరము క్రమక్రమముగా శ్రుతులకా
లములో నున్న కొన్నియాచారముల నవలంబించి, సివిలు
మేరేజి ఆక్టుక్రింద వివాహములం జరిపించుకొన తప్పదు.
ఇంకను కొంతకాలము మనలో కొందరు తాము నిజముగా
గుణ కర్మలవలన శూద్రులైనను, యథాశక్తి సహగమనమని
ఒక వెంద్రుకముక్కను పెనిమిటి చితిమీద పార వేసిన విధంతు
వువలె, వచ్చియురాని అర్థము తెలియని రెండు సంధ్యావం
దనపు ముక్కలప్పుడప్పు డేకరువు పెట్టుచు, గుజ్జు
పోయి డొల్లగా యేర్పడిన కర్మకాండలో కొద్దిభాగమును
నర్థము తెలియని శూరలచేత చేయించుకొనుచు కాలము
గడపెదరు. కాని యిట్టి లోకవంచకులను, స్వవంచకులను
సదా బయటపెట్టి సత్యమును వెల్లడించుట మన యాధునిక
విద్యాధికుల ధర్మము.

పండిత మాలవ్యాగారు వర్ణములను గురించి తెలి
పిన యభిప్రాయముతో నేనేకీభవింపను. పురుషసూక్తము
లోని వాక్యములను బట్టి వర్ణములలో న్యూనాధిక్యములు
లేవు. వృత్తులను బట్టి యేమనుష్యుడైనను పైవర్ణములో
గాని క్రిందివర్ణములోగాని చేరుచుండును.

# బ్రాహ్మణ పండిత సమావేశములు.

28-3-29 తేదీని వెలువడిన యాంధ్రపత్రికలో నా సోదరులు హరి నాగభూషణంగారును, రాళ్లబండి రామచంద్రయ్యగారును సంఘసంస్కరణ ప్రియులు చేయుచుండు వాదములను ఖండించుటకై బ్రహ్మశ్రీ వల్లూరి రామకృష్ణ విద్వచ్ఛయినులవంటి మహాపండితుల యాధిపత్యమున ప్రతిచోటను సంఘములు స్థాపించి కాశీమహాసభా తీర్మానములను సర్వహించవలెనని యుద్బోధించిరి. ఈ కాశీసభవారి తీర్మానముల నామోదించక వేరుగ ననేక పండితవర్యులు ఆ నగరములోనే సమావేశమై వానిని ఖండించినట్లు మనము వార్తాపత్రికలలో చదివియున్నాము. కాబట్టి వాదోపవాదములతోకూడిన యిట్టి బ్రాహ్మణ సభలకంటె యిరుపక్షములవారి వాదములను జనసామాన్యమునకు బోధపడునట్లు తేటతెల్లముగ ఆంధ్రములో వ్రాసి యచ్చొత్తించుచుండిన బాగుగనుండును. ప్రజలకు తెలియని సంస్కృతభాషలోని విషయములను తెలుగుభాషలో వ్రాసి వ్యాఖ్యానము చేసినయెడల ప్రజలే వాని సత్యాసత్యములను, బలాబలములను విమర్శించుకొనగలరు. ఇట్టి సాంఘిక విషయములలో మహాపండితుల యభిప్రాయములనైనను మూఢవిశ్వాసముతో నెవరును నమ్మజాలరు. ప్రజలకీ విషయములలో ప్రవేశము లేనిది విమర్శన జ్ఞానమెట్లు

అలవడును? ఒకానొక కాలమందు యూరపుఖండములో మత గ్రంథములు లాటిన్ భాషలోనుండి కర్మకాండయంతయు లాటిన్ భాషలోనే పురోహితులు జరుపుచుండిరి ఆమతగ్రంథములు దేశభాషలలోనికి తర్జుమా కాగానే ప్రజలలో విమర్శజ్ఞానము బయలుదేరినది

కాశీలో పండితసభ సమావేశము కాగానే శ్రుతులను మాత్రమే ప్రమాణములుగ తీసికొని వాదింపవలయునని కొందరు మఠాధిపతులను కోరగా శ్రుతి స్మృతి పురాణేతిహాసములు నానిమీది భాష్యములన్నియు ప్రమాణములే యని పూర్వాచారపరాయణులు చెప్పుటచే మొదటివారు సభనుండి వెడలిపోయి ప్రత్యేకసభ నేర్పాటుచేసికొని తీర్మానములను చేసిరి. కాబట్టి యిట్టి సాంఘిక విషయములలో సంస్కృత భాషాజ్ఞానము, వేదలక్షణ, తెలియకపోయినను మావంటివారికి విచక్షణజ్ఞానము లేకపోలేదు గాన ఆంధ్రములో గ్రంథరూపకముగ వీరి వాదములను వ్రాసి అచ్చొత్తించుట ప్రజోపయోగకరముగాని యీ మహాపండితుల గంభీరోపన్యాసములు, పాండిత్యప్రకర్షణలవలన, సంఘోద్ధరణమునకెట్టి ప్రయోజనము కలుగదు.

సాంఘిక శాస్త్రము, పరిణామ సూత్రములను బట్టి కాలానుసారముగ మార్పులు చెందుచుండును. అయిదువేలేండ్లకు పూర్వమందున్న యాచారములు, ప్రళయకాలము వరకు స్థిరముగా నిలిచియుండవలెనను వాదమును, ఆధునిక

విద్యాధురీణులు అంగీకరింపరు. శ్రుతులే, పౌరుషేయములని భావించు హైందవులనేకు లున్నారు. వానిని అపౌరుషేయములని అంగీకరించువారిలోకూడ, స్మృతులు, పురాణములు మొదలగునవి, ఆయాకాలములలోని, సాంఘికాచారములను తెలుపుచున్నవే కాని, ప్రమాణములుగ నొప్పుకొనకూడదని వాదించు పండితు లనేకులున్నారు. స్మృతికంటె శృతి యొక్కడు ప్రమాణమని యంగీకరించిన యెడల, మన రామకృష్ణ చయినులుగారు అట్టి శ్రుతివాక్యములకు క్రోడీకరించి ఆంధ్రటీకాతాత్పర్యములతో వ్రాసిన యెడల, ప్రజలకు మిక్కిలియుపయోగకరముగా నుండును. రెండవపక్షమువారుకూడ అట్లేచేసిన యెడల, మేమందరము సత్యాసత్యములను గ్రహింపగలము. ఇదియొక బ్రహ్మవిద్యకాదు. ఎప్పుడెట్టి యాచారములు శాస్త్రసమ్మతములై ఆచరణలో నుండెనో, అవి కాలక్రమముగ నెట్లు మారెనో యేలమారెనో, ఈకాలములో వానిని మార్పుటకవకాశము లున్నవో లేవో, ఉన్నయెడల, వేనిని ప్రజాక్షేమమునకు అవసరముగ ప్రవేశపెట్టవలెనో మన మందరము ఆలోచించుకొనగలము. ఈసాంఘికవిషయములలో, ప్రజలు శ్రుతులనుచూచి, హేతువాదములను, దేశకాలపాత్రాదులను గమనించి నడచుకొందురుగాని, మతచర్యలలోవలె మహాపండితుల వాగ్వాదములయందు మూఢవిశ్వాసము కలిగి ప్రవర్తించకోరు. సాంఘిక పరిణామశాస్త్రము [ Evolutionary Sociology] హేతుపూర్వకము

గాని మత సంప్రదాయములను [Dogmatic theology] ప్రపంచములో జీవించదలచుకొన్న వ్యక్తిసంఘము త్రోసి పుచ్చకమానదు.

ఈ సనాతన ధర్మసభల యార్భాటమంతయు, శారదా బిల్లుమీద ధ్వజమెత్తుటకని యెల్లరెరిగిన విషయమే మన యాడపిల్లలకు 8 సంవత్సరములకు బదులు, 12 సంవత్సరముల వరకుంచినను తగినవరులు, ఎంతసొమ్మిచ్చినను దొరకుట లేదు. కాబట్టి యీ కాశీసభవారితీర్మానమును మన బ్రాహ్మణసంఘమిదివరకే త్రోసివేసినారు. వారి తీర్మానము ప్రకారమీ పిల్లలందరు రజస్వలలే. వీరి నిషేకము 16 సంవత్సరములు గడచిన తరువాతగాని చేయకూడదని మనచరకము, సుశ్రుతము మొదలగు శారీరక శాస్త్రములు ఘోషించుచున్నవి. వివాహములుకూడ 16 సంవత్సరముల యీడుననే, ఆడపిల్లలకు చేసినయెడల కొన్ని యిబ్బందులు తటస్థించునని కొందరు భయపడుచున్నారు శరీరారోగ్యము ప్రధానమైనపుడు, అట్టి యిబ్బందుల ననుభవించవలసినదే. మనము యే సామాజిక వ్యవస్థను తీసికొన్నను, కొన్ని కీడులు కనపడుచునే యున్నవి కాని సంఘము ఆరోగ్యదశలో జీవించవలెనన్నను, స్త్రీలకు, పురుషులకువలెనే, విద్యాస్వాతంత్ర్యముల నొసగవలెనన్నను, స్వరాజ్యప్రాప్తికి మనస్త్రీల సహాయ ముండవలెనన్నను, రజస్వలానంతర వివాహములు, వితంతు వివాహములు, వివాహమోక్షము, మొదలగు హక్కులు వారికీయక

తప్పదు. ఇట్లే అస్పృశ్యత, దేవాలయ ప్రవేశ నిరాకరణము మొదలగునవి తొలగించవలసియున్నది. వర్ణాశ్రమధర్మములు కర్మకాండలు బ్రాహ్మణులలోనే కొనయూపిరితో నున్నవి. స్మృతులనుబట్టియే యీ పూర్వాచారాందోళనపరులు బ్రాహ్మణులే కారని నేను ఋజువు చేయగలను. కాని, వీ రితర వర్ణములవారితో బహిరంగముగ కలియుటకు కొన్ని యలవాటులు, సంప్రదాయములు భోజన విధానములు మొదలగునవి కొద్దియాటంకములు కొన్ని యున్నవి అవియు శీఘ్రకాలములోనే యంతరించును. యుగధర్మ ప్రవాహమున కెదురీదుటకు ప్రయత్నించుట నిష్ఫలము.



# వేదకాలపు వివాహములు.

---

శరీరమనోదార్ఢ్యములు గలిగి, ఆధ్యాత్మిక నైతికవిషయములలో నుత్కృష్టులైన సంతానము కలుగుటకు వేదములు, బ్రహ్మచర్య గృహస్థాశ్రమవిధులను చక్కగ బోధించుచున్నవి వేదములలోని వివాహప్రకరణముయొక్క ముఖ్యోద్దేశము, ఇంద్రియలోలత్వముతో నూరక పిల్లలను కనుటగాక సాంఘిక పరిణామసూత్రముల ననుసరించి ఋషులవంటి సంతానమును బడయుట కని స్పష్టమగుచున్నది కాబట్టి అట్టియాధ్యాత్మికా దర్శముతో కూడిన వివాహసంబంధములోనికి దిగకమునుపు స్త్రీయును, పురుషుడును, వేదములో చెప్పబడిన గృహస్థాశ్రమవిధులను ముందుగా తెలిసికొని సిద్ధపడియుండవలెను. వానిని శ్రుతులలోనే వెదకవలెను శ్రుతులలో చెప్పబడని విషయములలో స్మృతులను, ఆయా దేశముల లోని సంప్రదాయములను, ఆయా కుటుంబములలోని యాచారములనుకూడ పరిశీలింప వచ్చును. కాని, వేదమే యీ విషయములలో ముఖ్యప్రమాణము స్మృతులు సమయాచారములను తెలుపుచుండును గనుక శ్రుతులలో చెప్పబడని విషయములను గురించిమాత్రమే, వానిలో చూడవచ్చును. ఈ స్మృతులైనను, తాము ప్రతిపాదించు సూత్రములును, ఆభాగములును, మనకిప్పుడు లభించని కొన్ని శ్రుతులమీద

నాధారపడియుండెనని మన పూర్వసాంప్రదాయికులు వాని నన్నిటిని శ్రుతులకు వ్యతిరేకమైనను, సమర్థింపజూచెదరు. నిజ మేమన స్మృతులలోచెప్పిన కొన్నియాచారములు దేశ కాలభేదములనుబట్టి యేర్పడుచు అనేకవిధములుగ మారు చుండెనని, వానిని జాగ్రతగ చదివినవారు తెలిసికొనకపోరు. వానిలోని యాచారకాండ, ప్రాయశ్చిత్తకాండ, వ్యవహార కాండలు, ఇప్పు డెంతమాత్రము అమలులో లేవు వానిని పునరుద్ధరించుట అసాధ్యము. కాబట్టి యిప్పటివర్ణములు వివా హనిబంధనలు (శ్రుతులకు వ్యతిరేకముగా నున్నయెడల వానిని గురించి దర్విలాను స్మృతి చెప్పినను, త్రోసి వేయవలసినదే.

వేదములోని వివాహనిబంధనలను తెలిసికొనుటకు వివా హకాలమందు చెప్పబడు వేదమంత్రముల యర్థమును మన మగ్రహింపవలెను. వానిలో కొన్నిటిని దిఙ్మాత్రముగ చూపించెదను.

1 వివాహమునకు పూర్వము వరుడు వధువును చూచు నపుడు చెప్పు మంత్రము.

గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయాపత్యా జరదష్టిర్యథాసః భగో అర్యమా సవితా పురంధి ర్మ హ్యంత్వాదుర్గార్హపత్యాయ దేవాః (తైత్తిరీయ ఏకా గ్నికాండ. 1-3-3)

అర్థము — ఏరీతిగా భర్తనైన నాతోసహా, ముసలి తనముయొక్క ప్రాప్తియగునో ఆరీతిగ నీయొక్క హస్తమును మంచి సంతానముకొరకు పట్టుకొనుచున్నాను. గొప్ప బుద్ధికలిగిన యింద్రుడు సూర్యుడు ఈశ్వరుడు మొదలగు దేవతలు నాకొరకు నిన్ను గృహయజమానిని వగుట కిచ్చిరి

పాణిగ్రహణ సమయమందు పై మంత్రము చెప్పబడి వివాహముయొక్క మూలోద్దేశమును స్పష్టపరుచుచున్నది.

2 వీరసూ రేవ కామాస్యో నాశం నోభవ (ఋగ్వే 85-45)

అర్థము—పరాక్రమవంతులయిన పుత్రులను కనిన దానవై, దేవతలపూజయం దాసక్తి కలదానవై మానుఖమునుగురించి స్థానమయినదాన వగుము.

3 సప్తపది జరిగినపుడు వరుడు వధువుతో నీక్రింది వాక్యములను చెప్పుచున్నాడు.

సఖాసప్తపదాభవ, సఖా యోసప్తపదాబభూవ, సఖ్యం తేగమే యం, సఖ్యాత్తే మాయోషం, సఖ్యాన్మేమాయో ష్టాః, సమయావసంకల్పావహైసంప్రియో రోచిష్ణూ సుమ నస్యమానౌ, ఇష మూర్జమభిసంవసానౌసాసం సౌమనాంసి సంవ్రతా సముచిత్తాన్యాకరమ్ (తైత్తిరీయ ఏకాగ్ని కాండ 1-3-14]

అర్థము — ఏడడుగులు వేసినదానవై స్నేహితురాలవు అగుము. ఏడడుగులువేసి స్నేహితులమైనాము. నీయొక్క స్నేహమును పొందితిని. నీస్నేహమునుండి విడువను. నా

స్నేహమునుండి విడువకుము. మంచిమనస్సు కలవారమై, మంచి ముఖవికాసము కలవారమై ప్రియమును సంకల్పించెదము. విలువగలవస్త్రములను ధరించినవారమై, మనమిద్దరము మంచి మనస్సులను, మంచివ్రతములతోకూడిన మంచి చిత్తములను, కావించుకొందము.

4 ఆనమయమందే వరుడు వధువుతో నిట్లు చెప్పుచున్నాడు.

తావేహిసంభవావసహ రేతోదధావహై పుంసేపుత్రాయవేత్తవై [జైమినీగృహ్యసూత్రము 21-3]

అర్థము-రమ్ము మనము కలిసికొందము. శుక్లమును కూడ పుత్రునికొరకు కలుపుదము. వివాహముయొక్క మొదటిదినములో జరుగు సప్తపది విధానకాలమందు, వధూవరులు సంతానము బడయుగలవారుగ నుండవలె నని యీవాక్యము స్పష్టపరుచుచున్నది

5. వధువుయొక్క తండ్రికొరికమీద వరుడు అగ్నిహోత్రము నెదుట నీమంత్రమును చదువును.

కన్యకాపితృభ్యోయతీ పతిలోక మవదీక్షామదాస్థ [తైత్తిరీయ ఏకాగ్నికాండ 1-4-4]

అర్థము-కన్యక పుట్టింటినుండి భర్తదగ్గరకు వెళ్ళినదగుచు, దీక్షను పొందదు దానిని విడుచును. [అనగా కన్యాత్వముపోయి, తన బ్రహ్మచర్యవ్రతమును విడుచును]

6. అటుతరువాత ఇంద్రుని వరు డిట్లు ప్రార్థించును

ప్రేతోముంచాతినామతఃసుబద్ధామముతస్కరత్
[తైత్తిరీయ ఏకాగ్ని కాండ 1-4-5]

అర్థము-ఈ గృహమునుండి వెళ్ళుచున్నది. భర్తగృహమునుండి వెళ్లదు అక్కడ స్థిరముగా నుండును. [ఈమంత్రమునుబట్టి వధువు వివాహముయొక్క మొదటిదినముననే భర్తయింటికి వెళ్ళదగిన వయస్సు కలదై యున్నదని స్పష్టము]

7. పైసమయమునందే, యీక్రిందివిధముగ వధువుతో చెప్పెదరు

గృహాన్గచ్ఛ గృహపత్నీయథాసో. వశినీత్వ. విదధమావదాసీ[ఋగ్వేదము 10-85-26]

అర్థము-యజమానురాలవై భర్తయొక్క గృహమును పొందుము. నీవు భర్తకు వశురాలవై యజ్ఞమంత్రములను చెప్పుచుండుము.

పైమంత్రమునుబట్టి వివాహప్రథమదినమునుండియు యజమానురాలగుటకు యౌవనస్త్రీయై యుండవలెనుగదా! ఆమె మంత్రములనుచదివి వానియర్థమును తెలిసికొనవలసి యుండును కదా! వరుడు చెప్పుమంత్రములను గ్రహించి తానుకూడ మంత్రములను చెప్పగలదై యుండవలెను గదా! ఆకాలములో పురుషులు, స్త్రీలు వివాహమునకు పూర్వమందును పరమందునుకూడ వారంతటవారే యగ్నిహోత్రాది కర్మలను చేసికొనుచుండెడివారని స్పష్టమగుచున్నది.

అపశ్యం త్వా మనసా చేకితానం తపసోజాతం
తపసోవిభూతం ఇహప్రజామిహరయిం రరాణః
ప్రజాయస్వ ప్రజయా పుత్రకామాః 11
[తైత్తిరీయ-ఏకాగ్నికాండ 1-11-1]

అర్థము-పుత్రులయందు దానశక్తి కలవాడా! తపస్సు బ్రహ్మచర్యాది కర్మలవలన లభించిన యింద్రియనిగ్రహములో పుట్టినటువంటివాన్ని, తపస్సు అను ధనముతో కూడినటువంటివాన్ని, నాహృదయమును తెలిసికొన్నటువంటివాన్ని, నిన్ను మనస్సుచేత చూచితిని. ఇక్కడ నాకు ధనమును, సంతానము నియిచ్చినవాడవై సంతానముద్వారా నీవు పుట్టుము.

13. పై వాక్యమున క్రింది విధముగ వరుడు జవాబు నిచ్చుచున్నాడు.

అపశ్యం త్వా మనసాదీధ్యానాం స్వాయాంతనూం
ఋత్వియేనాధమానాం ఉపమా ముచ్చాయువతి
ర్భూయాః ప్రజాయ స్వప్రజయా పుత్ర కామే
[తైత్తిరీయ-ఏకాగ్నికాండ 1-11-2]

అర్థము-మనస్సుచేత నిన్ను చూచినాను. పుత్రులు కోరుదానా! ప్రకాశమానమైన నాసంబంధమైన శరీరమందు ఋతుకాలమందైన గర్భమును యాచించుచు, ఊర్ధ్వభాగమందున్న నన్ను యౌవనము గల నీవు అనుభవింపుము. సంతానముద్వార పుట్టుము.

ఇక్కడ యువతిశబ్దప్రయోగము గమనింప దగినది. ఇట్టిమంత్రములే వివిధ గృహ్యసూత్రములలో ననేకము లుండుటచే, స్థాలీపులాకన్యాయముగ వానిలో కొన్నింటిని మాత్రమే పేర్కొంటిని. ఈ పైశ్రుతిప్రమాణములను బట్టి, వేదకాలములో వధూవరు లిద్దరు నింద్రియనిగ్రహమును కలిగియుండి సంపూర్ణ యౌవనవంతులై, తపస్సుచే పవిత్రభావంతులై, ఒండొరుల మనోభావములను గ్రహించినవారై సత్సంతానము కొరకు వివాహము చేసికొనుచుండిరట్లు స్పష్టమగుచున్నది ఈ యున్నత స్థితినుండి ద్విజులు స్మృతికాలమునాటికి నెట్లుజారి పడిరో ముందు తెలిపెదను.



# స్మృతికాలమునాటి వివాహములు.

వేదకాలమునాటి వివాహములు, గృహస్థాశ్రమ విధులను బాగుగా చదువుకొని, తెలిసికొని వానిని క్రమముగా నెరవేర్పజాలిన యౌవన స్త్రీపురుషుల మధ్యనే జరుగుచుండెడి వనిదివరకు ప్రమాణములను కనుపరచి యుంటిని. మీమాంసకారులగు జైమిని, బాదరాయణుల వారి సూత్రముల ననుసరించియే, వేదమంత్రముల నన్నిటి అర్థము చేయక తప్పదు దరిమిలాను వ్రాయబడిన స్మృతులు వేదములలోని యాదర్శములకు కొరవడిన వనుట సత్యమే వీనికి పూర్వమునం దేర్పడిన కల్పసూత్రములుకూడ, శ్రుతులలో స్త్రీలకిచ్చిన స్థానములనుండి వారిని ఒక మెట్టుదింపినవి. మన గృహ్యసూత్రములు, స్మృతిధర్మములకంటె శ్రుతిధర్మములకే యెక్కువ చేరువగనున్నవి. జైమినిమొదలగు సూత్రకారులు స్త్రీలు తమంతట తాము అగ్నిహోత్రక్రియలు చేసికొనకూడదనియు పెనిమిట్లతో కూడుకొని వేదమంత్రంబుల నుచ్చరింపవచ్చు ననియు వ్రాసిరి తరువాత వచ్చిన మనుస్మృతి, స్త్రీలహక్కులనింకను తగ్గించినది. వారికి వివాహమువిధిగా నిర్ణయించినది పూర్వమందుండిన జీవితకాలపు బ్రహ్మచర్యమును రద్దుపరచినది. ఈకారణముచేత స్త్రీలవిద్య యడుగంటినది. ఇప్పటి పసిపిల్లలకు గృహస్థాశ్రమవిధులే తెలియవు. రజస్వ

లాత్పూర్వముననే వివాహములు జరిపించవలెననియు, సరియైన వరుడు దొరకనపుడు మాత్రము, వివాహ మాపవచ్చుననియు, తలిదండ్రులు తమపిల్లల రజస్వలాత్పూర్వమునను దరిమిలాను కూడ మూడుసంవత్సరములపాటు వారికి వివాహములు చేయని యెడల ఆ స్త్రీలు తమ యిష్టమువచ్చిన వరులను వివాహము చేసికొనవచ్చుననియు మనుస్మృతిలో నున్నది. పరాశరులవారు పదిసంవత్సరముల లోపుగానే స్త్రీకి వివాహము చేయనియెడల ఆమె శూద్రురాలగుచున్నదనియు, బ్రాహ్మణుడామెను వివాహము చేసికొనకూడదనియు నిషేధించిరి

పూర్వము స్త్రీలు వేదమంత్రములను చదువుకొని ప్రసిద్ధిపడసి యుండగా, విద్యావిహీనలై, వారు మూడువేలయేండ్లనుండి పశుసమానలుగ నున్నపుడు, స్మృతులిట్టి దుష్టాచారములను లిఖించుటలో నాశ్చర్యమేమి? ఆ కాలమునాటి కవియే వారికన్నులకు గోచరించుచుండెను. వానిని నిలబెట్టుటకే వారు ప్రయత్నించిరి అప్పటినుండియు మన సాంఘిక పతన మారంభించినది. ఐకమత్యము లేక, అన్యదేశీయులకు బానిసల మైపోతిమి.

ఆపస్తంబులవారు తమసూత్రకాలమును గురించి వ్రాయుచు వేదర్షులకాల మంతరించెనని తమ విచారమును వెలిబుచ్చిరి.

"ఋషయో౽నరేషుII:జాయంతే" (ఆపస్తం 1-5-4)"

జనకమహారాజున కనేకమంది ఋషు లుపదేశించి యున్నారని యాజ్ఞవల్క్యులవారు చెప్పను వారందరికిని ఉత్తమమైన తల్లులు తండ్రులు, గురువులుండిరని వక్కాణించిరి. (బృహదారణ్యక 4-1-2) శ్రీమధ్వాచార్యులవారు, వ్యోమసంహితనుండి, తమ బ్రహ్మసూత్రములలో నీ శ్లోకము నెత్తి వ్రాసిరి.

"ఆహుర్యప్యుత్తమ స్త్రీణా మధికారం తువైదికే
యథోర్వశీ యమీచైవ శచ్యాద్యాస్తు తథాపరాః"

అర్థము:—ఊర్వశి, యమి, శచి మొదలగు దేవతా స్త్రీలకును మంచి గుణములుగల యితరస్త్రీలకును వైదికధర్మములయం దధికారముగలదు. ఇతర అనుపదములో మైత్రేయి గార్గి, ద్రౌపది, మొదలగువారు చేరియున్నట్లు భారత తాత్పర్యనిర్ణయమును గ్రంథములో నీ క్రిందివిధముగ చెప్పబడినది.

"వేదా అప్యుత్తమ స్త్రీభిః కృష్ణాద్యాభిరివాఖిలాః
దేవ్యోముని స్త్రియ శ్చైవ నరాదికులజా అపి॥
ఉత్తమా ఇతివిజ్ఞేయా॥ (37-38)

అర్థము:—ద్రౌపది మున్నగు స్త్రీలవలె నుత్తమస్త్రీల చేతను సమస్త వేదములు పఠనీయములు. ఉత్తమ స్త్రీలనగ దేవతాస్త్రీలు, ఋషి స్త్రీలు, సత్కులములో పుట్టిన మనుష్య స్త్రీలు.

మాధవాచార్యులవారుకూడ తమ పరాశరస్మృతి వ్యాఖ్యానములో హారీత యమస్మృతులలోనుండి కొన్ని వాక్యముల నుదహరించుచు పూర్వకాలమందు స్త్రీలుకూడ వేదములు చదువుచు బ్రహ్మచారిణులయి బ్రహ్మవాదినులయి యితరులకు బ్రహ్మవిద్యను చేర్పినవారుగా నుండిరని వ్రాసిరి. విద్యలేనిస్త్రీ స్వగౌరవము నశించి స్వసంరక్షణము చేసికొనజాలనపుడు బాల్యములోనే వివాహితగాక తప్పదు. వీనిని బట్టియే బాలురకుకూడ వివాహములు చేయవలసివచ్చెను. ఈ బాల్యవివాహములవలననే పూర్వపు వంగసముద్రార్ఘ్యము క్షీణించుటకు మొదలుపెట్టినది తిరిగి మన బాలురు బాలికలు పూర్వపు బ్రహ్మచర్యము నవలంబించవలెను. ఈవిషయములో స్మృతులలోని యాచారముల నీకాలములో నెంతమాత్రము పాటింపతగదు. ఆపస్తంబులవారు తమ ధర్మసూత్రములలో నిట్లు చెప్పిరి.

"నియమేషుతపశ్శబ్దః। తదతిక్రమే విద్యా ర్మనిస్రవతి బ్రహ్మసహాపత్యాదే తస్మాత్ । కర్తృపత్య మనాయ వ్యంచ తస్మాద్రుషయోఽవరేషు న జాయంతేనియమాతిక్రమాత్ శ్రుతర్షి యస్తు భవంతి కేచిత్కర్మఫల శేషేణ పునస్సంభవేయథా శ్వేతకేతుః। యత్కించసమాహితో బ్రహ్మప్యాచార్యాదుపయుంక్తే। బ్రహ్మవదేవ తస్మిన్ఫలంభవతి। అథోయత్కించ మనసా వాచా చక్షుషావా సంకల్పయన్ ధ్యాయత్యాహాభివిపశ్యతి వా తథైవ తద్భవతీత్యుపదిశంతి" (ఆపస్తంబ 1-5-1, 8)

అర్థము—బ్రహ్మచారి ప్రకరణములో చెప్పబడిన ధర్మములందు తపశ్శబ్దము వర్తించును. ఆతపస్సును చేయని యెడల సంతానముతోకూడిన యీధర్మమును చేయనిపురుషునియొద్దనుండి జ్ఞానసాధనమైన వేదము తొలగుచున్నది. శ్వభ్రమను నరకమున్ను ఆయుర్దాయక్షయమున్ను సంభవించును. ఇందువలన భవిష్యత్ జ్ఞానముగల మునులు కలియుగకాలములందు పుట్టరు. ఎందుచేతననగా, కలియుగములో ధర్మభ్రంశము, తప్పనిసరిగా సంభవించును. కొంతమంది పూర్వజన్మమందైన మంచికర్మచేత పునర్జన్మము సంప్రాప్తమైనపుడు, శ్వేతకేతువలె పొందబడిన వేదముకలవారగుచున్నారు. వేదభిన్నమంత్రమైనను నియతచిత్తముగలవారై గురునియొద్దనుండి ఉపదేశమును పొందినయెడల వేదమందువలెనే, ఆ మంత్రమందును ఫలము దొరకును. తరువాత దేనినైనను మనస్సుతోగాని నేత్రముతోగాని సంకల్పించి ధ్యానించునో, చెప్పునో, చూచునో, అది ఆరీతిగనే యగునని చెప్పుదురు.

పైని చెప్పిన విధానమును ఆధునిక విద్యాసముపార్జనమందు వినియోగించుచో శరీరమనోదార్ఢ్యములు గల స్త్రీపురుషులు బయలుదేరెదరు, హారీతస్మృతిలో ఈ విషయమునుగురించి యెట్లు వ్రాయబడినదో చూడుడు.

„ నశూద్రసమాః స్త్రియః। నహిశూద్రయోనౌ బ్రాహ్మణక్షత్రియవైశ్యాజాయంతే, తస్మాచ్ఛందసా స్త్రియస్సంస్కార్యాః తాసాం ద్వివిధోవికల్పః। బ్రహ్మవా

దిన్యః సద్యోద్వాహాశ్చేతి బ్రహ్మవాదినీనా ముపనయన మగ్నిసంస్కారః। స్వగృహేఽధ్యయనం భైక్షచర్యాచ ప్రాప్తేరజసస్సమావర్తనం' అతిరిక్తేప్రధానం। సద్యోపద్య ననంవాతానా ః॥ హారీత 21_20టు23

అర్థము—స్త్రీలు శూద్రసమానలుకారు, ఏకారణ మువలన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యస్త్రీలు శూద్ర స్త్రీ యోనియందు పుట్టరో ఆకారణముచేత స్వాభిప్రాయాను సారముగ స్త్రీలు సంస్కరింప తగినవారు ఆస్త్రీలు రెండు విధములు (1) వివాహముకానిన యోగినీస్త్రీలు (2) వేదా ధ్యయనమైన వెంటనే వివాహము చేసికొనువారు యోగినీ స్త్రీలకు ఉపనయనము వైశ్వదేవము మొదలగుఅగ్నికిృయలు, స్వగృహమందు చదువుకొనుట, భిక్షాటనము జేయుట, యుండును. వారు రజస్వల లయినపుడు స్నానముచేయుటచే శుద్ధు రాండ్రగుచుందురు.

ఈహారీతులవారు తమకాలములోని యాచారములనే వ్రాసిరిగాని పూర్వకల్పములు యుగములమాట తలపెట్టనే లేదు ఈయనకూడ ఆపస్తంబులవారి కాలమునాటివారే. కాబట్టి మనమీకాలమందు అనుభవించుచున్న యధోగతి స్థితినుండి బయటకు రావలెనన్న వేదకాలమునాటి యువతీ రివివాహము స్త్రీలకుండి విద్యాస్వాతంత్ర్యములు పునగస్థ ంపవలసి యుండును.

# హైందవ సాంఘిక పరిణామము.



ప్రస్తుతము హైందవసంఘములో పరిచారములో నున్న ఆచారములు నిత్యములు, సృష్ట్యాది నేర్పడినవి యను వర్ణాశ్రమధర్మసభలవారి వాదము, నిలువ నేరదని చూపించుట కే, ధర్మసూత్రములు, స్మృతులలోని వాక్యములను ప్రమాణములతో కనుపరచితిని గాని, వానిలో నేవి పునరుద్ధరింపబడవలెనో, యేవి యాచరణీయములో, యే యే మార్పులు మన సంఘములో చేసికొనదగునో నేనిక్కడ చర్చింపబూనలేదు. వర్ణధర్మములును, ఆశ్రమధర్మములును, అనేకవిధములైన మార్పులు కాలానుసారముగ పొందుచుండెననియు, అటులనే, సంఘాచారములలో మార్పులు చేసికొనుచుండుట వలన, మన స్వర్గమోక్షముల కెట్టియభ్యంతరములు కలుగవనియు చూపించుటకు మాత్రమే పూర్వపు ఆర్యధర్మములను కొద్దిగా కనుపరచితిని. సాంఘిక పరిణామ శాస్త్రమునందభినివేశము గలవారు, మూలగ్రంధములను పూర్తిగ పరిశీలించి, యింతకంటె విపులముగ వెనుకటి సాంఘికచరిత్రను ప్రజల యెదుట పెట్టవలెనని ప్రార్థించుచున్నాను. మనకు వంశపారంపర్యముగ వచ్చుచున్న సంప్రదాయములను జనసామాన్యము చేత సులభముగ శీఘ్రకాలములో మార్చుకొన

జేయులేకపోయినను, సత్యమును వెల్లడిచేయుట మనవిధి. సత్యముం కంటె నుత్కృష్టధర్మము మరియొకటి లేదు. పూర్వనాగరికతా పరాయణులు కూడ, ఆయాయుగములలో ధర్మములు మారుచుండెనని ఒప్పుకొనక విధిలేదు.

ఒకసారి మునులందరు, వ్యాసమహర్షి యొద్దకు జని, కలియుగ ధర్మములను వివరించవలసినదని యడుగగా, ఆయన తన తండ్రియైన పరాశరులవారి యొద్దకు వారిని తీసికొని వెళ్ళెను, అసినరకు మనువు, వసిష్ఠుడు, కాశ్యపుడు గార్గ్యుడు, గౌతముడు, ఉశనసుడు, అత్రి, విష్ణువు సంవర్తుడు, దక్షుడు, అంగిరసుడు, శాతాతపుడు, హారీతుడు, యాజ్ఞవల్క్యుడు, ఆపస్తంబుడు, శంఖుడు, లిఖితుడు, కాత్యాయనుడు, ప్రచేతుడును చెప్పిన ధర్మములను వింటినవియు, కృతయుగ ధర్మములు కలియుగములో నశింపసాగినవి గనుక ప్రస్తుతధర్మములను వివరింపుడనియు ప్రార్థించెనట. (పరాశరస్మృతి. అ 1 శ్లో 4 — 17) కృతయుగమున మను ధర్మములును త్రేతాయుగమున గౌతమ ధర్మములును, ద్వాపరమున శంఖలిఖితధర్మములును, కలియుగమున పరాశరధర్మములు ననుష్ఠింప బడునవనియు, ఆయా యుగంబుల మారుచుండెడి ధర్మములు కాలవశత ననుష్ఠించు నప్పటప్పటి ద్విజులు నింద్యులు కారనియు పరాశరులవారు చెప్పిరట. (పరాశరస్మృతి అ 1 శ్లో 24, 33) ఈయన తరువాత వచ్చిన వృద్ధపరాశరులవారు పూర్వమందు శిష్టాచారములుగ నుండినను, కలియుగంబులో

విసర్జింప వలసిన విషయములు ప్రత్యేకముగ నుదహరించిరి. దీనిని బట్టి కూడ సాంఘికధర్మములు మారుచుండినట్లు స్పష్టమగుచున్నది.

వృద్ధ పరాశరులవారి యొద్దకు మనువు, సంవర్తుడు,హారీతుడు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు వచ్చి కలియుగమందు విడువదగిన యాచారములను వివరించవలసినదని ఆయనను ప్రార్థించిరట అప్పుడే వృద్ధపరాశరుల వారిచేత విసర్జింపబడిన యాచారములు కలియుగములో నిషేధింపబడినవని చెప్పిరి.—1. ద్విజులు సవర్ణముకాని కన్యలను వివాహము చేసికొనుట. 2. మరదివలన కొడుకును గనుట 3 మధుపర్కకాలమందు పశువులను చంపుట. 4 శ్రాద్ధమునందు మాంసము నిచ్చుట. 5 వానప్రస్థాశ్రమ గ్రహణము. 6. ప్రతిగ్రహింపబడిన కన్యను, తిరిగిదానము చేయుట 7 సముద్రయానము నంగీకరించుట. 8. గోమేధము. 9 సత్త్రయాగము. 10 జలపాత్రధారణము. 11. నరమేధము. 12 అశ్వమేధము. 13 క్షతయోనికి పునర్వివాహము. 14 వరుడు అతిథి పితరులకొరకు ఆహారార్థముగ పశుహింసచేయుట. 15. ద్విజులకు శూద్రాదులచేతివంట. 16. పరభార్యా పరిగ్రహణము. 17. యతికి సర్వవర్ణముల వారును భిక్షచేయుట. 18. సన్యాసము. 19. ఔరసుడు దత్తుడుగాక యితరపుత్త్రులను స్వీకరించుట. భిన్నజాతులనుండి పుత్రస్వీకారము మొదలైనవి. (వృద్ధపరాశరస్మృతి శ్లో 6 మొ॥ 27) రజస్వలా

నంతరవివాహముల నీవృద్ధ పరాశరస్మృతి యొప్పుకొనకుండుట ఆశ్చర్యము కాదు.

రజసో దర్శనాత్పూర్వం కన్యాదాన నిషేధకం
కలౌయుగేన కుర్వీతే, త్యేవంవై బ్రహ్మశాసనం॥ శ్లో॥ 38

రజస్వల అగుటకుముందు దానముచేయకూడదను నాచారము కలియుగమునందు కూడదు. ఇది బ్రహ్మాజ్ఞ ప్రసిద్ధము. ఇది యుంగాంతరవిషయమనియైనను ఒప్పుకొనిరిగదా.

కాబట్టి లియుగమందు విడిచిపెట్టదగిన యాచారములను మాత్ర ముదహరించిన యీస్మృతినిబట్టి అవియన్నియు పూర్వమొకప్పుడున్నవనియే స్పష్టమగుచున్నది పూర్వశాస్త్రవిధుల నన్నిటిని సమన్వయము చేయ ప్రయత్నించుట అసాధ్యము. హాస్యాస్పదము. సాంఘికపరిణామశాస్త్రజ్ఞునకీ వివిధాచార యోగ్యతాయోగ్యతలతో నెట్టిసంబంధము లేదు. వీనిని యాగ్యసనాతనమతముతో నెంతవరకు సంబంధించుకొనజూతురో ఆవిషయము ప్రజలకు వదలివేయుచున్నాను. ఈ విషయములో బూకరింపులకు, దబాయింపులకు తావులేదు. అట్టియాచారములలో కావలసినమార్పులు ప్రవేశపెట్టుకొన్న యెడల ఆర్యమతము అపాయస్థితిలోనికి వచ్చుననుట విశ్వశింపతగినమాటకాదు. విదేశీయులు మనమతాచారములలో జోక్యము కలుగజేసి కొనకూడదనుట వేరువిషయము. దీనిలో భేదాభిప్రాయము లుండవచ్చునుగాని మనవర్ణాశ్రమధర్మములలోను, ఆచారములలోను మార్పులే

లేవనిగాని, సంఘములో నే మాత్రపు మార్పులు చేసి కొన్నను పాదిత్యము వచ్చునని గాని, వాదించుట మిక్కిలి సాహసము శాస్త్రవిరుద్ధము.

ప్రస్తుతము మనహైందవసంఘములోని మూఢాచారము లన్నిటికిని పూర్వాచార పరాయణులు మూడువేల సంవత్సరముల క్రిందట వ్రాయబడిన గ్రంథములనుండి ప్రమాణములను కనుపరచెదరు. ఈప్రమాణములలో నెన్ని పరస్పర భేదములున్నను, వీనినన్నిటిని సమన్వయము చేయగల సమర్థులు వీరిలో కలరు. మానవకోటిలోని యితరసంఘముల చరిత్రలుగాని, వారి ప్రస్తుతాచారములుగాని, వానిలో ననుసరించతగినవి గాని, కూడనివిగాని, వీరికే మాత్రమును తెలియవు. ఆయాసంఘములలో, ఆచారముల కెట్టి పరిణామములు కలిగినవో వానిని మనవానితో పోల్చిచూచుట, సాధన బాధకము లేవి బయలుదేరునో వీరు గ్రహింపజాలరు. సాంఘికాచార పరిశీలనమే వీరికి గిట్టదు. ఈకలియుగములో మంచిచెడ్డలు రెండును ప్రతిమానవసమాజములో వృద్ధియగుచున్నవనియు, ఏసంఘముగాని లోపములులేక అనన్యప్రాయమైన పరిపూర్ణావస్థ పొందనేరదనియు వీరికి తోచదు. శాస్త్రములలో చెప్పిన నిత్యనైమిత్తిక విధులాచరించనివారు రౌరవాదినరకములలో పడుదురనియే వీరి యభిప్రాయము. అన్యమతములవారికి మోక్షము చేకూరదనియే వీరితలంపు. వీరికి మార్పు అనగనే తలకంటగింపు. ఇట్టివారి మాటలను

నవనాగరికవిద్వాంసులు పెడచెవిని పెట్టినను, వీరికి మూఢులైన జనసామాన్యముమీద ఇంకను పలుకుబడి యుండుటచేత, ప్రతిసంఘ సంస్కరణమునకు వీరిపాండిత్యము అడ్డుతగిలి, మన విదేశీయపరిపాలకులు మనమతముతో జోక్యము కలిగించు కొనుచున్నారని మాటిమాటికి వారిని, మన ప్రజాప్రతినిధులను వీరు భయపెట్టుచుందురు రాజకీయస్వాతంత్ర్యములకై ముందుకు దూకెడి మననాయకులు ప్రజలను బాధించు ఈ సామాజిక దాస్యశృంఖలములను విడగొట్టుకొనజాలకున్నారు.

ప్రతివ్యక్తియొక్క మతము, అతనికిని పరమాత్మకును సంబంధించినవిషయము. సామాజికవ్యవస్థలతోగాని రాజకీయవిషయములతో గాని నెట్టిమతమునకు నెట్టిసంబంధముండకూడదు. ప్రజల ఐకమత్యమునకుగాని వారి శరీరమానసారోగ్యములకుగాని భంగము కలిగించు మతసూత్రములను, అవి యెంత పురాతనములైనను, ఎంతపవిత్రములైనవని భావించినను, త్రోసివేయుకతప్పదు. కాబట్టి నిష్ఫలమని యెంచబడు కర్మకాండను ఎంత తగ్గించుకొన్న అంత మంచిది. ఇది నీతితోగాని, మోక్షసంపాదనతోగాని సంబంధించదని చెప్పుటకు మనకర్మభూమిలోలేని అనేకకోట్ల ప్రజలుండుటయే నిదర్శనము వారందరు దేవుని పుత్రులైనపుడు వారిని కర్మబాహ్యులుగ జేసి, నరకమునకు ఆమన పడవోయునా? ఈ భారత దేశములోనె నను, సన్యాసులకు ఈకర్మ

కాండతో పనిలేకటగాని, గృహస్థులుమాత్రము దీనిలో మునిగి తేలుచుండవలెనట! పూర్వకాలములోని వర్ణాశ్రమ ధర్మములలో ఎట్టి మార్పులు చేయకూడదట! ఏమార్పుల నైనను ప్రజాసామాన్యములో చొప్పించవలెనన్న, మన యాచారవ్యవహారము లన్నిటిలో వేదముకాలమునుండి అవి యెప్పుడెప్పు డెట్టి పరిణామము పొందినవో, యెట్లు ప్రస్తుత కర్మకాండ వృద్ధియైనదో, యేకారణములచేత ప్రస్తుతమున నది నామమాత్రావశేషముగ నున్నదో మనము బాగుగా గ్రహించి, మంత్రార్థము తెలియని మూఢపురోహితుల చేతులలో కీలుబొమ్మలమై, ఉళక్కిమాటలతో పిచ్చి పిచ్చి కర్మలను మనవా రందరేల చేయుచుండవలెనో తెలిసికొని, మన నవనాగరికపండితులు విచారించి, గ్రంథములను దేశ భాషలో వ్రాసి, ప్రచారము సలుపవలసి యున్నది.

నూతనముగా క్రొత్తమతము సృజింపనక్కర లేదు. మన వలెనే ముక్కు చెవులు గల ఒక దేవుడు (Anthropomorphic God), నరక స్వర్గములును ఉన్నవని బోధించు బ్రహ్మసమాజము విజయము నొందినదా? వేదములుమాత్రము అపౌరుషేయములనియు, వానిని శిరసావహించి వానిలోని కర్మలనుమాత్రము ఆచరింపతగుననియు బోధించు ఆర్యసమాజముమాత్రము మనలో వ్యాప్తిచెందినదా? భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించు మనవేదాంతమే మనకు శరణ్యము. ప్రపంచములోని మతసంప్రదాయము

లన్నియు మన హిందువులలో కనుపడుచునే యున్నవి కాని సమస్తనీతిసూత్రములకును మనవేదాన్తమే పునాది. మనశ్శుద్ధికొరకును, చిత్తనిరోధముకొరకును, మూడువేలేండ్లక్రిందట ప్రతిపాదింపబడిన కర్మకాండయంతయు ఈ కాలమునకు బొత్తిగా పనికిరాదనటకు దాని ప్రజోల్లంఘనమే తార్కాణము. మనవేదాంతము నిశ్చయముగా ప్రచ్ఛన్నబౌద్ధమతమే. అయినను దానివలన నష్టమేమి? ఆ రెండును నైతికసూత్రముల కన్నిటికిని సహేతుకములైన పునాదుల నంగీకరించెను. నిర్వాణమునుడు, మోక్షమునుడు, ఈ రెండును జన్మపరంపరల వలనగాని సిద్ధింపవు. క్రైస్తవ బ్రాహ్మసామాజిక మహమ్మదీయమతములు ఏకేశ్వరోపాసనను ప్రతిపాదించినంత మాత్రమున ఆధ్యాత్మిక విషయములలో మనలను తృప్తి పొందింప జాలవు. పూర్వజన్మములలోని కర్మలఫలములను మన మనుభవించవలయుననియు, దైవదూషణ భూషణములు మన కెప్పటికిని ఉపచరించవనియు, కర్మఫలక్షయ మగుటకు కర్మ భక్తి జ్ఞాన యోగములు సాధనములు మాత్రమే యనియు మనవేదాంతము బోధించుచున్నది. ఈవేదాంత సూత్రములు సులభశైలిని సామాన్యప్రజలకు కూడ బోధపడునట్లు చెప్పవలెనుగాని, పుక్కిటి పురాణములు, అభూత కల్పనలు, గాథలు, వెర్రి మొర్రి కర్మకాండలు, మొదలగు వానియందు మూఢవిశ్వాసములను ప్రబలచేయుట పాపమని నాతలంపు. కొంతవరకైనను హేతుపూర్వకముగాని నమ్మక

కములను (Dogmatic beliefs) ప్రజల మనస్సులనుండి పాఱద్రోలవలెను. కొన్ని నైతికసూత్రములను బోధించుట కేర్పడిన కల్పనాకథలను వేదవాక్యములుగా భావింప వలసినదని పసిబాలురకు కూడ చెప్పకూడదు. ఈకాలములో ప్రపంచములోని మానవసంఘములను నెత్తిమీఁద నైతికపతనమును త్రొక్కించునవి రాజకీయసాంఘిక శిక్షలేగాని నైతిక శిక్షలు కావు. కేవలము పరలోకశిక్షలు సన్మార్గమునకు ఈ నవయుగములో త్రోవ చూపజాలవు

ఒకవేళ ఇంకను కొంతకాలమువఱకు జనసామాన్యమునకు మతవిశ్వాసము లవసరమైనను, మనసంఘాభివృద్ధికి హానికరము గు మూఢాచారములు, వైదికసమ్మకములు, అతిక్లిష్టమైన కర్మకాండలు త్రోసివేయుబడునట్లు ప్రచారము సల్పుట, మన నవనాగరిక పండితుల విధి. ఒక్కసారిగ సాంఘికవిప్లవము రాకుండ, మనలను బంధించిన కొన్ని శృంఖలములను వదలించుట మిక్కిలి యవసరమని నమ్ముచున్నాను. మనలోని వర్ణములు, వివాహములు, నైతికసూత్రములు, స్త్రీ స్వాతంత్ర్యము, కర్మకాండ, శౌచాశౌచములు, దేవతలు, దయ్యములు, విదేశగమనము, అస్పృశ్యత, పంక్తి భేదము, దృష్టిభేదము, ఈమొదలగు సాంఘికవ్యవస్థల పరిణామాదులను గురించి ప్రజలలో ప్రబోధము గలుగవలెనన్న మనమతగ్రంథముల నుండియే సరియైన ప్రమాణములను కనుపరచి, వీనిలో క్రమక్రమముగ మార్పులెట్లువచ్చి

నవో, వీనిని మతముతో సంబంధించునట్లు చేయుటవలన ఎట్టి యనర్థకములు మూడుచున్నవో, స్పష్టముగ దేశభాషలలో తెలుపవలెను. మనవిదేశీయ ప్రభుత్వములో ధర్మజ్ఞసభలు లేకపోవుట వలనను, ఒకవేళ కొన్ని నెలల క్రిందట కాశీలో కూడినట్లు పండితసభల నేర్పాటుచేసి తీర్మానములు కావించినను, వాని నమలులో పెట్టుటకు మనస్వదేశ ప్రభువులు లేకపోవుట చేతను, శాసనసభ్యులు బిల్లులు ప్రవేశపెట్టుటకు జంకుట చేతను, సంఘసంస్కరణములు విరివిగ జనబాహుళ్యములో ప్రచారములోనికి వచ్చుచుండలేదు సంస్కృతాంగ్లేయ భాషలు రెంటిలోను సమర్థులై, పక్షపాతము వహించని పండితులు ఈ సాంఘికాచార విమర్శనగ్రంథములను వ్రాయవలెను. నేను సంస్కృత పండితుడను కాకపోయినను ఆంగ్లేయభాషలోని కనువదింపబడిన మన మతగ్రంథములను బట్టి మనపండితులు విమర్శించతగిన కొన్ని ముఖ్యవిషయములను సూచించుచున్నాను.

శ్రుతిస్మృతిపురాణములలో విరోధము కనబడునపుడు, పూర్వపుది తరువాతిదానికంటె బలీయమని ఆపస్తంబులవారు, జాబాలి, కల్లూకభట్టు, జైమినిమహర్షి మొదలగువారు చెప్పియున్నారు. ఋగ్వేదకాలములో నిప్పటివర్ణములు లేవు. కాని తరగతుల భేదము లున్నవి. అన్యోన్య వివాహములు, భోజన ప్రతిభోజనము లుండెను. ప్రతివర్ణము వారును వారికిష్టమైన వృత్తుల నవలంబించవచ్చును. ఆకాల

ములోకూడ మంత్రములు బాగుగా తెలిసినవారు బ్రాహ్మణులని పిలువబడి గౌరవమును పొందుచుండిరి. క్రమక్రమముగా వారి యాధ్యాత్మికజ్ఞానమువలనను, నైతికవర్తనమువలనను ఇతరవర్ణములమీద పలుకుబడి కలిగించుకొనిరి. ఇట్టి సద్గుణము లలవరుచుకొను క్రింది వర్ణములవారు బ్రాహ్మణవర్ణములోనికి తరచుగా పోవుట కలదు ధార్ష్టయను క్షత్రియవంశము బ్రాహ్మణులైనట్లు భాగవత పురాణములో చెప్పబడియున్నది గార్గ్య, తర్యారుణి, కవి, పుష్కరుణి మొదలగువారు మొదట క్షత్రియులుగా నున్నను తరువాత బ్రాహ్మణులైరి. బ్రాహ్మణుడైన భరద్వాజుని, భరతుడు తనకుమారునిగ బెంచుకొనెను క్షత్రియుడైన నాభాగుడు వైశ్యుడాయెను. దాసీపుత్రుడైన కవషుని గొప్పఋషిగా తక్కిన ఋషులందరు అంగీకరించిరి. ఆయనను కొలిచిరి వర్ణవ్యవస్థ గుణకర్మస్వభావానుసారముగ నుండుచుగాని జన్మమాత్రముబట్టి కాదని భగవద్గీతలలో స్పష్టముగా వ్రాయబడియున్నది. వ్యాసుడు బెస్తదానియందును, వసిష్ఠుడు ఊర్వశియందును, అగస్త్యుడు కుండయందును, ఋశ్యశృంగుడు లేడియందును, పరాశరుడు చండాలదానివలనను పుట్టి బ్రాహ్మణులైరి.

శ్లో॥ శూద్రో బ్రాహ్మణతా మేతి
బ్రాహ్మణ శ్చైతి శూద్రతాం,
క్షత్రియా జ్జాత మేవంతు
విద్యా ద్వైశ్యా త్తథైవచ॥

—మనుస్మృతి. అ 10,65 శ్లో

శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందును, బ్రాహ్మణుడు శూద్రత్వమును పొందును. క్షత్రియులును, వైశ్యులును నట్లే యగుదురు.

ఉత్తమగుణకర్మ స్వభావములనుబట్టి యుత్తమమైనట్టియు, నీచగుణ కర్మస్వభావములనుబట్టి నీచమైనట్టియు, వర్ణాధికారములను, కర్మలను బొందుచున్నారు.

శ్లో॥ "నవిశేషోఽస్తి వర్ణానాం
సర్వం బ్రాహ్మమిదం జగత్,
బ్రహ్మణా పూర్వసృష్టంహి
కర్మభి ర్వర్ణతాం గతమ్ ,,

—భారతము శాంతిపర్వము

వర్ణములలో విశేష మేదియు లేదు, ఈ జగత్తంతయు పూర్వకాలమునందు బ్రహ్మమయముగానే చేయబడి కర్మచేత వర్ణత్వమును పొందినది.

భారతానుశాసనికపర్వమునందు మంచిపనులు చేయుటచేత శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందుననియు, వైశ్యుడు క్షత్రియత్వము పొందుననియు, పుట్టుక,సంస్కారము, ద్విజత్వమునకు కారణములు కావనియు, మంచినడతయొక్కటియే కారణమనియు చెప్పబడియున్నది. ఈ విధముగా ఆరణ్యపర్వములో రెండుమూడు చోట్లను, భాగవత సప్తమ స్కంధమున నుదాహరింపబడెను.

పై కారణమును బట్టియే అంతర్వర్ణవివాహములు వేద కాలమునందేగాక స్మృతుల కాలములో కూడ ప్రచార ములో నున్నట్లు స్పష్టమగుచున్నది.

„అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ, ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వంపూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ „

ఆపస్తంబసూత్రము.

అధర్మచర్యచేత నగ్రవర్ణమువాడు జాతి పరివృత్తి యందు తక్కువ తక్కువ వర్ణమును పొందును; ధర్మచర్య చేత హీనవర్ణమువాడు జాతి పరివృత్తియందు పూర్వపూర్వ వర్ణమును పొందును.

శ్లో. „బ్రాహ్మణీ క్షత్రియా వైశ్యా
బ్రాహ్మణస్య ప్రకీర్తితాః,
క్షత్రియా చైవ వైశ్యాచ
క్షత్రియస్య విధీయతే:
వైశ్యాచ భార్యా వైశ్యస్య
శూద్రీ శూద్రస్య కీర్తితా „

శంఖధర్మశాస్త్రము.

బ్రాహ్మణునికి బ్రాహ్మక్షత్రియ వైశ్యజాతీయురాండ్రును, క్షత్రియునికి క్షత్రియవైశ్య జాతీయురాండ్రును, వైశ్యునకు వైశ్యజాతీయురాలును శూద్రునికి శూద్రురాలును మాత్రము భార్యలుగా నుండవలెను. ఈ వివిధ వర్ణముల

భార్యలకు పుట్టినపుత్రులు దాయమునకు సమానముగ నర్హులు. చనిపోయినవారికొరకు ఆశౌచమును పట్టవలెను. శూద్రునికి బ్రాహ్మణస్త్రీవలన కలిగిన పిల్లలే చండాలురని వాడబడిరి. కాబట్టి మన మాలమాదిగలు అస్పృశ్యులని యెంచబడకూడదు. బ్రాహ్మణులు ఒకప్పుడు మాంసమును కూడ తినుచుండిరి పూర్వకాలమందు యువతీవివాహము లున్నట్లు స్పష్టము. (ఋ.మం. 35,మం.4,6 సూ 37,మం.3, ఋ మం 5, సూ.41, మం. 7)

పరాశర, వృద్ధపరాశర స్మృతులలో కలియుగములో వర్జింపవలసినవని వ్రాసిన యాచారము లన్నియు అంతకు పూర్వ మాచరణలో నుండుటచేతనే తరువాత ఏకారణముననో నిషేధింపబడినవి దరిమిలానుపుట్టిన యాజ్ఞవల్క్య,ఔశన శంఖ, వృద్ధపరాశరస్మృతులలోకూడ శ్రాద్ధకర్మలయందు తప్పక కొన్ని జంతువుల మాంసమును బ్రాహ్మణులకు పెట్ట వలెనని వ్రాయబడి యున్నది.

పైని చెప్పినవిషయములలో మనలో నెట్టిమార్పులు కలిగినవో నేను వేరుగ చెప్పనక్కరలేదు. శ్రుతిస్మృతులలో చెప్పిన ప్రాయశ్చిత్తకాండగాని, ఆచారకాండగాని యెంత మాత్రము మన మాచరించుచుండుట లేదు. ఇదివరకు మన సంఘములో నెట్లు మార్పులు జరుగుచుండెనో యిప్పుడుకూడ మన దేశకాలపరిస్థితులనుబట్టి మన ప్రస్తుతాచారములలో మార్పుచేసికొనక తప్పదు. మన హైందవసామాజిక వ్యవస్థ

లో జనబాహుళ్యములో గొప్పమార్పులు కలిగించవలెనన్న మన శ్రుతిస్మృతులను తెలుగుచేసి, వారికి వ్యాపించిన చాలు. అప్పుడు మన సాంఘికపరిణామము ఎట్లు మారినది, ఎట్లు ముందు మారవలసినది వారికి స్పష్టమై, సంఘము నూతన మార్గములు శీఘ్రముగా తప్పక త్రొక్కగలదు



# కర్మకాండ.



ప్రతి మతములోను హేతు పూర్వకముగాని విధివాదములగు కొన్ని కర్మలు (Dogmas and ritualas.) కలసి యుండుట స్వాభావికము మతమనునది దేవుడు స్వర్గము, నరకము, దేవతలు, పాప పుణ్యములు, మరణానంతర జీవితము, ఆత్మ, మోక్షము, మొదలగు విషయములతో సంబంధించి యుండును, కాని, వివాహములు, ప్రార్థన విధానము, అంత్యకర్మలు మొదలగు సాంఘిక పద్ధతులను గురించి కొన్ని సంప్రదాయములు, ఆచారములు, ఆ యా మతములతో లీనమై యుండుట తటస్థించుచుండును. మన హిందువులలో వలెనే యితర మతముల వారిలోని విద్యార్థులు కొందరిట్టి యాచారములును, సంప్రదాయములును, హేతుపూర్వకములైనవా? కావా? తమ మతగ్రంథములలోని యితిహాసములు, చరిత్రలు, పుక్కిటిపురాణములు కల్పలా? ఆగ్రంథములలోని మత సూత్రములైనను ఒప్పుకొన తగినవా? కావా? యను విషయములను సదా చర్చించుచుందురు. ఇట్టివారిని వేదాంతులని గాని, వేదాంత జిజ్ఞాసపరులని గాని మనము పేర్కొనుచున్నాము ఆయా మతస్థులలోని జనసామాన్యము మాత్రము, తమ మతగ్రంథములనుగాని, కర్మ

లనుగాని అంత సులభముగా వదలజాలరు. వారికి వానియం దున్న నమ్మకములు శీఘ్రముగ పోక, అనేక మూఢవిశ్వాస ములు, ఆచారములు, వారిని బాధించుచు నేయుండును. వీనిని ప్రజలందరు విమర్శించుటకును, చర్చించుటకును, తప్పించుట కును, శక్తిచాలక పోవుటచేతనో లేక తీరుబాటు లేకపోవుట చేతనో, అంధప్రాయముగ ఆచరించుచుందురు.

ప్రపంచములోని మతములుగాని, వీని కన్నిటికిని పునాదులగు సామాన్య నైతిక ధర్మములు కాని, దేవుడే శాశ్వ తముగ నుండునట్లు సృష్ట్యాదియందే యేర్పరచెననుకొనుట శుద్ధపొరపాటు. అటులైనయెడల ఒండొంటితో నెట్టి సం బంధములేని యిన్నిమతములు సృజించి తన పుత్రులలో, వీని సత్యాసత్య నిర్ణయమును గురించి యుద్ధములు జరుగునట్లు చేయునా? ఆయాదేశములలోని ప్రజలు, ఒకానొకపుడు, అ నాగరికులై, అపభ్రంశమైన పనులలో మునిగియున్నప్పుడు కొందరుజ్ఞానులు బయలుదేరి తమ పూర్వసంప్రదాయము లను, ఆచారముల ననుసరించి, మతగ్రంథములను రచించి, తమ సంఘాభివృద్ధి కనువగునట్లు మతసూత్రములను, కథలను కల్పించి ప్రజలలో మతోద్బోధ కావించుటచేతను, ప్రజా సామాన్యమునకు లేని కొన్ని ప్రజ్ఞలను తాము కనబరచుట చేతను వారుచేసిన మతగ్రంథములు, దైవదత్తములని భావించు నట్లు చేయఁగలిగిరి. మన శ్రుతులు కూడనట్టివే. అవి మన పూర్వపురుషులకు దేవుని వలన వినిపింపబడినట్లు వాడుక

ప్రపంచములో నిప్పుడు వ్యాప్తినొందిన మతములు మానవ ధర్మములన్నియు, అనేక యుగములనుండి పరిణామమును పొంది యిట్లు వికసించినవే కాని, ఒక్కసారిగా దేవుడు ఆయా దేశ ప్రజల మోక్షమునకు నిత్యముగను, శాశ్వతముగ నుండునట్లు ప్రత్యేకముగ వేరువేరు నూతనసందేశముల నేర్పరచలేదు. ఆయాదేశములలోని పూర్వపు ధీమంతులు, తమరు దేవుని పుత్రులమని గాని, దేవుని దూతలమని గాని, దేవుని యవతారముల మని గాని, దేవుని ప్రియభక్తులమని గాని, అప్పటి ప్రజల నందరను నమ్మించి, నిజముగా తమకు దేవుడే ఉపదేశించెనని నమ్మిన విషయములను గ్రంథములలో నెక్కించి, వానిని వేదములు, బైబిలు, ఖురాన్, మొదలగు మతగ్రంథములుగ ప్రజలలో వ్యాపింపజేసిరి. ఇప్పుడు ప్రపంచములోనుండు ముఖ్యమతములన్నియు నీలాగుననే బయలుదేరినవి. ఈ నాడిట్లు క్రొత్తమతములు బయలుదేరక, పూర్వమతములలోనే సంస్కారములను కల్పించుచు వానినే నూతనమతములుగ మార్పించుకొనుచున్నారు. దీనికి కారణమేమి? ప్రపంచములో నాగరికత విచక్షణ జ్ఞానము ప్రజలలో నభివృద్ధి యైనకొలది మూఢవిశ్వాసములు తగ్గి యెట్టిజ్ఞాని బయలుదేరినను ఆయన దేవుని దూతయని భావించు దినములు పోయినవి. కాబట్టి యీకాలములో, నెట్టి జ్ఞానిగాని, యెట్టి మతగ్రంథముగాని బయలు వెడలినను సత్యమంతయు వారిలోనే యిమిడియున్నదని ప్రజలంగీకరిం

చరు. ఈ విధముగానే, ఆయా సంఘముల పూర్వచరిత్రలను, వాని మత సాంఘిక పరిణామములను పరిశీలించుచున్న విద్యాధికులు, పూర్వమతములు కూడ దైవదత్తములు కావనియు, లోపభూయిష్ఠములే యనియు, కాలానుసారముగ వానిలోని విధులన్నియు మార్పబడవచ్చుననియు, విమర్శన పూర్వకముగ ప్రపంచమునకు చాటుచున్నారు ఇప్పటి సామాన్య నైతిక సూత్రములుకూడ పూర్వకాలపు అడవిజాతుల వారి మూఢ మతాచారములతో కలసియే యున్నవి అట్టివి లేనియెడల నిప్పటిసంఘములే బయలుదేరవు. ఒకవేళ కొన్ని బయలుదేరినను, అవి యిప్పటివరకు జీవించ నేరవు సాంఘికదృఢత్వమునకే యీనైతిక సూత్రపరిణామము క్రమక్రమముగా వృద్ధినొందినది. దేవునిచేత నెన్నడు మన మనశ్శిలాఫలకములమీద చెక్కబడ లేదు.

మత విషయములలోని సత్యమును నిర్ణయించుట కెవరికిని సాధ్యపడదు. వీనికి ప్రత్యక్ష ప్రమాణము, ప్రపంచము పుట్టినప్పటి నుండియు నీ రోజువరకు దొరక లేదు. ముందు దొరకబోదు. అనుమాన ప్రమాణమే మనకాధారము. ఏమతస్థుడు గాని, తన మతమే సత్యమని మరియొక మతస్థునిచేత నొప్పించుట కడుదుర్లభము. మతవిషయములను, ప్రతివాని యొక్క చిత్తవృత్తికిని వదలివేయువలెను. కాని సంఘము విడిపోకుండ దృఢముగా నుంచుటలో మతముకూడ ముఖ్యబంధనములలో నొకటియని చెప్పవచ్చును. ఐకమత్యమునకును,

స్వాతంత్ర్య సంపాదనకును, భాషతో పాటు నిదియు నొక సాధనము. హిందూ దేశములో మతములనేకము లున్నవి. హిందువులలోనే ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, జైనమతము సిక్కుమతము, బౌద్ధమతము మొదలగు శాఖలనేకములున్నవి. ఇన్నియున్నను, మనము ఒండరులయందు సమానము, సానుభూతియు కనుపరచి క్రైస్తవమత శాఖలవారివలెనే కలియవచ్చును గాని, ప్రస్తుతము శిలారూపము దాల్చిన వర్ణభేదములు మన ఐకమత్యమునకడ్డు తగులుచున్నవి ఈప్రత్యేక వర్ణభేదములకు, ముఖ్య కారణము ప్రస్తుత హైందవ మతముతో సంబధించిన కర్మకాండయే పూర్వకాలమందు వృత్తులనుబట్టి వేరైనను, వానిని మార్చుకొనుచు, కలియుచుండిన వర్ణము లిప్పుడు కలియకపోవుట మిక్కిలి శోచనీయము

ఆర్యుల శ్రుతులను బట్టి యేర్పడిన యుపనిషత్తులు కొంతవరకైనను హేతు పూర్వకములై తక్కిన వర్ణములవారిని కూడ మన హిందువులలో కలియుటకు వీలును కలుగ జేయుచున్నవి కాబట్టి మన ఋషులచే పూర్వము ప్రతిపాదింపబడిన వేదాంత సూత్రములకే ముఖ్య స్థాన మిచ్చి, వానిని ప్రజలకుబోధింపవలెను. మనప్రస్తుత శ్రౌత స్మార్త కర్మకాండ, ఐహికాముష్మిక సౌఖ్యములు రెంటికిని నష్టము కలుగ జేయు చున్నదనియు, చేతనైనంతవరకింకను దానిని తగ్గించుకొని మూఢవిశ్వాసములను పోగొట్టుకొని, గుణకర్మలను బట్టియే ఆయా తరగతులలో చేరు స్వభావ సిద్ధమైన పద్ధతి నవలంబించుటయే

ముంచిదని మన హైందవ సోదరులకు నచ్చజెప్పుట విద్యాధికుల విధి. మనమీ సత్యమును ప్రకటించుచు మానవ సౌభ్రాతృత్వమునకు తోడ్పడవలెను గాని సుమారు 25 కోట్ల హిందువులిట్లు చెల్లాచెదరై మూఢవిశ్వాసము మూఢాచారములు పట్టుకొని ప్రేలాడుచు అనవసర ద్వేషములను పెంచుకొని, శిలారూపకమైన యీ ప్రత్యేక వర్ణములు అంతర్వర్ణములు నింకను స్థిరరూపమును దాల్చునట్లు చేయుట వెఱ్ఱితనము. సంఘాభివృద్ధికి భంగకరము, రాజకీయాభ్యుదయ సమస్యా పరిష్కారమునకు గొప్ప అడ్డు. స్త్రీ స్వాతంత్ర్యమునకును విజ్ఞానాభివృద్ధికిని పౌరత్వమునకును శృంఖలముగ నేర్పడుచున్నవి.

మన పూర్వాచార పరాయణులకిది యంతయు తలకంటగింపనుమాట నిశ్చయమే వారికోపాగ్నికి మనమాహుతులమగుదుము గనుక వారిని ఒప్పించుటకు ప్రయత్నించినలాభము లేదు. మతములన్నియు మానవుల యూహలలో నిండినవి గాని, సత్యమంతయు వీనిలో నిమిడి యుండలేదనెడి సూత్రమును, దురాగ్రహము గల మతాభిమానులంగీకరించరు. దురభిమానము లేని వారు కూడ కొంత సంకోచముతోనే దీని నంగీకరింతురని నేననుకొనెదను ఈవిషయమెట్లున్నను ఇతర మతముల వారికి మన హిందువులలో వలె, క్లిష్టమైన కర్మకాండ లేదు. వారిలోకూడ కొన్ని హేతు పూర్వకములుగాని మూఢ విశ్వాసములు (Dogmatic beliefs) ఉన్నవి కాని అవి మానవ కళ్యాణమునకు, ప్రోద్బలమొసంగగల మతాంతర

వివాహాములకును భోజన ప్రతి భోజనములకును అడ్డు కలుగ జేయుచుండలేదు. భగవద్గీతలో చెప్పిన ప్రకారమెవరి మత ధర్మములను వారవలంబింప వలసియున్నను సాంఘిక విషయములలో వారి మతములు మానవ సౌభ్రాతృత్వమున కెట్టియాటంకములు కలుగజేయకూడదు. కాని మన మతము ప్రస్తుతము వంకరమార్గము పట్టినది.

నిజమయిన హైందవ మతమునకు సంబంధించిన యుపనిషత్తులు, భగవద్గీత, మొదలగు గ్రంధములు గాక, శ్రుతిస్మృతి పురాణేతిహాసములలోని కర్మకాండంతయు అయాకాలములకు తగినట్లు మారుచుండినను, మనము వానిని నిర్బంధముగ నాచరించి తీరవలెననియు, లేని యెడల నరకమున పడుదుమని యు ప్రస్తుత మాచరణలోనున్న మన హిందూ మతము స్పష్టముగ చెప్పుచున్నది. నైతిక ధర్మములను ప్రజలచేత నను ష్ఠింపజేయుటకీ యీ కర్మ కాండాచరణము అవసరము లేదు. ఐహికాముష్మిక సుఖముల కీ వర్ణవిభేదములు పాటించ నక్కర లేదు జ్ఞాన భక్తి కర్మయోగములకు కీ శ్రౌత స్మార్త కర్మకాండలు అప్రధానములు మనలోని లక్షోపలక్షుల వర్ణములను కలియకుండ జేసి, పూర్వ మూఢాచారములను సంప్రదాయములను విశ్వాసములను నిలువ బెట్టుటకు ప్రయత్నించుట మన యాధునిక విద్యాధికుల ధర్మము కాదు పూర్వాచార పరాయణులు ఆచరణలో తక్షణము పెట్టజాలని నామాటల వలన ప్రయోజన

మేమని యడుగవచ్చును. సంఘమును ఒక్కసారిగా మన యిష్టము వచ్చినట్లు నడిపించుటకు అది చలిమిడిముద్ద కాదు. కాని యీ కాలములో ఆచరణములో పెట్టని, పెట్టజాలని నిర్బంధశ్రౌతస్మార్త కాండల ననుసరించియే శూద్రులై, పైకిద్విజులమని చెప్పుకొనుచు అర్థము తెలియని ముక్కలు మరియొకరి చేత నేరుపు పెట్టించుకొనుచు, తమను స్వాయముగా కర్మలను చేసికొనలేక వర్ణాశ్రమ ధర్మవాదులమని విర్రవీగుచు, లోకవంచకులు, స్వవంచకులునై యుండుటకంటె సత్యమని నమ్మిన దానిని వెల్లడించుటకు ప్రయత్నించుచు ని ప్రస్తుత కర్మకాండలో చాలా భాగము నిరుపయోగమని త్యజించి, తన సంఘములోని లోపములను కనుపరచుచు దానివిద్యాభివృద్ధికి తోడ్పడుటయే శ్రేయస్కరమని నాయభిప్రాయము. ఆర్యసామాజికులవలె మనమందరము ప్రస్తుతము వేదమతమునే అనుసరించినను, కొంతవరకు బాగుగనుండును. శ్రుతులలో చెప్పిన షోడశ సంస్కారవిధులకు కూడ తిలోదకములు నిచ్చుచున్నాము. దానిలో చెప్పిన వర్ణస్వరూప లక్షణము లిదివరకే నశించినవి. ప్రజలకోదేని నిజానిజములను వెల్లడి చేయుటకు మార్గము మన శ్రుతిస్మృతులను తెలిగించి చూపుటయే. జ్ఞానకాండ కర్మకాండల యన్యోన్య సంబంధము ఈ కాలములో నెంతవరకు నిలచియున్నదో, యీ కర్మకాండ మెంతవరకు ఆచరణలో పెట్టుటకు యోగ్యమో జనులకు తెలుపుట మన విధి

# ఆధునికసాంఘిక రాజకీయ చలనములు.

———— :o:

బందరుకు రైలు వేయఁబడునని అరండల్ దొరగారు ఆ పట్టణవాసులకు తెలియఁజేయఁగా వర్తకులు మొదలగు వారు తమకు రైలు అక్కరలేదనియు, రైలు వేసిన యెడల తమ తినుబండారపు వస్తువులు యెగుమతియగుటవలన అతి ప్రియమగుననియు, తమ వర్తకము నశించుననియు, బయటి ప్రపంచమునకు ప్రయాణసౌకర్యములు కలిగినను, తమకు నిమ్నమునకు నీరెత్తినట్లు నెమ్మదిగ కాలముగడుపుట సంభవించదనియు, మనవిచేసికొనిరి. అప్పుడు దొరగారు వీరి మూర్ఖతకు నవ్వుకొనుచు, రైల్వేయింజను బందరుకు వచ్చుచున్నప్పుడు పురజనులందరు కలసి తమ యరచేతులతో ఒక్కసారి దానిని అడ్డగించి ఆపివేయవచ్చునని సెలవిచ్చిరి. ఆవిధముగా నే, మన కిష్టమున్నను, లేకున్నను మనదేశమునకు నలుప్రక్కలనున్న రాష్ట్రము లన్నియు, మతములను వానివాని మూలకుత్రోసి, రాజకీయ సాంఘిక స్వాతంత్ర్యములకు తమ సంఘములను ముందుకు నడిపించుకొనుచుండఁగా, మన పూర్వాచారపరాయణులు అడ్డుతగులుచు, మూడువేల శతాబ్దములకు పూర్వమందుండిన యాచారములను పట్టుకొని వ్రేలాడ చూచుచున్నారు మనచుట్టూ అన్నిమూలలనుండి అగ్నిహోత్రము మనల నావరించి ముంచివేయుచుండగా దానిని తప్పించుకొని

ఒంటరిగ జీవించు టెట్లో వీ రాలోచించు కొనుచున్నటుల కనపడదు. ప్రస్తుత రాజకీయపు పోరాటములో మన వర్ణభేదములేగాక, జాతిభేదములుకూడ నశించితీరును. ఒకవేళ వివిధ మతములు మనలను విడువకున్నను, దృష్టిదోషము, అంటుదోషము, పంక్తిభేదములు పోవుటయేగాక, అంతర్వర్ణ అంతర్జాతీయ వివాహములుకూడ ప్రబలుటకు సందేహము లేదు. వర్ణసంకరము కాకుండ మన మెంత ప్రయత్నించినను, మన వంశ పారంపర్యపు సంప్రదాయములు మనల నెంత వెనుకకు లాగుచున్నను, మన మనువులనాటికైనను, ప్రస్తుత శిలారూపమైన వర్ణభేదములు నశించితీరును బహుశః మన మూహించుకొను కాలముకంటె, శీఘ్రముగనే రాజకీయ సాంఘిక విప్లవములు బయలుదేరవచ్చును.

పెద్దపెద్ద భూస్వాములు, ధనవంతులు, తమ యాస్తులను తమ బీదసోదరుల కెట్లు పంచవలసియుందురో ఆ విధముగానే మన పురుషులు స్త్రీలకు తమతో సమానముగ విద్యాస్వాతంత్ర్యముల నిచ్చివేయవలసి యుందురు. ఈ సమానస్వత్వములను మన రాజకీయ మితవాదులును, సాంఘిక పూర్వాచార పరాయణులు నెంత శీఘ్రముగ గ్రహించిన నంతమంచిది ఇట్టి పరిణామమును, కన్నులార చూచుచు నూరకుండ లేక, వీరు అడ్డంకులువేయుటకు ప్రయత్నించుచుందురు కాని, సాంఘికపు సెలయేరు, వీరినందరిని కూడ తన ప్రవాహములో కొట్టుకొనిపోవునట్లు

చేయును. మహామ్మదీయ రాజ్యము లన్నియు, తుర్కీతో మారక తప్పనవుడును, చీనా, జపాను, రష్యాలు తమ సంఘముల నెట్లు ముందుకు త్రోసికొనిపోవుచున్నవో చూచుచున్నపుడును, బ్రిటిషుసామ్రాజ్యము ఖండములుగ విడిపోకుండ నెంత కాలము దృఢత్వము గలిగియుండగలదో మన రాజకీయ మితవాదులు గమనించినయెడల, వారేటికి నెనురీమటమ ప్రయత్నించరు. ఆవిధముగానే, మనసాంఘిక పూర్వాచార పరాయణులుకూడ రాబోవు పరిస్థితులను గ్రహించినయెడల, తమ అడ్డంకులను మానుకొని యుందురు. ఈ విప్లవములకు జంకునట్టివారు, దూరముగ తటస్థభావములోనుండి కాలము గడపుట శ్రేయస్కరము గాని, యీ రాజకీయపు సాంఘికపు మార్పులకడ్డుతగులుటకుప్రయత్నించుటవలన నెట్టి లాభము లేకపోగా, వానిని కడుశీఘ్రముగ రప్పించెదరు.

మతమును దానిని, సాంఘిక రాజకీయవిషయములతో ముడిపెట్టవలదని నా ప్రార్థన. హైందవ మత మనునది యెన్నడును మనదేశమందు లేదు. మనగీతయు ఉపనిషత్తులలో నున్న జ్ఞానకాండయే విదేశీయుల నాకర్షించుచున్నది. ఇదియే మన హైందవులందరికిని శరణ్యము. సుమారు ఐదు వేలేండ్ల క్రిందట మన బ్రాహ్మణముల కాలమునుండి అనేక మార్పులతో బ్రాహ్మణమతము అనునదియొకటి మన దేశములో ప్రబలియున్నది. ఇదియే మన ప్రస్తుత వర్ణభేద

ములకు కారణమైనది. దీనిలో ననేక సుగుణములు లేక పోలేదు. ప్రజలకు అంతశ్శుచి, బాహ్యశుచులను బోధించు టయేగాక వారిని నైతికపథమును తొక్కునట్లు చేసినది. దీనిలోని శ్రౌతస్మార్తకాండలు కొంతకాలమువరకు అతిక్లిష్టములై బ్రాహ్మణులకే క్లేశమును కలుగజేయుచు మన నైశ్య బ్రాహ్మణవర్ణమే అగ్రవర్ణముగ పరిగణింపబడి, దానికి తక్కినవర్ణములవారు దాసులగుట సంభవించినది కాలానుసారముగ, నీమతములో మార్పులు కలుగక పోవుటవలననే మన ప్రస్తుత దురవస్థకు మూలకారణమై యీ బ్రాహ్మణమతము మనలో నైకమత్యమునకు భంగకరమగుచున్నది బ్రాహ్మణులు శాకాహారులుగనున్నను, దృష్టిదోషము అంటు దోషము పంక్తిభేదముల నైన, నికముందు పాటింపరాదను. మన దేవాలయములలో నన్నివిధములవారికిని అంతరాళము వరకైనను ప్రవేశము కలుగునట్లు చేయవలయును. క్రమ క్రమముగా కాశీ జగన్నాథము మొదలగు క్షేత్రములలో వలెనే ప్రతివానిని స్వయముగా వెళ్ళి అభిషేకము, పూజ, ధర్మదానాదులు చేసికొననీయవలెను. ఇట్టి మార్పుల కిష్టము లేని పూర్వాచారపరాయణులు గబ్బిలములవలె తనయింట్ల నంటిపెట్టుకొని కూర్చుండుటయే భావ్యముగాని, సాంఘిక స్వాతంత్ర్యములను కోరుచున్న తక్కిన వర్ణములవారి కష్టం గలిగించుటవలన నెట్టి ప్రయోజనము లేదు.

శారదాబిల్లు చట్టమైన తరువాత మన ఆడపిల్లలు తమ అన్నదమ్ములతో సమానముగా తమకు విద్య చెప్పించ వలసినదని తప్పక కోరెదరు. తమ వివాహములవిషయమై తమకు సంపూర్ణస్వాతంత్ర్యములు కలుగజేయవలెనని తమ తల్లిదండ్రులను నిర్బంధించి తీరెదరు వివాహచ్ఛేదనమునకును, వర్ణాంతరవివాహములకును చట్టములను ప్యాసుచేయించు కొనుటకు శాసన సభల కెక్కుదురు. వరదక్షిణములు కోరువారును, చిన్నపిల్లలను వివాహము చేసికొనదలచిన వృద్ధవిధవలును శోకించుచుందురు మన పురాణములలోని సీత, ద్రౌపది, అహల్య, దమయంతి మొదలగు నారీమణులవలె తమకు భర్తలే దేవుళ్లని వారి యడుగులకు మడుగులొత్తుట సంభవించదు. వారి సుగుణపుంజముల నలవరిచికొనుచుందురు గాని వారి యాదర్శము మన స్త్రీలకు గిట్టదు పురుషులకు స్వేచ్ఛావిహార మిచ్చినపుడు స్త్రీలుతమ భర్తలకు బానిసలుగ నుండబోరు. ఇట్టి నూతనపరిస్థితులలో లోపములుండక పోవు. లోపములు లేని సంఘమే ప్రపంచములో లేదు కాని ఆదర్శములు కాలానుసారముగ మారకతప్పదు. సాంఘిక శరీరములో ఒకవైపునున్న రణమునకు మందువేసి మాన్పి నపుడు మరియొకమూల సెలలు వేయుచుండును కాని స్త్రీ లోకము, ఐచ్ఛికవివాహము, స్వాతంత్ర్యము కోరకమానదు. ప్రకృతి వారికి కొన్నివిషయములలో బలహీనతలను కలుగ జేసినను జ్ఞానము సూక్ష్మబుద్ధి, వారి యాత్మోపలబ్ధికి కావ

లసిన సుగుణసంపదయంతయు, పురుషులకువలెనే వారికిని కలదు కాబట్టి మన స్త్రీలును, పురుషులును కూడ, సమాన ముగ విద్యను సముపార్జించుకొనుటయేగాక, ప్రస్తుత రాజకీయ రణరంగములో దిగవలసి యుందురు. పాఠశాలల లోని విద్యార్థుల మీదనే యీభారము పడకమానదు. పాశ్చాత్యాదర్శములు గల స్త్రీపురుషులే యీరణరంగములో పాల్గొని సేనలను నడిపించవలసినవారు. ఇపుడు పంజాబు బంగాళ రాష్ట్రములలో స్త్రీ పురుషవిద్యార్థులు పాఠశాలలను కూడవీడి, కార్యాచరణలో దిగబోవుచున్నారు ఇది తాత్కాలికోద్రేకము కాదు. ఇదివరకు అపజయము నొందుచున్నను, తిరిగి అన్నిసార్లును దాస్యరాహిత్య సమరములో పాల్గొనుటకు అనేక సుందరయువకులు, స్త్రీపురుషులు తమ రాజకీయసాంఘిక స్వాతంత్ర్యములకు పోరాడ తలచినారు. మన రాష్ట్రవాసులు కూడ వెనుదీయరని నమ్ముచున్నాను. ఈసంవత్సరాంతమునందు కాంగ్రెసువారు తేర్పరుచు విధానమును జయప్రదముగా నాచరణలో పెట్టుటకు ఇప్పటినుండి మన స్త్రీపురుషులు తగుశిక్షణ నలవరుచుకొనుటకు సమ్మతించవలసియున్నది.

# హైందవ దైవజ్ఞ కళాశాల.



## Hindu College of Divinity.

9-9-29 తారీఖున బెజవాడలో దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి యధ్యక్షతక్రింద ఒక బహిరంగసభ జరిగినది అధ్యక్షులవారును, ఆంధ్రభీష్ములగు న్యాయపతి సుబ్బారావు పంతులుగారును, వేదాంతపండితులగు వావిలాల వేంకటశివావధానులుగారును మన ప్రస్తుత హైందవసంఘము యొక్క దుర్దశకు మిక్కిలి వగచుచు, సంఘైకమత్యమునకు తగిన యుపాయము లెవ్వియని చర్చించుకొని యేకాభిప్రాయమునకు వచ్చిరి మన భారతదేశములోని వివిధవర్ణముల జాతిసమ్మేళనము మన కాదర్శముగ నున్నగాని, మనము సాంఘికదుర్బలత్వమును బాపి, హైందవసంఘమును ముందుకు నడిపించి తక్కిన మానవసంఘముతో పాటు సర్వతోముఖముగ నభివృద్ధినొందమనియు, పూర్వపు శిష్టాచారసంపన్నులు సంఘమును వెనుకటిపద్ధతులమీద నడిపించదలచుకొన్న యెడల మన మధోగతిపాలు కావలసినదే యనియు, నీ ముగ్గురి యుపన్యాసముల సారాంశము. ఆచరణలో మనము కొఱ

పడుచున్నను, ఈ వివిధవర్ణజాతుల సమ్మేళనము, ఇప్పటి జాతిమతద్వేషములను నశింపజేయుటకు మన మాదర్శముగ నుంచుకొని ప్రవర్తించవలెనని యీ ముగ్గురే కాభిప్రాయులైరి. వీరిలో, న్యాపతి సుబ్బారావు పంతులు గారు భగవద్గీతనే ప్రమాణమతగ్రంథముగ నేర్పరచి దాని ప్రతులు కోట్లకొలది అచ్చువేయించి, బైబిలువలెనే, క్రైస్తవులు దేశమందంతటను పంచిపెట్టవలయుననియు, ప్రతిపట్టణములోను హిందూసమాజముల నేర్పాటుచేసి ధనమును ప్రోగుచేసి ప్రచారకుల నేర్పరచి గ్రామములలో ప్రబోధము జరుపుచుండవలెననియు, నిట్లు ప్రచారకులను తరిబీతు చేయుటకు ఒక దైవజ్ఞకళాశాలను మన యాంధ్రదేశములో స్థాపించి పని ప్రారంభించవలెననియు, దీర్ఘోపన్యాస మిచ్చిరి. ఈయన చాల ధనము వెచ్చించి, రాజమహేంద్రవరములో హిందూసమాజము నేర్పాటుచేసి, సుమారిరువదియైదు సంవత్సరములనుండి భగవద్గీతలో పరీక్షలు నడిపించుచు, వానిలో నుత్తీర్ణులైన విద్యార్థులకు పారితోషికముల నొసంగుచున్నారు. వృద్ధులయ్యు, వీరుపట్టణములకు పోయి, వారిసమాజమునకు శాఖలుగగాని, ప్రత్యేకస్వతంత్రము కలవిగగాని, కమిటీల నేర్పరుచుచున్నారు. బెజవాడలో,కొండపల్లి రామచంద్రరావు బి. యె, బి, యల్, గారు సెక్రటరీగానుండి ఒకసమాజమేర్పచునటులు తీర్మానము కూడా చేయబడినది. హైందవసంఘమును సరియైన పునాదులమీద నిలుపబెట్టి, ఆ సంఘము

లోనివా రితరమతముల నవలంబించి హైందవసంఘమును క్రమేణ బలహీనపరచకుండ ఈకమిటీలు తోడ్పడగలవని వీరి ముఖ్యాభిప్రాయము. బైబిలును కోట్లకొలది ప్రచురించి స్వల్పఖరీదుకు అమ్ముచు క్రిస్టియన్ మిషనరీలు అనేక లక్షల పౌండ్లు ప్రోగు చేయుచున్నట్లు మనము, భగవద్గీతవలన ధనము సమకూర్పవచ్చుననియు, అన్ని దేశములలోను ఆయా భాషలలో దాని తర్జుమాలు వెదజల్లవచ్చుననియు, వీరి యాశయము.

బైబిలును చదువుకొని, దానిలోని మతనైతికసూత్రములను గ్రహించి మనలోనుండి క్రైస్తవులగుచున్న వారు మిక్కిలి అరుదు ఆగ్రంథమును ఉగ్గుపాలతో చదువుకొని దానిలోనుండు నీతులను ఆచరణలో పెట్టుచున్న వా రంతకంటె నరుదు. వారి సామాజిక వ్యవస్థయు, మానవసేవయు, ఆర్థిక ప్రయోజనము, సాంఘికస్వాతంత్ర్యము లే, మన హైందవుల లోని నిమ్నజాతు లనువారిని, క్రైస్తవ మహమ్మదీయమతములను స్వీకరింప జేయుచున్నవి. భగవద్గీతనే ప్రమాణ మత గ్రంథముగ నేర్పరచి, దానికి విశాలదృష్టితో ధారాళమైన యర్థము నిచ్చినను, సంఘములోని వివిధవర్ణముల వారిలో భోజన ప్రతిభోజనములు, అన్యోన్యవివాహములు, మానవ సేవ, దయార్ద్రహృదయము, సానుభూతి మొదలగు సద్గుణములు క్రైస్తవమిషనరీలవలె మన మొంచెరెలయందు కనుపరచజాలనియెడల, పెనాయకుల యీ దేశము నెర వేర నేగగు

వీరు బ్రాహ్మణత్వమును, బ్రాహ్మణ సదాచారములను పెంప నక్కరలేదు. తక్కిన వర్ణములవారిని, ఇతరజాతులవారిని బ్రాహ్మణత్వమును స్వీకరింపజేయుచున్నపుడే, మన హైందవ మతము కూడ క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధమతములవలె వీర్యవంతమగునుగాని, కేవలము మాటలవలనను, సలహాల వలనను కానేరదు. సర్వమానవ సౌభ్రాతృత్వమును నుపచరించని, శిలాయాపమైన ప్రస్తుత చాతుర్వర్ణ్య సామాజిక వ్యవస్థ యీ ప్రపంచములోని వివిధసంఘసంఘట్టనములో నిలువనేరదు.

ఇప్పు డేర్పడబోవు కమిటీమెంబర్లు ఆవరణలో నేను కాడినను, మీ రేర్పరుపబోవు ప్రచారకులైనను, తమరు చేయు బోధనల కనుగుణముగా నడచుచు తమ యుపన్యాసముల వినువారి శంకలకు, శాస్త్రములనుండి సమాధానమీయగల వారై యుండవలెను. హైందవమతమునుండి విడివడిన శాఖలగు ఆర్యసమాజ, బ్రహ్మసమాజ, జైన బౌద్ధమతములను విమర్శించగల వారై యుండవలెను. ప్రపంచములో నెక్కువ ప్రచారమందున్న క్రైస్తవ మహమ్మదీయ, కన్ఫ్యూజియనిజము, జోరోస్ట్రియానిజము మొదలగువానిలోని మతసూత్రములను తెలిసియుండవలెను. దేశభాషగాక యింగ్లీషు, సంస్కృతము ఉర్దు, హిందీభాషల నైనను నేర్చుకొని యుండవలెను ఇట్టి వారిని తయారుచేయుటకు న్యాయపతి సుబ్బారావు, కాశీనాథుని, నాగేశ్వరరావుగార్లవంటి ధనవంతులే ముందంజవేసి తమ

ధనమును ధారాళముగా తమకు నిలచియున్న కొద్దిజీవితకాలములోనే వినియోగించినపుడే మావంటి సామాన్యగృహస్థులలో ఉత్సాహము త్యాగబుద్ధి జనించునుగాని, యీశుష్కోపన్యాసములు కేవలము అరణ్యరోదనములై, వీరేర్పరుచు కమిటీలు శవప్రాయములై గాలికెగిరిపోవుట కెట్టిసందియము లేదు. సర్ అన్నామలచెట్టిగారు, పండిత మదనమోహన్ మాళవ్యగారు స్థాపించిన విశ్వవిద్యాలయములవలె గాకపోయినను, ఒకటిరెండు లక్షలనైనను ధనమిచ్చి యీవిషయములో త్రికరణశుద్ధిగ పని ప్రారంభించినయెడల మన హైందవసంఘ పునరుద్ధారణకు, వేలకువేలు మనశక్తి గొలది, యిట్టి దైవజ్ఞకళాశాల శాశ్వతపుఫండునకు ధనమీయగలుగుదుము. ఇంతకంటె యుత్కృష్టకార్యము మరియొకటిలేదు. దేశములో జాతి మతవైషమ్యముల నణచివేసి నైతిక వేదాంతిక జ్ఞానమును ప్రజలలో వృద్ధిచేయుటయేగాక శరీరమనోదార్ఢ్యములను పెంపొందచేసి మూఢవిశ్వాసములను తొలగించి హైందవసంఘమును బలీయముగ చేయుటకంటె మరి వేరొండు ఘనకార్యమెద్ది? రాజకీయ, ఆర్థికాభివృద్ధులకైన నిదియే పునాది. బ్రాహ్మణేతరులందరు నీ యుద్యమములో ముఖ్యముగ పాల్గొనవలెను. పూర్వపు సదాచారములను, సత్సంప్రదాయములను నిలువబెట్టుకొని స్వగౌరవమును కాపాడుకొనవచ్చును. జన్మవలననే ఆధిక్యత లేదని చాటుటకు శాస్త్ర పరిశోధనల నిట్టికళాశాలలో చేయించవలెను.

సాంఘికధర్మముల పరిణామమును అన్యజాతీయ ధర్మములను వ్యాపింపజేసి, ప్రజలలో విమర్శనజ్ఞానము నభివృద్ధి పొంద వలెను.

మనము చేయు దానములు వ్యక్తులకును, స్వల్పవిషయములకును వెదచల్లక మన మీయగలిగిన కొద్దివిరాళములై నను ఒకచోట చేర్చి యిట్టి యుద్యమములకు వినియోగించి గొప్ప సంస్థాపనల నేర్పాటు చేయుచుండవలెను. మన పూర్వుల అమూల్యమగు జ్ఞానమును, భౌతిక జీవనముతో సంపుటీకరణ మొనర్చి, తక్కిన మానవ సంఘములతోపాటు ముందుకు నడిపించక పోయిన యెడల, నిప్పటివర్ణ భేదములు మరింతవృద్ధియై, వైషమ్యములు ప్రబలి విప్లవములు బయలుదేరి, పూర్వపు సదాచారములు కూడ కొట్టికొనిపోయి, హైందవుని ఆనవాలు కూడ పట్టలేక పోవుట తటస్థించును. హైందవ సంప్రదాయ జ్ఞాన విజ్ఞానము లమూల్యంబులును దీని ప్రత్యేకత నశించును ఇప్పుడు, ప్రతి సాంఘికాచారము కఠిన విమర్శనమునకు లోనగుచున్నది. పూర్వపు కట్టుబాట్లు సడలిపోయినవి. ఇకను, ప్రస్తుతము అమలులో లేని కర్మకాండయు అవసరమగు నాధ్యాత్మిక జ్ఞానము, సంస్కృతభాషలోనే యుంచుకొని మనబ్రాహ్మణులలో కొందరు కులుకుచు కూర్చుండుట విషాదకరము. దేశ భాషల లోనికి, వాని ననువదించి ప్రజలయెదుట నుంచవలెను. ఇక నెంతకాలము అర్థము తెలియనిమంత్రములనోటితో నుచ్చరించుచు, ఊరక కొన్నిక్రియలను చేయుచు స్వవంచకులమై నం

ఘమును నిర్జీవముగ చేయుదలచెదరు? బ్రాహ్మణులకుండవల సిన సదాచారసంపత్తిని అన్నివర్ణములవారికిని జాతులకును బోధించకూడదా? అట్టి యాచారముల నవలంబించువారినంద రిని బ్రాహ్మణులుగ నేలభావించకూడదు? మిక్కిలి కొద్దిమంది తప్ప పూర్వకర్మకాండలయందును ఆచారములయందును విశ్వాస మున్నవారు లేరనియే చెప్పవచ్చును. ముప్పదిమూడు కోట్ల భారతీయపయోసిధిలో పూర్వాచార పరాయణులు ఒక నీటిబొట్టు. కాబట్టి మన హైందవులను నేలవిడిచి సాముచే యకుండ మనజ్ఞానవిజ్ఞానప్రత్యేకతను నిలువబెట్టుటకు మన న్యాపతి సుబ్బారావు పంతులుగారు మొదలగు ధనవంతులు ఇప్పుడే తమత్యాగమును చూపి జమీందారులు పారిశ్రామికులు వర్తకులు సంపన్నగృహస్థులు మొదలగువారలకు విన్నపము చేసినయెడల వీరు త్రికరణశుద్ధిగ నమ్మిన యీ యుద్యమము తప్పక కొనసాగగలదు తాము ముందుగ కార్యాచరణలో దిగినగాని యితరులు వెంబడింప సాహసింపరు.

# స్మృతుల కాలనిర్ణయము.

:o:

పరిణామశాస్త్రమును బట్టి యీ ప్రపంచము అనేక లక్షల సంవత్సరముల క్రిందటనే యేర్పడి క్రమక్రమముగా నుద్భిజ్జములు, చేపలు, సరీసృపములు, పక్షులు, జంతువులు, తుదకు కోతులనుండి మనుష్యులు పుట్టిరని కనుపడుచున్నది. ఈ కలియుగము వంటివి యెన్నిలక్షల యుగముల క్రిందటనో యీ భూమి పుట్టుటచే, మనశాస్త్రములలో చెప్పబడిన ప్రళయములు, భూమిమీదనుండు సముద్రములు పొంగి దేశములను ముంచివేయుటయు, తీసిపోయినపుడు, నూతన దేశములేర్పడుటయు తప్ప, భగవంతుడు ప్రతిప్రళయకాలాంతమునను నూతనముగా మనుష్యులను, తక్కిన జీవరాసుల నెప్పటికప్పుడు సృజించుచున్నాడని చెప్పుట వెఱ్ఱిమాట. మనశాస్త్రములలోనే క్షరాక్షరవిచారము చేయుటలో కాణాదుని ఆరంభవాదము [Atomic theory] కపిలుని యుత్క్రాంత వాదము [Evolution] ముఖ్యముగా గనుపింపవలెను. వీనికంటె కూడ మనవేదాంతము పైమెట్టుకెక్కి క్షేత్రక్షేత్రజ్ఞ విచారము చేయుటలో ప్రకృతిపురుషులకభేదము కల్పించి, వివర్తవాదమును [Spiritiual monism] బోధించుచున్నది. మన మత గ్రంథములన్నిటికిని మొదటిదైన ఋగ్వేదములోని

నాసదీయసూక్తముయొక్క ఋషి సృష్ట్యారంభమందు, సత్తు అసత్తు అనునవి లేక అంధకారమయమై భేదాభేదవిరహితజలముగ నుండవచ్చుననియు, లేక సర్వవ్యాపియగు బ్రహ్మము అసత్యమగు మాయచేత నాచ్ఛాదితమై యాసత్తు యొక్క విసర్గము వ్యాపింపజేసి యుండవచ్చుననియు, నీ వ్యాపన మెచ్చోటనుండి వచ్చెనో యెవరెఱుంగుదురనియు, ఒక వేళ యీజగత్తున కధ్యక్షుడగు హిరణ్యగర్భుడొకడుండినను ఆయనకైనను తెలియదేమో యనియు సందేహములు వెలిబుచ్చెను. ఈసూక్తమునందున్న విషయము తొలుత తైత్తిరీయబ్రాహ్మణమునందును, ఉపనిషత్తులందును పిదప వేదాంత శాస్త్ర గ్రంథములందును బహు సూక్ష్మముగ విచారింప బడినది.

ఇట్టి విషయములో, మన యాచారకర్మకాండలు గత అయిదు వేలేండ్లలోపుననే మనఆర్యులచే యేర్పరుపబడి కాలానుసారముగ, ఆయా దేశ విభాగములలో అనేక విధములుగ పరిణామమును పొందుచుండగా, మన వర్ణాశ్రమ ధర్మములు సృష్ట్యాదినుండియే భగవంతునిచే నిర్మింపబడినవని సనాతనధర్మవాదులు మనలను మోసపుచ్చుటకు ప్రయత్నించుట కంటె హాస్యాస్పదమైన విషయము మఱియొకటి యుండబోదు మన పూర్వమతగ్రంథకాలము నిర్ణయించుటకు మన హిందువులును, పాశ్చాత్యులును అనేక ప్రయత్నములు చేయుచున్నారు గాని యింతవరకు నిశ్చయమగు కాల

నిర్ణయము దొరకలేదు. ఇంకను అనేక విధములగు పరిశోధనలు జరుగుచున్నవి. అధునికశాస్త్రజ్ఞుల యభిప్రాయముల నన్నింటిని పరిశీలించి ఆ యా గ్రంథముల కాలములను క్రీస్తుశకమునుండి వెనుకకు ముందుకు లెక్కించి సుమారుగా నీ క్రింద నుదహరించుచున్నాను.

| | | |
|---|---|---|
| 1. వేదకాలము | క్రీస్తుపూర్వము | 5000 మొ |
| | | 2500 |
| 2. నూతసంహితలు, మంత్రములు, బ్రాహ్మణములు, ఆరణ్యములు, | | 2500 |
| | | 1000 |
| 3. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు. షడ్దర్శనములు | | 1600 |
| | | 600 |
| 4. భారతయుద్ధము | | 1400 |
| 5. మొదటిచిన్న భారతకావ్యము, గీత | | 900 |
| 6. ధర్మసూత్రములు (బోధాయన ఆపస్తంబ అశ్వలాయన) | | 900 మొ |
| | | 200 |
| 7. మహావీరుడు, [జైనులగురుడు] | | 800 |
| 8 బుద్ధదేవుడు | | 543 లేక 477 |
| 9. శౌనకుడు మొదలగు అనుక్రమణికలు | | 400 |

| | | |
|---|---|---|
| 10 పాణినివ్యాకరణము | 350 | |
| 11. అశోకుడు | 263 | |
| 12. పతంజలియోగసూత్రములు | 250 | |
| 13. కాత్యాయనుడు | 240 | |
| 14. పరిశిష్టగ్రంధములు | 300 | మొ |
| | 00 | |
| 15. స్మృతులు (మనువు, యాజ్ఞవల్క్యుడు, గౌతముడు, వశిష్ఠుడు పరాశరుడు, హారీతుడు, ఔశనుడు మొదలగువారు) | 200 | |
| | 900 | |
| 16 పురాణములు, కావ్యములు | 320 | |
| 17 ఆగమములు, భక్తిమార్గగ్రంధములు | 550 | |
| | 1200 | |
| 18 శంకరాచార్యులవారు కుమారిల భట్టు గౌడపాదాచార్యులు | 700 | |
| 19 రామానుజాచార్యులవారు యామునాచార్యులవారు | 1200 | |
| 20 మేధాతిథి | 1000 | |
| 21 విజ్ఞానేశ్వరుని మితాక్షరము | 1200 | |
| 22 మాధవ శాయనాచార్యులవారు | 1400 | |

